# భాషాశాస్త్రము

S. RAMAKRISHNA SASTRY

## మొదటి ప్రకరణము

### స్వభావము - పరిమితి - ప్రయోజనము

భూగోళశాస్త్రము, జీవశాస్త్రము మొదలైన శాస్త్రములున్నట్లే భాషకుఁగూడ నొక శాస్త్రమున్నది. భాషలలోఁగల ప్రతివిషయమును గూర్చి, వాని వస్తుసామగ్రి, తత్త్వము మొదలైనవానిని గూర్చి భాషాశాస్త్రము విచారించును. లోకమందున్న భాషలనిర్మాణము, వాని చరిత్ర, మార్పులు, సంబంధము, భేదములును, వాని భేదకారణములు, నియమములు మొదలైనవానిని గూర్చి భాషాచరిత్ర పరిశోధించును. భాషాశాస్త్రము ముఖ్యముగా నీ క్రింది ప్రశ్నలకు సమాధానమరయును. భాష యే ప్రాగంభదశనుండి యభివృద్ధి చెందినది? వివిధమైన భాష లే యే విధముల భావవ్యక్తీకరణములఁ జేయసాగినవి. సన్నిహిత భాష లెట్లు విడిపోయి భేదించినవి. ఎందుచేత? సామాన్యముగ భాషలోఁగాని మాట్లాడు వ్యక్తిలోఁ గాని కల మార్పులలో గమనింపఁదగిన నియమము లేవైనను గలవా? అనునవి. ధ్వనుల యుత్పత్తి, వాని కూడికవలన నక్షరములు, నక్షరసముదాయమువలన పదములు, వాని కూర్పువలన వాక్యములు నేర్పడు భాషాతత్త్వమును గూర్చి భాషాశాస్త్రము విచారించును. మఱియు, భాషోత్పత్తి, దాని వృద్ధి పరివర్తనముల కారణమును గూర్చి యీ శాస్త్రము పరిశోధించును. కొన్ని భాషలు శబ్దజాలమునను, వ్యాకరణమునందును సాదృశ్యము గల్గి యుండును. భాషలను వివిధజాతులుగా విభజించుటకీ సాదృశ్యములు దోడ్పడును. ఒకజాతియందలి యొకభాషతో నింకొకభాషకుఁ గల సాదృశ్యములను వివరించి వ్యాఖ్యానించుట యీ శాస్త్ర[illegible]యోజనము. మఱియు భాషాజీవితమందలి వివిధకాలములందు గో[illegible]ంచు విషయములను, రూపములను పోల్చుచు దాని చరిత్రను దెల్పుటకు, భూత వర్తమాన కాలములందా భాషలోఁ గల రూపములను గూర్చి విచారించును.

భాషా నిర్వచనము

మన భావముల నితరులకుఁ దెలియఁజేయు సాధనము భాషయనఁబడును. 'ఆ యా భావములకు సాంకేతిక పూర్వకముగ నిర్ణయింపఁ బడిన స్పష్టమైన ధ్వనుల మూలమున భావములను వ్యక్తీకరించుట భాష' యగును. భావములను మూగసంజ్ఞలవలన వ్యక్తీకరింప వచ్చును. కాని భాషాశాస్త్రము పరిశీలించు దృష్టిలో సంజ్ఞలు భాష యనఁబడదు. భాషించుటయే భాష యగును. భాషించుట మానవుని విశిష్టలక్షణముగా పరిగణింపఁబడినది. పై నిర్వచనమునకుఁ జెందిన యే మానవోచ్చారణమైనను సరియే యీ శాస్త్రమునకు సామగ్రి యగును. ఏ భాషయుఁగూడ ననాగరికమైనదని కాని, ప్రాఁతపడినదని కాని త్యజింపఁబడదు. మానవభావముల విశేష ప్రయత్నముల సంపూర్ణముద్రతో భాష సంపర్కమును గల్గియుండును. 'భావవ్యక్తీకరణముతో సమానముగా ధ్వని నుచ్చరించుటకు మానవాత్మచేయు బాహ్యప్రయత్నఫలమే భాష'యని యొకరనిరి. అది మానవుల మనస్సును ధ్వనిరూపమునఁ దెలియపఱచును. కాన భాషాచరిత్ర యాజాతి మానసికవ్యాపారచరిత్రకెక్కువ విజ్ఞానమును గూర్చును.

భాషాశాస్త్ర ప్రయోజనము

భాషాశాస్త్రము విజ్ఞానము గూర్చును. భాషాశాస్త్రమందలి శిక్షణ భాషావేత్త కధికప్రయోజనము నొసఁగును. వివిధభాషల లక్షణములు వ్యవహారము మొదలైన వానితో సంబంధించిన, జ్ఞాన మొక్కొక భాషయందలి కారకోచ్ఛారణ విశేషములతో ప్రత్యక్ష సంబంధము గల్గించుటకు విశేషముగ ప్రయోజనకారి యగును. భాషల సూక్ష్మపరీక్షవలన వానిలోఁ గల పోలికలు గోచరింపఁగ, నా విదేశభాషలను సహృదయముతో నర్థముచేసికొనునట్లు చేయును. జాతి, వర్ణ, పరిస్థితులలో విశేషభేదమున్న వివిధదేశీయుల మనోవ్యాపారములందు సామ్యము గలదను సత్యము, శాస్త్రీయపద్ధతిలో భాషల పరిశీలించుట వలనఁ గల్గును.

భాషాశాస్త్రమునకుఁ దగిన పేరింతవరకు నిర్ణయింపఁబడలేదు. భాషాశాస్త్రమను పేరు, భూగోళశాస్త్ర, శరీరశాస్త్రములను పేర్ల వలె సమైక్యభావము గలది కాదు. సామ్యవ్యాకరణ మనుపేరు తత్త్వ

తగిన పేరు

రీత్యా సమంజసముగా నున్నను, 'వ్యాకరణ' పదమునకుఁ గల సంకుచితార్థమువలన నది దురర్థము నొసఁగుట కవకాశము గల్గించుచున్నది. కాన నీ పేరు నిర్మాణసూత్రములను పద్ధతులను బోల్చుటకు మాత్రము ప్రత్యేకింపఁ దగినది. వాక్శాస్త్ర (Speech - Science) మనుపేరు నెవరు నంగీకరింప రైరి. శబ్దశాస్త్ర (Linguistics) మనుట కొంత మేలైనను, నది యంత మనోహరముగ లేదు. జిహ్వాశాస్త్ర (Glottology) మనుట రూపార్థములందు సంతృప్తికరముగా నున్నను, నుచితముగా లేదని పూర్వమే తిరస్కరింపఁబడినది. ఆంగ్లపరిషత్తులచే సామాన్యముగ 'సామ్యసాహిత్య' (Comparative Philology) మనుపదము వాడఁబడు చున్నది. పాశ్చాత్యదేశములలో నీ పదము నా జాతిజనులు రచించిన సారస్వతమందలి శైలి, భావము, విజ్ఞానము, శిల్పములను గూర్చి చేసిన పరిశీలనకు వాడుదురు. ఆంగ్లేయు లీ పదమును భాషాశాస్త్రమునకు వాడుట కొంత విలక్షణముగనే యున్నది. కాని ప్రారంభమున నీ సాహిత్యపరులచే గ్రీకు లాటిన్ భాషాశాస్త్రపరిశోధన మొలకెత్తుటచే నా శబ్దమునే వారు పరిగ్రహించిరి. ఒక సాహిత్య మితరభాషలతోఁ బోల్చి పరిశీలింపఁబడి నపుడు 'సామ్యసాహిత్య' మనఁబడినది. కాని యీ క్రొత్త పరిశీలనోద్దేశ స్వభావ ప్రయోజనములు, ప్రాతిపదికలో నున్న వారి యుద్దేశ స్వభావ ప్రయోజనములకు భేదించినవి. యథార్థమున కే శాస్త్రమునకైనను 'సామ్య' మను నుపపదమును వాడుట పునరుక్తి యగును. ఎందుకన ప్రతిశాస్త్ర పరిశోధనమందునను సామ్యపరిశీలన ముండకతప్పదు. శాస్త్రము సామాన్యలక్షణము లతోఁగూడి యుండును. వర్గీకరించుటయందును, లక్షణసూత్రములను ప్రతిపాదించుటయందును శాస్త్రజ్ఞానముండును. ప్రత్యేకవిషయము లందలి సామాన్యధర్మములను గుర్తించుట శాస్త్రజ్ఞానమనఁబడును. కాన

దీనికిఁదగినపేరు కుదర లేదు. సాహిత్య పదమును గొందఱు వాఙ్మయ పర్యాయపదముగా వాడుటచే నాంధ్రమున దీని కీ పేరు సుతలము దగదు. కాన సామ్యభాషాశాస్త్రమని పేర్కొనుటయే మేలు.

శాస్త్రీయ పద్ధతి

తెలుఁగు, సంస్కృతము, గ్రీకువంటి యొకానొక భాషను పరిశోధించుటవలన దాని సంప్రదాయములుగాని, ప్రయోగపద్ధతులుగాని మనకు బాగుగ దెలియవు. ఆ భాషాతత్త్వము నితర భాషలతోఁ బోల్చి చూచి వాని కారణముల నరయునప్పుడు కాని, వాని సంబంధపూర్వక పరిపూర్ణ జ్ఞానము మనకుఁ గలుగదు. ఉదాహరణమునకు, తెలుఁగుభాషలో ప్రస్తుతకాలమున నున్న వ్యాకరణరూపములను, పరిస్థితులను మాత్రము వివరించి చెప్పుట కేవలము వర్ణనాత్మకవ్యాకరణ మనఁబడును (Descriptive Grammar) ఈ భాషలో వివిధకాలములందు గోచరించు వానిరూపములను, స్థితిగతులను సేకరించి వాని క్రమపరివర్తనమును స్పష్టముగాఁ దెలియఁబఱచుట చారిత్రక వ్యాకరణమనఁబడును (Historical Grammar) అనఁగా నన్నయపూర్వ కాలమందలి శాసనభాషాస్వరూపమును, తర్వాత నన్నయకాల మందలి యాంధ్రభాషారూపమును, పిమ్మట తిక్కనకాలమందలి తెలుఁగు భాషాపరిస్థితిని, తదుపరి శ్రీనాథ పెద్దనాదుల కాలముల నున్న భాషారీతుల, నన‌ఁగా మహమ్మదీయ సంపర్కమునఁ బొందినస్థితిని, తర్వాత నవీనకాలమున నాంగ్లభాషా పరిచయమునఁ గాంచిన రూపములను బోల్చి వాని భేదకారణములను వివరించుట యగును. రెండవది కొంతవఱకు సామ్యపద్ధతియే (Comparative Method). ఇందొక కాలమందున్న భాషాస్థితితో మఱియొక కాలములో నా భాషయున్న స్థితి పోల్చఁబడును. ప్రత్యేకభాషల చారిత్రకవ్యాకరణములు భాషాశాస్త్రమున నావశ్యకమైన స్థానమును వహించుననుట తప్పదు. భాషాసామ్య పరిశీలన మనఁగా భాషలను పరస్పరము ప్రక్క-ప్రక్క పోల్చి విచారించుటయని సంప్రదాయికముగ గ్రహింపఁబడుచున్నది. యథార్థమున కీ పద్ధతులను ప్రత్యేకము సేయుట యెప్పుడును తేలిక కాదు. చారిత్రకవ్యారణము దన సామగ్రి నంతను వాడివేసి, తన పనిని ముగించిన తర్వాత నివిశాల సామ్యపరిశీలనమున చొరక తప్పదు.

ఒకానొకభాషను పరిశీలించుచు నొక పదమును గాని ప్రయోగమును గాని యొకానొక విశేష రూపమునఁ గాంతుము. ఆ పద మా రూపమున నెట్లేర్పడినదో తెలిసికొనుటకు దాని నా భాషలోఁగల ప్రాచీన రూపముతోఁ బోల్చి చూడవలెను. ఆ పరిశీలన సంతృప్తికరముగ లేని యెడల, (సామాన్యముగ నట్లే తటస్థించును) దానిని సన్నిహితభాషలందా యర్థముగల పదరూపములతోఁ బోల్చి చూడవలెను. ఆ విశేషరూపమును తెలివిగల యూహలతోఁగాని, తార్కికవాదముతోఁ గాని వ్యాఖ్యానించి సమర్థింపఁ జూచుట సర్వసామాన్యముగా నిరుపయోగ మగును. ఉదాహరణకు తెలుఁగున, చెయ్యి-చెవి, పదములు సంస్కృతమునందలి 'శయ-శ్రవ' పదములకు క్రమముగా వికృతులని తేలికగా సమర్థింపవచ్చును. కాని 'చెయ్యి' పదము ప్రాఁదెనుగున 'కెయ్ - కయి' యనురూపములతో నుండి, బహువచనమున 'కేలు' అని భారతాదిగ్రంథములలో ప్రయోగింపఁబడియున్నది. ఇది తక్కిన దక్షిణహిందూదేశ భాషలలో 'కై - కెయ్' అను రూపములలో నా యర్థముననే కనిపించుచున్నది. ఈ భాషలలో 'తాలవ్యీకరణము' (law of palatalization) వలన 'క' కారము 'చ' కారముగా మారును. కాన మూలద్రావిడ భాషలోని 'కై - కెయ్' రూప మాంధ్రమున 'కే - కేలు'గా ప్రాచీనాంధ్రమున వ్యవహారములో నుండి, తర్వాత తాలవ్యీకరణప్రభావమున 'చెయ్యి' యయ్యెనని స్పష్టమగుచున్నది. ఇట్లే 'చెవి' పదము 'కివి' శబ్దమునుండి మారినది. కాన యత్కించి ద్బాహ్య సాదృశ్యమును బట్టి సాజాత్యమును నిర్ణయింపరాదు. ఇట్టి జాగ్రత, సామ్యపద్ధతితో పరిశీలించునపు డెప్పుడును నత్యవసరమే. ఈ విధముగా మనము, సమానమగు మూలరూపమునకు దగ్గరగా తీసికొని పోఁబడుదుము. ఇంత వఱకు మన యొక్క భాషాకుటుంబమునకుం జెందిన లక్షణములను, పద్ధతులను మాత్రమే కనిపెట్టుచున్నాము. కాని భాషాసామాన్య లక్షణములను గ్రహించుటకును, వాని వ్యుత్పత్తిని పరిశోధించుటకును, వివిధభాషాకుటుంబములతోడను, భాషాజాతులతోడను విశాలముగ పోల్చి సహేతుకముగ నిర్ణయింప వలసిన యవసర ముండును.

ఈ శాస్త్రమున కే పేరు పెట్టినను, దాని పరిశీలన పద్ధతులను బట్టి యది యొక శాస్త్రమనక తప్పదు. ఇటీవలనే యీ సత్యము గుర్తింపఁబడినది. ఈ శాస్త్రమున కల్పనలకు నూహలకు నవకాశమే కాక యవసరముగూడ నున్నను, వస్తువులను విశేషముగా సేకరించి జాగ్రత్తగా వర్గీకరించిన మీఁదటనే యీ యూహలను జేయవలెను. ప్రతి నూతనోదాహరణముగూడ నీ కల్పనకు లోఁబడి యుండవలెను. ఏవో కొన్ని ప్రత్యేక నిదర్శనములపై నాధారపడి భాషాసామాన్య సూత్రముల నూహింపరాదు. ఎంత యాకర్షకముగను, ప్రత్యక్షముగ నుండినను గొన్ని స్థూలసాదృశ్యములు గల పదములను బట్టి భాషల సంబంధమును నిర్ణయింపరాదు. ఉదాహరణమునకీ తెలుఁగుమాటలు నాంగ్లపదములును బోలిక గల్గి యున్నవి: మూతి = మౌత్ (mouth); ప్రాపు = ప్రాప్ (prop); నీటు = నీట్ (neat), గుంపు = గ్రూప్ (group); చెక్కు = చీక్ (cheek); త్రోయు = త్రో (throw); అటక = అటిక్ (Attic); ఈను = ఈన్ (Ean); తెలుపు = టెల్ (Tell); పెనం=పాన్ (Pan) మొదలైనవి. ఇంత మాత్రమున తెలుఁగు భాషయు నాంగ్లభాషయు సంబంధము గలవని నిర్ణయింపరాదు. ఈ పదముల సాదృశ్యము కాకతాళీయన్యాయముగఁ గల్గినదే కాని సక్రమమైనది కాదు. పదముల యుత్పత్తి నూహలపై నాధారపడి నిశ్చయింపరాదు. సంభావ్యదృష్టితోఁగాక, యీ ధ్వనిసూత్రపద్ధతులను విమర్శపూర్వకముగా సమన్వయము చేసి పరీక్షించిన మీఁదటనే యుత్పత్తి నంగీకరింపవలయును. ఆ భాషాచరిత్రలోఁగల ప్రాచీన ప్రయోగరూపములతో నా పదమును బోల్చి చూడవలెను. ఇతరభాషలలోఁగల సజాతీయపదములను, బాహ్యసాదృశ్యమును బట్టి కాక, యీ భాషలోఁ గను గొన్న సామ్యసూత్రముల సమన్వయించి, కనుగొనవలెను. ఈ క్రింది మాటలు సంస్కృతాంగ్ల భాషలలో సమానముగా నిర్ణయింపఁ బడు చున్నవి. ఉదా: మాతృ (mother) మదర్; పితృ-(father) ఫాదర్; భ్రాతృ-(brother) బ్రదర్. అయితే ప్రాచ్య ప్రాచీనభాషయగు సంస్కృతమునకు, పాశ్చాత్యార్వాచీన భాషయగు నాంగ్లమునకు సంబంధ మెట్టిదని సందేహముండును. కాని యీ యాంగ్లపదములకు మూలమగు లాటిన్ గ్రీకు

భాషాపదరూపములతో వీనిఁ బోల్చి చూచినపుడు వీని పోలిక మఱియు స్పష్టతరముగాఁ గనుపించును

| సంస్కృతము | | లాటిన్ | | ఆంగ్లము |
|---|---|---|---|---|
| మాతృ | — | Mater | — | Mother |
| పితృ | — | Pater | — | Father |
| భ్రాతృ | — | Frater | . | Brother |

కాన నాంగ్లపదములకు ప్రాచీనరూపములగు, దాని మూలభాషలగు గ్రీకు, లాటిన్ భాషాపదములతోఁ బోల్చి చూచినపుడు సంస్కృత పదములకుఁ గల సాజాత్యము నిరూపింపఁబడి, యీ రెండుభాషలు నిండోయూరోపియన్ భాషాకుటుంబమునకుఁ జెందినవని నిర్ణయింపఁబడును. కాని లక్షలాది పదములుగల రెండుభాషలలో యాదృచ్ఛికముగాఁ గొన్ని శబ్దములు సన్నిహిత సామ్యము గలిగియుండుటలో నాశ్చర్యములేదు. దీనికి విపరీతముగా నున్నప్పుడే విచిత్రముగా నుండును. ఏ మాత్రము సంబంధము లేని రెండుభాషలం దొకటిరెండు పదములలోఁ గల కేవల(ము) యాదృచ్ఛిక సాదృశ్యమును బట్టి, భాషాశాస్త్రమందు ప్రవేశములేని జనులచే, నొకప్పుడు గొప్ప రసాభాసము గావింపఁబడుచున్నది. మొదట చూపఁబడిన యింగ్లీషు తెలుఁగుపదము లర్థమందును ధ్వనియందుఁ గూడ కేవలము యాదృచ్ఛిక సామ్యము గలవి. వానికి భాషానిర్మాణమునఁగాని, శబ్దజాలమునఁ గాని యితరబలమేమియు లేదు.

పూర్వకాలమున పాశ్చాత్య పండితులు భాషలన్నియు హీబ్రూ భాషనుండి పుట్టినవని నమ్మి, వివిధభాషలలోని ప్రతిభాషాశబ్దమున కేదో విధముగ దానితో ముడిపెట్టెడి వారు. అట్లే భారతదేశమందలి ప్రతి భాషయు సంస్కృతమునుండియే పుట్టినదని నమ్మఁబడి, దానినుండియే యితర భాషాశబ్దములన్నిటికి వ్యుత్పత్త్యర్థమును సాధించెడివారు. ఇందుచేతనే యాంధ్రభాషాభూషణమున కేతన 'తల్లి సంస్కృతం బెల్లభాషలకును 'అని తెల్పెను. 'జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్'అని మఱియొక రనిరి. ప్రాకృత భాషలన్నియు సంస్కృతమునుండియే

పుట్టినవి కాన, 'సాంధ్ర భాషయుఁ బ్రాకృ తాహ్వాయమ'ని కావ్యాలంకార చూడామణిలో విన్నకోట పెద్దన తెలిపినాఁడు. సంస్కృతప్రాకృత భాషలనుండి పుట్టి తెలుఁగు వికృతి యనిపించుకొనిన దని యాంధ్ర శబ్ద చింతామణి కర్త 'ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే, ఏషా తయోర్భవే ద్వికృతిః'అని తెల్పినాఁడు. కాని యుత్తరహిందూదేశభాషలు సంస్కృత ప్రాకృత జన్యములనుట యుచితము గాని, దక్షిణహిందూదేశభాషలఁ గూర్చి యట్లనుట సమంజసముగ లేదు. సంస్కృతభాషలోనుండి ప్రాకృత భాషలు బుట్టుటకు కారణమును, ప్రాకృతభాషలలోఁగల దేశీశబ్దములు, లేక యార్యేతరపదముల కారణమువలనను, సంస్కృతభాషాభిన్నమైన మఱియొక యార్యేతరభాష హిందూదేశమున నుండెడిదని విశ్వసించుట కవకాశము గల్గుచున్నది. ఇదియే ద్రావిడభాష యనఁబడునది. ఈ యనార్యభాషాప్రభావమువలననే దాని గుణములతో ప్రాకృతభాష లుద యింపఁగ, ప్రాకృతభాషా లక్షణములు కల ద్రావిడభాషగూడ నొక ప్రాకృత బాషయే యని కొందఱు పై రీతిగ వాదించిరి. సంస్కృత భాషాభి మానము చేతను దేశభాషలందలి నిరాదరణచేత, నిట్లు జనులు విశ్వసించెడి వారు. వేదవేదాంగములందు వాడఁబడిన కొన్ని మ్లేచ్ఛశబ్దములకుఁ గూడ సంస్కృత పదములతో నుత్పత్త్యర్థము గల్పించుచుండిరని తంత్రవార్త్తిక మున కుమారిలభట్టు దెల్పి, యా పద్ధతిని ఖండించెను. ఒకపదమున కితర పదములోని యక్షరములను ముడిపెట్టి, యేగోయొక సంస్కృతపదమును గల్పించుటయు, హలంతపదముల కజంతవిభక్తియు, స్త్రీ ప్రత్యయాది కల్పనలు చేసి, సంస్కృతభాషాపదములకుఁ దగిన ట్లర్థము గల వానినిగాఁ జేయుదురు. ఇట్టివి 'చోర్, అతర్, పాప్, మాల్, మయుర్, పిక, నేమాది' పదములు. 'చోర్' అను శబ్దము ద్రావిడభాషలో 'అన్నము, అను నర్థము కలది కాఁగా, దాని నకారాంతముగా నెంచి 'చోరీ' పద వాచ్యముగా వారు గ్రహించిరి. దారి అనునర్థముగల 'అతర్' పదమును అతర్వ' అని స్వీకరించి, తరింపశక్యము గానిదని వ్యుత్పత్త్యర్థమును సాధించిరి. అట్లే 'పాప్' అను, పకారాంత శబ్దమును 'పాప' అని అకారాంతముగ తీసికొని పాపము చేయునది, పాపి, యని యర్థమిడిరి

స్త్రీ వాచకమగు 'మాల్' పదమును 'మాలా'గ గ్రహించిరి. ఉదర వాచకమై, రేఫాంతమైన 'వయిర్' పదమును 'వైరి' శబ్ద పర్యాయ పదముగాఁ దెలుపుచు, నాకలిగొన్న వాఁడకార్యము సేయును కాన ఉదరము మానవునకు వైరి యని సమర్థించిరి. 'పిక' శబ్దము, లాటిన్ భాషలో 'పికస్' (picus) పద మీయర్థముననే గలదు. కాని లింగాభట్టీయమున 'అపి హంతః కాయతీతి పికః' - కై గై శబ్దే = కనిపించక పలుకునది. 'అప్పి రంతర్ధా' అని, కై, గై ధాతువునుండి యేర్పడునట్లుగా వ్యుత్పత్తి చెప్పఁబడినది. ఇట్టి పదములు సంస్కృతభాషాపదములే యని సమర్థించుటకును, వానికున్న యర్థమును స్థిరపఱచుటకును, సంస్కృత భాషాప్రత్యయాదులను గూర్చి దాని యర్థమున కనుకూలమైన యేదో యొక ధాతువునకు ముడిపెట్టి దాని కుత్పత్తులను వైయాకరణులు గొందఱు గల్పించిరి. ఒకప్పుడు కొన్ని శబ్దములకు కొన్ని నూత్న ధాతువులుగూడ గల్పింపఁబడెడివి. కాన నట్టి కల్పనలను మనము నమ్మరాదని కుమారిలభట్టు ద్రావిడ భాషాపదముల నుదాహరణముగా గొని చూపినాఁడు*. మఱియు రెండుభాషలు సామాన్యముగా సన్నిహితముగా వచ్చినపు డవి పరస్పరము గొన్నిపదము లిచ్చి పుచ్చుకొనుచుండును. కాన సంస్కృతమునుండి కొన్ని పదములను ద్రావిడ

---

* తద్యథా ద్రావిడాది భాషాయామేవ తావద్వ్యంజనాంత భాషాపదేషు స్వరాంత విభక్తి స్త్రీ ప్రత్యయాది కల్పనాభిః స్వభాషానురూపానర్థాన్ ప్రతిపద్యమానా దృశ్యంతే. తద్యథోదనం చోరిత్యుక్తే చోరపదవాచ్యం కల్పయంతి పన్థానమతరిత్యుక్తే అతర ఇతి కల్పయిత్వాహుః. సత్యం ముస్తీర్త్వా పతరఏవ పంథా ఇతి. తథా పాప్ శబ్దం పకారాంతం సర్పవచనం అకారాంతం కల్పయిత్వా సత్యం పాప ఏవా, పావితి వదంతి. ఏవం మాల్ శబ్దం స్త్రీవచనం మాలేతి కల్పయిత్వా సత్యమిత్యాహుః వైర్ శబ్దం చ రేఫాంతం ఉదర వచనం వైరిశబ్దేన ప్రత్యామ్నాయం వదంతి సత్యం సర్వస్య క్షుధిత స్యాకార్యే ప్రవర్తనా దుదరం వైరికార్యే ప్రవర్తత ఇతి. తద్యథా ద్రావిడాది భాషాయా మీదృశీ స్వచ్ఛంద కల్పనా తదా పారసీక బర్బర యవన, రౌమకాది భాషాసు కిం వికల్ప్య కింప్రతి పత్స్యంత ఇతి న విద్మః."

భాషలు గ్రహించినట్లే, ద్రావిడభాషనుండి గూడ సంస్కృతము కొన్నిశబ్దములను తప్పక గ్రహించియుండును. ఇందులో నొక భాష యెక్కువ, మఱియొకటి తక్కువ గాన నందుండి గ్రహింపరాదను భావముండదు. 'కుట, కుండ, నీల, పుష్కర, పుష్ప, పూజన, ఫల, బీజ, మయూర, రాత్రి, రూప మొదలగునవి ద్రావిడభాషలలో నుండి యార్యభాషలలోఁ జేరినవిగాఁ దలంపఁబడుచున్నవి. నీరమీన శబ్దములుగూడ నిట్టివే. ఆంధ్రశబ్దరత్నాకరములో ననేకపదములు, దేశ్యతద్భవములు తారుమారుగా వ్యవహరింపఁబడినవి గదా! దీనిని గూర్చి పలువుర కభిప్రాయభేదము గలదు.

భాషాశాస్త్ర విభాగము

ఏ శాస్త్రముయొక్క యభివృద్ధియందైనను, దానిని కొన్ని భాగములుగా విభజింపవలసిన యవసరము వచ్చును. ఆ విభాగములును, నా శాస్త్రాంగములును ప్రత్యేక నామములతో నిర్దేశింపఁబడును. భాషాశాస్త్రమునందుఁగూడ నట్లే. భాష వాక్యములలో మాట్లాడఁబడును. వీనిలోని వివిధభాగములు పరస్పరము నిర్మాణ లేక వ్యాకరణ సంబంధము గలిగియుండును. ప్రతిశబ్దమును కొన్ని సూత్రములమీఁద నాధారపడియే రూపమున మార్పును పొందుచున్నది. మఱియు కొన్ని స్వరములగూడిక వలననే పద మేర్పడును. స్వరము లొక పద్ధతిలోఁ గూర్పుటచేతనే నొక యర్థము సిద్ధించుచున్నది. తత్ఫలితముగా భాషా పరిశీలనమున (1) స్వరములు, (2) శబ్దస్వరూపము (3) కారకము (4) అర్థపరిణామములను గూర్చి విచారించవలసిన యవసరమున్నది. పై నాలుగు విషయముల ననుసరించి భాషాశాస్త్రము క్రమముగా నాలుగు విభాగములుగ నేర్పడినది. (1) స్వరశాస్త్రము - phonology (Gk. phono= sound =ధ్వని లేక స్వరము). (2) (శబ్ద)స్వరూపశాస్త్రము Morphology (Gk. Morphe = Shape = స్వరూపము) (3) సామ్య

కారకము - Comparative syntax. (4) అర్థపరిణామము - Semasiology (Gk. Sēmasia = meaning = అర్థము) (1) మాట్లాడునపుడుపయోగించు ధ్వనులు లేక స్వరములు, వాని వ్యుత్పత్తి, ప్రత్యేకముగ గాని, లేక కలసిగాని యవి పొందు మార్పులు మొదలగు వానిని గూర్చి స్వరశాస్త్రము విచారించును. (2) వివిధస్వరములకూడిక వలన నేర్పడు శబ్దస్వరూపవిధానమునుగూర్చి శబ్దస్వరూపశాస్త్రము పరిశీలించును. ఇందు ముఖ్యముగా నామక్రియాప్రత్యయముల కూడికచే ధాతువుల కేర్పడు శబ్దరూపము - సుప్తింగంతముల మూలమున నేర్పడు శబ్దస్వరూపమును గూర్చి ముచ్చటింపబడును. (3) పదముల కేర్పడిన తర్వాత నాయాపదములు పరస్పర సంబంధముతో సంపూర్ణార్థమును వ్యక్తీకరించునట్లుగ వాక్యమున నెట్లు కూర్చఁబడవలెనో విచారించునది సామ్యకారకము. (4) అర్థవిపరిణామశాస్త్రమున శబ్దముల యర్థమెట్లు క్రమముగా మారుచు వచ్చినవియు విచారించి, పదములకు ప్రారంభమున నర్థములెట్లారోపింపఁబడినవో కూడ చివరకు చర్చించును. ప్రస్తుత మీ శాస్త్రభాగమునకు సంబంధించిన వివిధపదముల చరిత్రను సేకరించుటకంటె చెప్పుకొన తగిన విశేషమేమియు జరుగలేదు. ఈ విషయము మానసికశాస్త్రరీత్యా చాల క్లిష్టమైనది. సూక్ష్మతరమైన భావసమాశ్రయములమీఁద నీయర్థవిపరిణామ మాధారపడియుండును గాన, మూల (కారణ)మును గుర్తించుట బహుకష్టము.

పై విభాగములలో వ్యుత్పత్తిశాస్త్ర నామము (Etymology) చేర్చఁబడలేదని తెలియుచున్నది. కాని శబ్దరూప నిర్మాణమున 'ధాతువు'ల నుండి శబ్దప్రాతిపదిక లేర్పడు ప్రక్రియయందు వ్యుత్పత్తి ప్రక్రియ చేరియున్నదనియు, శబ్దరూపప్రక్రియ (morphology) ప్రత్యయములలోఁ గల మార్పులను పరిశీలించుటయందు మాత్రమే గలదనియు గొందఱు భావించిరి. ఈ దృష్టితో భాషానిష్పత్తి ప్రక్రియ

(Etymology) ధాతువులు - ప్రాతిపదికలు నేర్పడు విషయమునుగూర్చి పరిశీలింపఁగా, శబ్దస్వరూప నిర్మాణప్రక్రియ (morphology) నామక్రియల ప్రత్యయపరిణామమునుగూర్చి విచారించును. కాని యీ విభాగమంత విశిష్టమైనది కాదు. నిఘంటుకారులు నిష్పత్తిప్రక్రియను "శబ్దము లోని భాగముల మూలరూపములను గుర్తించి వాని స్వరూపార్థ పరిణామ ములను వివరించుపద్ధతి" యని నిర్వచించిరి. శబ్దనిష్పత్తి యనగా, శబ్ద స్వరూప నిర్మాణమునఁ గలిగిన యవస్థ లేక వ్యుత్పత్తిక్రమమును వివ రించుట యని యగును. స్వరశాస్త్ర, శబ్దస్వరూపవివరణ, యర్థపరి ణామములలో సంగ్రహించిన విషయ సముదాయములను పునఃపరిశీలన చేయు విధానమే శబ్దనిష్పత్తిక్రమ మగుచున్నది. ఈ వివిధ శబ్దశాస్త్ర శాఖల పరిజ్ఞానమే శబ్దనిష్పత్తిప్రక్రియకుఁ దోడ్పడును. కాన నది భాషాశాస్త్రములో నొక భాగము గాక, శబ్దనిష్పత్తిప్రక్రియ (etymology) దాని సమన్వయమే యని స్పష్టపడుచున్నది.

ఆదర్శదృష్టితో నీ భాషాశాస్త్రమునకు సంపూర్ణముగ సు సంతృప్తికరముగను గావలసిన సాధనసామగ్రి యేదన, "ఇంతవరకు లోక మున భాషింపఁబడిన, లేక ప్రతిపాదింపఁబడిన, శబ్దసముదాయమును, దానితోఁగూడిన భావములును: (ఆ భావముల కా శబ్దములే గుర్తులు గాన.)" అట్టి సర్వసంపూర్ణమైన విషయ సముదాయమును సంగ్రహించుట సాధ్యముగాదు. ఈ శాస్త్ర పరిపూర్ణ విజ్ఞానమున కా శబ్దములనే మనము ప్రత్యక్షముగా వినవలయును. ఎందుకన భాష ముఖ్యముగ శబ్దము, లేక ధ్వనిమీఁద నాధారపడును, గాని లేఖనముమీఁద కాదు. శబ్ద మొకమా రుచ్చరించి నపుడు దానికి స్థిరత్వములేదు; లేఖనమున దాని ప్రతిపాదకత్వము నిర్దుష్టముగా నుండక, సర్వసామాన్యముగ పొర పడును. అయినప్పటికిని లేఖన మిటీవలనే కదా వచ్చినది. ఎట్టి ప్రాచీన శాసనములైనను గూడ నర్వాచీన కాలమునకుం జెందిన సంస్కారయుత

భాషలకుం జెందినవే. కాన నవి సంస్కృతము, ప్రాచీనార్వాచీన భాష లతో సమానముగఁ జూడదగినవే. మన మెఱిగిన సజీవ నిర్జీవ భాషా ప్రపంచమంతయు, మార్పుచెందినట్టియు, వివిధ పరిణామావస్థలలో నున్నట్టి సంబంధభాషల దృష్టితో, మనకు వస్తుసామగ్రి నొసఁగును. కాని భాషాప్రాథమిక రూపములును, ప్రారంభావస్థలును నష్టమై పోయి నవి. ఊహించే మాత్రమే వానిని నిలుపఁగలము. మనమెఱిఁగిన ప్రాచీనభాషలలో నష్టమైనవి గాని, లేక క్షీణలక్షణములుగలవి గాని యనేకరూపములు మిగిలి యున్నవి. వీని జ్ఞానము, సేకరించిన భాషా విషయములతో నెంతవర కుపయోగపడ గలదో మనము చెప్పఁజాలము. మనము సేకరించిన ప్రాచీన భాషావిషములయందైనను, ప్రతి పదమునకు నిర్దుష్టమైన యుచ్చారణధ్వని గాని, యథార్థమైన యర్థమును గాని యొసఁగుచున్నారమని నిశ్చయముగాఁ జెప్పగలమా? ప్రాచీన గ్రీకు భాషలో ననేకపదములకు సరియైన యుచ్చారణమును, స్వరమును గూర్చి యింకను నిశ్చయింప జాలక సందేహాస్పదముగనే యున్నది కదా! భాషాతత్త్వపరిశీలనమున నుచ్చారణయు, స్వరము నతి ముఖ్యములు. వీథిలో మాట్లాడు భాష కుచ్చారణమునఁ గాని, శబ్దజాల మునఁగాని, వ్యాకరణవిషయమునఁగాని లిఖితపూర్వకభాష యెన్నటికి సరియైన ప్రతిపాదనము గాఁ జాలదు. కాలక్రమమున నుచ్చారణాది విషయములలో మార్పునొందకుండుటకై వేదములు, లేఖనము రాక పూర్వమునుండికూడ, సంహిత - పదపాఠమను భాగము లేర్పరుపఁబడి, సంహిత కుదాత్తానుదాత్త స్వరితములను స్వరభేదములతో ననుశ్రుత ముగా వల్లింపఁబడెడివి. లేఖనము వచ్చిన తర్వాతఁ గూడ నెట్టి మార్పును రాకుండుటకై యక్షర సమామ్నాయముతోఁబాటుదాత్తా నుదాత్త స్వరితములకుఁగూడఁ గొన్ని గుర్తు లేర్పరుపఁబడి, యుచ్చారణ ములో నేమాత్రము మార్పురాకుండ వేదములు రక్షింపఁబడినవి. కాని యిట్లే యితర భాషలలోఁగూడ శ్రద్ధ తీసికొనమిచే నా ప్రాచీన

కాలపు భాషలందలి పదముల యుచ్చారణ విషయమై సంకటము వచ్చినది.

అయినను సేకరించిన యీ ప్రాచీన భాషాసామగ్రి యంతయుఁ గూడ నే యొక్క భాషాతత్త్వజ్ఞుఁడు పరిశోధించుటకు సాధ్యముకానంత విశాల మైనది. ఎంత గొప్ప భాషాశాస్త్రజ్ఞునకైనను సర్వభాషా విషయము లను పరిశోధించుటకు సాధ్యము కాదు. కాన నితర శాస్త్రములందు వలె దీనియందును వివిధశాఖలను పలువురు ప్రత్యేకముగ పరిశోధిం చుట మేలు. కొందఱు పండితులు కొన్ని దేశములందలి భాషలను, మఱికొందఱు మఱికొన్ని దేశముల భాషలను చొప్పున పలువురు పలు దేశభాషలను పరిశోధించుట మంచిది. మరియొక ప్రత్యేక పరిశోధ కుఁడు వారుచేసిన కృషినంతయు నుపయోగించుకొని వివిధభాషా లక్షణములను నిర్ణయించి తెలుపును. వీనిపై నింకొక విశిష్ట పరిశోధకుఁ డీ వివిధభాషలను వానిలోఁగల సమానధర్మముల ననుసరించి ప్రత్యేక జాతులు, కుటుంబములుగా వర్గీకరించి చూపును. వీనినుండి భాషా సామాన్యసూత్రములును, మతముల (theories) ను గ్రహించును. ఒకటి రెండు భాషలలో సూక్ష్మపరిశీలన చేసిన వాఁడైనను నా భాషా తత్త్వవేత్తను కంటె, వివిధ భాషాకుటుంబములు, వాని నిర్మాణ విధా నము గల విశాలభాషాసముద్రమును, పలువులు పండితులు సేకరించిన విషయములను బట్టి, సర్వసామాన్య లక్షణముల నిర్దేశించు భాషా శాస్త్రీయ దృష్టిగల వాని నెక్కువ విశ్వసింపవలయును. ఎందుకన, వాఁడే తుల్యభాషాశాస్త్రవేత్త యనఁబడును.

భాషా విషయికమైన సమస్య లనేకమున్నవి. అవి యేవన, ప్రపంచమందలి మానవులందఱు నొకటే విధమైన శరీరమును ధరించి నను, వారందఱు నొకటే విధమైనభాష నేల మాట్లాడుట లేదు? భాష ష. ది యెట్లు జరిగినది? భాషలోని పదములకు నవి ప్రతిపాదించు వస్త

వులకు నెట్టి సంబంధమున్నది! మన మనోగత భావములకు వానిని వ్యక్తీకరించు పదములకుఁ గల సంబంధమేమి? ఒక్కటే వస్తువునకు, ఒకటే భావమునకు వివిధ భాషలలో వివిధ పదములుండ నేల? ఒకే భాషలో నొకజాతికిఁ జెందిన వివిధవస్తువుల కొకటే పేరుండ నేల? భాషాభావములకుఁ గల సంబంధము సహజమా? లేక, కల్పితమా? తన భావముల నన్నింటిని మానవుఁడు సంతృప్తికరముగా భాషతో వ్యక్తీకరింపఁ గలుగుచున్నాఁడా? తర్వాత నీ భాషకును వ్రాఁతకుఁగల సంబంధమేమి? మాట్లాడక వ్రాయునపు డా వ్రాఁతకు తద్గతాభిప్రాయమునకుఁ దగిన ప్రాతినిధ్యము నెఱపుచున్నదా? ఎట్లు? మొదలగు ననేక సమస్యలు భాషావిషయమునఁ గలవు.

భాషాశాస్త్ర క్రమ పరిణామము

ఈ ప్రశ్నలకు సమాధానము దేశకాలపాత్రానుగుణముగ వివిధ రీతుల నొసఁగఁబడి, యవి యితరులచే విమర్శింపఁబడి పూర్వపక్ష సిద్ధాంతములకు దారి తీసినవి. సక్రమముగను సహేతుకముగ నున్నవి మాత్ర మంగీకరింపఁబడినవి. కొన్ని విషయము లింకను నిర్ధారణకు రాక యున్నవి. పై సమస్యలకు సమాధాన మరయు ప్రయత్నమే భాషా శాస్త్ర విషయము. అందలి కృషిఫలితమే భాషాశాస్త్ర పరిణామము. అవి భాషాచరిత్రకు దారి తీసినవి. తన్మూలమున భాషాశాస్త్ర సమస్యలకు పరిష్కారము గలుగుచున్నది.

భాషాశాస్త్రము క్రీ. శ. 18-వ శతాబ్దమున నైరోపాదేశమున ప్రారంభింపఁబడి యాదేశపండితులకుఁ గలిగిన సంస్కృత భాషాపరిచయ ప్రభావమున నభివృద్ధి చెందినది. కాని గ్రీసుదేశమున క్రీ. పూ. 3, 4 శతాబ్దముల కాలముననను, భారత దేశమున క్రీ. పూ. అనేకశతాబ్దముల క్రితము భాషావిషయక చర్చలు, భాషాతత్త్వ పరిశీలనమును బాగుగ జరిగినవి. భారత దేశమందలి ప్రాచీన భాషావాఙ్మయ మగు వేదము

నకు స్వరవర్ణోచ్చారణ రీతులను దెలుపుటకును, వానిని సంరక్షించుటకును గూడ 'ప్రాతిశాఖ్య'లను వ్యాకరణగ్రంథములు వ్రాయఁబడినవి. ఆ భాగమునకు 'శిక్షాధ్యాయ' మనఁబడును. "అథః శిక్షాం వ్యాఖ్యాస్యామః, వర్ణః (letter), స్వరః (accent), మాత్రా,, (quantity) (హ్రస్వ, దీర్ఘ, ప్లుతములు) బలం (organs of pronunciation) (వర్ణోత్పత్తిక్రమము), సామ (delivery) (ఉచ్చారణ రీతి), సంతానః (euphonic laws - సంధివలన మార్పులు) ఇత్యుక్త శిక్షాధ్యాయః" ? తైత్తిరీయారణ్యకము). అధునిక భాషాశాస్త్రమున దీనిని ధ్వనిశాస్త్ర (phonetics) మందురు. సంస్కృతవైయాకరణులు ధ్వనులను స్థాన, కరణ, ప్రయత్నాది భేదములతో వర్గీకరించి, వాని రూపములను వివరించిరి. అప్పటికే విభక్తు లేడని నిరూపింపఁబడినవి. ప్రాతిశాఖ్యల తర్వాత క్రీ. పూ. 700 సం. ప్రాంతమున 'యాస్కుఁడు' నిరుక్తమను భాషాతత్త్వ పరిశీలన గ్రంథమును రచించి, యందు భాషాభాగములను "నామాఖ్యాతోపసర్గనిపాత !'లని పేర్కొనినాఁడు. అతఁడు శబ్దముల వ్యుత్పత్తి ధాతువుల నుండి గలుగునని తెలుపుచు నందలి ధ్వనిపరిణామములను నేఁటి శబ్దశాస్త్రజ్ఞుల ధోరణిలో వర్ణలోపాగమ వ్యత్యయాదుల (syncope, Anaptyxis, Metathesis etc.,) మూలమున జరుగునని కూడ స్పష్టపఱచినాఁడు. ధాతువు ప్రత్యయముల మూలమున శబ్దోత్పత్తి యగునని యితఁడు తెలిపినాఁడు. కాని గార్గ్యుడు మొదలైన వారీధాతువాదము నంగీకరింపలే దా కాలమున. ధ్వన్యనుకరణశబ్దములకు (Onomatopoetc words) భాషలో నవకాశము లేదని ఔపమన్యుఁడు తలఁచెను. ఇట్లు బాషోత్పత్తినిఁ గూర్చికూడ వాదోపవాదము లా కాలమున పెరిగినవి. తర్వాత శబ్దార్థ సంబంధము నిత్యమా ? సాంకేతికమా ? యను విషయము (Semantics) ను గూర్చి పతంజలి తన మహాభాష్యమున పశ్పశాహ్నికములో చర్చించి, శబ్దార్థసంబంధము నిత్యమే యైనను,

ప్రాచీన భారత దేశమున

లోకప్రయోగమునుండియే నిర్ణయింపవలెనని యతఁడు చెప్పినాఁడు. కాని తార్కికులు దాని కంగీకరింపక 'ఈశ్వర సంకేతశ్శక్తిః - శక్తం పదం' అని వాదించిరి. తర్వాత భారతదేశమున వైయాకరణులు సుశబ్దాప శబ్దనిర్ణయమును శబ్దప్రక్రియాదులను గూర్చి చర్చించుకొనిరి. "రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనం వేదానాం రక్షార్థ మధ్యేయం వ్యాకరణం"అని పతంజలి చెప్పినట్లుగా, వేదములను రక్షించుటకొఱకే వ్యాకరణాధ్యయనప్రయోజనమని భావింపఁబడినది. కాని, యితర భాషలతోఁ బోల్చి భాషను వ్యాకరించు భావము వారికి పుట్టలేదు. ఏలన సంస్కృత భాష దేవతలభాష యని వారు విశ్వసించి, దాని నితర భాషలతోఁబోల్చి చూచుట కిచ్ఛగింపరైరి. ఆంధ్రదేశమున 11-వ శతాబ్దమున రాజరాజనరేంద్రుని యాస్థానమున సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషా కవిరాజశేఖరుఁడగు నారాయణభట్టు గలఁడు. నన్నయ భట్టునకుఁగాని యతనికిఁగాని కర్ణాటాంధ్రములకుఁగాని, వీనికిని సంస్కృత ప్రాకృత పైశాచీలకుఁగాని కల సంబంధమును గూర్చి విచారించు తలఁపు కలుగలేదు. ఆ కాలమున పండితులకు భాషలతారతమ్య దృష్టియే లేదు.

గ్రీసు దేశమున

ప్రాచీనకాలమున గ్రీసుదేశమునందుఁ గూడ వైయాకరణులు, పతంజలివలె, శబ్దార్థసంబంధము స్వాభావికము నావశ్యకము నైనదా ? లేక సాంకేతికము నిచ్ఛాధీనమైనదా ? యను చర్చలు చేసికొనిరి. ప్లేటో తన క్రేటిలస్ (Cratylus) అను గ్రంథమున శబ్దార్థసంబంధము స్వాభావికమని ప్రతిపాదింపఁగ, హెర్మొజెనెస్ (Hermogenes) అను నతఁడు భాష సాంకేతిక మనియు, కాలభేదముచే నది మారుచుండుననియుఁ దెల్పినాఁడు. ఇఁక సోక్రెటీసు భాష కొంత స్వాభావికమును గొంత సాంకేతికముగూడ నైయున్నదని తెల్పినాఁడు. భాషావిషయముల నొకచోట చేర్చి, వానిని వర్గీకరించి, యందువలనఁ దేలిన సాధారణ సూత్రముల నేర్పరించుటయే భాషాశాస్త్రము చేయవలసిన పని. గ్రీకువైయాకరణు లా పనిని చేయలేదు. పాశ్చాత్యదేశములలో మొట్టమొదట భాషాభాగముల నేర్పఱచి, విభక్తియను భావముమ

వెలువరించినవాఁడు 'అరిస్టాటిలు'. ఈతని భాషాకృషిని 'స్టోయికు' లను తత్త్వవాదులు గొంత వృద్ధిచేసిరి. కాని, యా పారిభాషికపదములు లాటిన్‌భాషలో నుండుటచే తర్వాతవారు వానికి తప్పుటర్థములను గల్పించి పాడుచేసిరి. తర్వాత నలగ్జాండ్రియాపట్టణమున వైయాకరణులు విభక్తివిశేషములను గుఱించియు శబ్దార్థములను గుఱించియు కృషిచేసి, 'సామ్యము - సామ్యరహిత' మను రెండు గుణములను బట్టి భాషను విభజించినారు. అలెగ్జాండరు కాలమున గ్రీసు దేశీయులకు సంస్కృతభాషతో సంపర్కము గలిగినను, వారు పర దేశీయు లనాగరికులనియు, దమభాష యీశ్వరకల్పితమైన ప్రాచీనభాష యనియు, నితర భాషలన్నియు తజ్జన్యములే యని దృఢముగ విశ్వసించిన వారగుటచేఁ దమ భాష నితరభాషలతోఁ బోల్చిచూచుటకు వారు ప్రయత్నింప లేదు. యథార్థమున కీ తారతమ్యపరిశీలనము (Comparative study) వలననే సకలశాస్త్రము లాధునిక కాలమున నభివృద్ధి చెందినవి. అట్లే భాషాశాస్త్రము (philology) గూడ నీ తులనాత్మక పరిశీలనమువలననే యభ్యుదయము సాధించినది.

క్రైస్తవమతము ప్రబలినతర్వాత బైబులు పూర్వభాగము హీబ్రూ భాషలో నుండుటచే, నది మతభాషయై, దైవదత్తమని భావింపఁబడి, ప్రపంచమందలి యితరభాష లన్నియు దానినుండియే పుట్టినవని విశ్వసింపఁబడినది. హీబ్రూభాష కుడివైపునుండి యెడమవైపునకు వ్రాయఁబడును. ఆ పద్ధతినుండియే యూరోపియనుభాష లెడమనుండి కుడివైపునకు వ్రాయఁబడుట పుట్టినదని గూడ విశ్వసింపఁబడుటచే, మాటలలోని ధ్వనులను, యక్షరములను తారుమారు చేసి కూర్చియు చేర్చియు చదివి పోలికలు సూచించి, పదముల సామ్యమును బట్టి యూరోపియన్ భాషాపదములకు, హీబ్రూభాషా పదములనుండి యేదో విధముగ వ్యుత్పత్తు లేర్పరుపఁబడెడివి. ఇట్టి వ్యుత్పత్తులను గల్పించినందులకు ప్లేటో నిరుక్తాచార్యుఁ డయ్యెను. యథార్థమునకు హీబ్రూభాష సెమిటిక్ భాషాకుటుంబమునకుఁ జెందినది. ఆ కాలమువారికి సెమిటిక్ భాషాస్వభావ మేమియుఁదెలియదు. దానికిని యూరోపియన్ భాషా

కుటుంబమునకు నెట్టి సంబధమును లేదు. వాని నిర్మాణపద్ధతియే వేరు. ఈ విధముగా నెవరి యిష్టానుసారముగా వారు తమ యూహల ప్రకారము శబ్దములకు వ్యుత్పత్తుల గల్పించుచుండిరి. ఐరోపా దేశములో మధ్య యుగమున క్రైస్తవాలయములలో (Church) లాటిన్ భాషకు ప్రాముఖ్య మబ్బుటచే, నా భాషా వ్యాకరణ వాఙ్మయములు బాగుగ నభ్యసింపఁబడినవి. ఇందుచే సుశబ్దాపశబ్దజ్ఞానమును గణించి, యా భాషలో 'సిసిరో'వలె వ్రాయఁగల శక్తిని సంపాదించుటకు పండితులు ప్రయత్నించిరి. ఇంత కంటె నా కాలమున భాషావిషయిక కృషి యేమియు జరుగలేదు.

ఈ కాలమున యూరపు దేశములో లాటిన్ భాషా వ్యాకరణా భ్యసనమునకే పండితులందఱు పాటుపడెడివారు; దానికే ప్రాధా న్యము హెచ్చు. లాటిల్ భాషా వ్యాకరణ పద్ధతి ననుసరించియే యితర భాషావ్యాకరణము లేర్పరుపఁ బడెడివి. ఫ్రెంచి, ఇటాలియన్ భాషా పదకోశములలో శిష్టుల ప్రయోగములకు మాత్రమే స్థాన ముండెడిది.

లాటిన్ భాషా ప్రభావము

కాని, నిత్యవ్యావహారిక భాషాపదములకు స్థానముండెడిది కాదు. బడు లలోఁగూడ లాటిన్ భాషావ్యాకరణమునకే యెక్కువ ప్రాధాన్య ముండెడిది. బడులు 'గ్రామరు స్కూలు, లాటిన్ స్కూలు' లనియే ప్రసిద్ధి చెందినవి. వ్యాకరణ మనఁగా లాటిన్ వ్యాకరణ మనియే రూఢి. ఈ భాషాప్రభావ మితర భాషలమీఁదఁ గూడ నెక్కువఁగాఁ జూపినది. లాటిన్ భాష ప్రకృతి - ప్రత్యయముల కూర్పువలన నేర్పడినది. • ఇతర భాషావ్యాకరణములు వ్రాయుపట్ల వానికి లాటిన్ భాషతో నెట్టిపోలిక గాని, సంబంధముగాని లేక పోయినను, లాటిన్ భాషావ్యాకరణపారిభాషిక పదములే యుపయోగింపఁబడెడివి. ఇంగ్లీషు, డేనిషుభాషలలో ద్వితీయ, చతుర్థి, పంచమీ విభక్తిప్రత్యయములు లేకున్నను, లాటిన్ భాష నను సరించి యాభాషల వ్యాకరణములందు వానికిఁగూడ విభక్తులు గల్పింపఁ బడినవి. అన్ని భాషల వ్యాకరణములందు విచక్షణ పాటింపకుండ క్రియా ప్రక్రియ యంతయు లాటిన్ వ్యాకరణము ననుసరించియే చేయఁబడినది. 'ఆ

యా భాషలలో లేని విషయములుగూడ, లాటిన్ భాషలో నున్నంత మాత్రమున నందుఁ జేర్చఁబడినవి. వానిలో నున్న విషయములు లాటిన్ భాషలో లేవను కారణమున నవి పరిత్యజింపఁబడినవి. ఇందుచేనా భాషల స్థితి మారిపోయినది. ఈ విషయము భారత దేశమున సంస్కృతభాష యితర భాషలపైఁ జూపిన ప్రభావముతోఁ బోల్పఁదగినది. ఆంధ్రవ్యాకర ణము రచించుపట్ల సంస్కృతవ్యాకరణ పారిభాషికపదములు వాడఁబడు టయు, విభక్తిప్రత్యయములు మొదలైనవి సంస్కృతభాషా వ్యాకర ణానుసారముగఁగూర్పఁ బడుటయు ముఖ్యముగా గమనింపఁదగినవి.

మఱియొక యనర్థముగూడ వాటిల్లినది. లాటిన్ భాష నభ్యసించిన పండితులు వ్రాఁతమూలకముగ దానిని నేర్చికొనిరే కాని, యుచ్చారణను గూర్చి శ్రద్ధవహింపరైరి. అందుచే 16-వ శతాబ్దమునాఁటికే ఫ్రాంసు, ఇంగ్లండు వివిధ దేశములందలి లాటిన్ పండితులు చేరి లాటిన్ భాషలో సంభాషించుకొనినప్పు డొకరిమాట లింకొకరికి బోధపడక చికాకు పడఁ జొచ్చిరి. ఇందులకు ముఖ్యకారణము భాషాజీవము నోటిలోను, చెవిలో నున్నదనియు, వ్రాఁతలోను, కలములోను, కంటిలోను లేదను రహస్యమును వారు గ్రహింపలేక పోవుటయే. తాము వ్రాసికొనిన యన్య భాషా విషయములను మరల చదువు నపుడు గూడ వారు తబ్బిబ్బులు పడుట జరిగెను. ఇందువలన భాషాతత్త్వము, భాషా పరిణామములఁ గూర్చి సరియైన జ్ఞానము వారికిఁ గలుగలేదనవచ్చు. భాష ధ్వన్యాత్మకమను రహస్యమును 16-వ శతాబ్దమునుండి యిటీవలవఱకు భాషాతత్త్వ వాదులు చాలమంది గ్రహించినట్లు లేదు. భాషను గుఱించి వ్రాసి నపుడు చాలమంది యక్షరవిన్యాసమును గూర్చియే యాలోచింతురు కాని, ధ్వనిపరిణామమును గూర్చి యాలోచింపరు. నేఁటి కాలమున పుస్తకముల నుండి హిందీభాష నభ్యసించువారి కుత్తర భారతదేశము నందు హిందీని మాట్లాడు వారి యుచ్చారణము పట్టిపడక పోవుట కిదే కారణము. ఆ కాలమున పండితుఁ డనిపించుకొనుటకును, చర్చిలో చేర నర్హత గణించుటకు మాత్రమే లాటిను భాషాభ్యాసనము వలన ప్రయో జనములైయున్నవి. ఇది పౌరోహిత్యము చేయుటకు సంస్కృత భాషా

జ్ఞానము సంపాదించుటవలె నున్నది. 'రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనం-వేదానాం రక్షార్థమధ్యేయం వ్యాకరణం'అని కదా పతంజలి.

ఇందుచే పాశ్చాత్యదేశములలో లాటిన్‌భాషా వ్యాకరణాభ్యసనము సుశబ్దాపశబ్దజ్ఞానమును సంపాదించుటకును, వాని ప్రకారము వ్రాయను, మాట్లాడను నేర్చుకొనుటకే కాని, భాషామర్యాదను గ్రహించుటకుఁ గాక పోయినది. వ్యాకరణ మాజ్ఞాపించు శాస్త్ర మైనదే కాని, భాషావిషయములను స్వయముగా పరిశీలించుటకుఁ దోడ్పడ లేదు. ఇందుచే లాటిన్‌వ్యాకరణాభ్యసనము భాషాభివృద్ధికి నిరోధక మైనది. పతంజలి తన మహాభాష్యములో చెప్పినట్లు కుమ్మరివాని వద్దకేగి తనకు కుండలు చేసిపెట్టు మని యడిగినట్లుగ, వైయాకరణుని యొద్ద కేగి తన యుపయోగముకొఱకు కొన్ని శబ్దములను జేసిపెట్టుమని యడిగినచో, నా వైయాకరణుఁడు దాని కంగీకరింపఁజాలఁడు. ఏలన శబ్ద సిద్ధి లోక (వ్యవహార)మునుండియే కలుగును గాని, వ్యాకరమువలనఁ గలుగదను పరమసత్యమును వారు గుర్తింప లేదు. పరిశోధకునికి స్వర శాస్త్రమందు శిక్షణము లేకపోవుటచేత ముఖ్యమైన భాషాశాస్త్ర విషయములను, సూత్రములను విడిచిపెట్టుటయో, తారుమారు చేయుటయో జరిగినది.

క్రీ. శ. 16-వ శతాబ్దమున ముద్రణపద్ధతి కనిపెట్టఁబడుటచే, నితర భాషల నభ్యసించుటకు సౌకర్యమేర్పడి వివిధ భాషలలోని పదములు సేకరింప మొదలు పెట్టఁబడినది. ఈ సమయముననే ప్రాచీన జెర్మానిక్ భాషలో 'వుల్ఫిలా' వ్రాసిన బైబులు భాషాంతరీకరణము బయలువడినది. ఈ కాలమున నాంగ్లో-సాక్సను, జర్మను, ప్రాచీన ఐస్లాండిక్ భాషలలోఁ గూడ బైబులు భాషాంతరీకరింపఁబడినది. 18-వ శతాబ్దమున భాషల సంబంధమును గూర్చిన విచారణ బయలుదేరి, వివిధ భాషలందలి సమానార్థక శబ్దములు ప్రోగుచేయఁబడినవి. పీటర్ ది గ్రేటు, కేథరీన్ చక్రవర్తిని రాజ్యకాలములలో 'లీబ్‌నిజ్' (Lebnitz) అను తత్త్వవేత్త ప్రోత్సాహమున సుమారు 200 భాషలలోని పదములు

సంగ్రహింపఁబడినవి. తత్ఫలితముగ హీబ్రూభాష యితరభాషల కన్నింటికిని మూలమను ప్రాచీనవాదమును ఖండించి, యూరోపు, ఆసియాదేశ భాషలన్నియుఁ నొక జాతిలోనికిఁ జేరునని యతఁడు సూచించినాఁడు. ఈ కాలముననే 'పల్లాసు' (1786-7), హెర్వాసు (Hervas) (1800-5) అడెలంగు (1806-7) అనువారలు వివిధభాషా పదకోశములను తయారు చేసిరి. ఇందు నిఘంటు విషయములే కాని వ్యాకరణ విషయము లెక్కువ లేవు. వీనికి బైబులు గ్రంథములే ప్రమాణము. వీరిలో 'అడెలంగు' ఇండోయూరోపియన్ భాషాకుటుంబమును మొట్టమొదట నేర్పరచెను. పిమ్మట భాషల సంబంధమును నిర్ణయించుటకు పదముల పట్టికలుకంటె, నందలి వ్యాకరణ విషయములే ముఖ్యమైనవని హెర్వాస్ తొలుతగా గుర్తించినాఁడు,

18-వ శతాబ్దమునందలి వైయాకరణులు భాష సహజముగా పుట్టినదా, లేదా ? యను విషయమును గూర్చి వివాదములు చేసిరి. ఆదిమ మనుష్యులందఱును జేరి యా యా వస్తువులకును భావములకు నా యా మాటలను వాడుకొనుట కేర్పాటు చేసికొనిరని 'రూసో' యను నతఁడు తెల్పినాఁడు. కాని

భాషోత్పత్తి

యీ మతము సమంజసముగ లేదు. భాషయే లేని కాలమున భాషను వాడుకొనవలె ననుట యెట్లు జరుగును ? మఱియు నంతకు పూర్వమే భావప్రకటనమునకు సాధనము లేకున్నచో నీ భావమున కీ శబ్దములని జను లెట్లేర్పరుచుకొనఁగలరు? కాన రూసోమతము సరసముగా లేదు. మాటలు రాని యాదిమ స్త్రీపురుషులు భావోద్రేక ప్రేరితులై సహజాభినయ పూర్వక ధ్వనులతో నొక విధమైన భాషను సంపాదించిరని 'కాండిలాక్' యభిప్రాయపడెను.. ఆ ధ్వను లా యా భావములకు గుర్తులై, క్రొత్త భావములకు నూతనాభినయ పూర్వకమైన నూతనధ్వను లుదయించి, వారు కోరిన వస్తువులకును భావములకు గుర్తులగునని యతని మతము. తర్వాత వారి శిశువుల నాలుకలు బాగుగ సాఫీ తేలి, వారు కోరిన వస్తువుల కభినయ పూర్వకమైన నూతన ధ్వనులను చేయఁగ వాని, యర్థములను వారి తలిదండ్రులు గ్రహించి తాము గూడ నేర్చుకొని, వానినే యుప

యోగింతురు. ఈ రీతిగ కొన్ని తరములు శ్రమించి యార్జించినది భాష. ఈ శతాబ్దమందు 'జోహాన్ గాట్‌ఫ్రీడ్ హెర్డరు' అను జర్మనీ దేశీయుఁడు 1772 సం. న చేసిన 'భాషోత్పత్తి' యను వ్యాసరచనము నకు బహుమానము పొంది, భాషాశాస్త్రోదయమునకు కారకుఁడయ్యెను. అందతఁడు భాష దైవదత్తము గాక మనుష్యార్జితమే యను మతమును చక్కగ ప్రతిపాదించినాఁడు. భాష దైవదత్తమే యగుచో మొదట విశేష్యములును తరువాత క్రియలును పుట్టును, మఱియు నది పరిపూర్ణముగను, సక్రమముగా నుండియుండును గాని, యిప్పటివలె యవక తవకగను, క్రమరహితముగను, నసంపూర్ణముగ నుండదనియు, మఱియు భావప్రేరితమైన ధ్వనులమూలముననే భాషయంతయు పుట్టినదని చెప్ప వీలులేదు. ఆ ధ్వను లెంత స్థిరముగ కుదిరి యున్నను, మానవుఁడు వాని నా యా యర్థములలో మరల వాడ లేకున్న నది మానవభాషయే కానేరదు. ఒక జాతియొక్క యాత్మ వారి భాషలో ప్రతిఫలించునని యతఁడు తెల్పెను.

భాష మానవార్జితమే మైనను, పలువురు మనుష్యులు కూర్చుండి యిచ్ఛాపూర్వకముగ సృష్టించినది మాత్రము గాదనియు, నది మానవుల యంతఃప్రకృతినుండి యుబికి పైకి వచ్చినదని హెర్డరు వాదము. అతఁడు భాషకును మానవజాతి యాదిమకవిత్వమునకు ముఖ్యసంబంధ ముండు ననెను. జాతీయజీవనము వారిభాషలో వ్యక్తమగు నని తెల్పి, తన జర్మనుభాష, గ్రీకుభాష తర్వాత ప్రపంచభాషలలో శ్రేష్ఠమైనదని పొగడుకొనెను. జర్మనుభాషలోని సంయుక్తవ్యంజనములు దానికి గాంభీర్యము నొసఁగినవనియు, నది పరుగులు వారక జర్మనీదేశస్థులవలె గంభీరముగ నడచుననియు, జర్మనుభాషలోని వ్యంజనములపారుష్యము నందలి యుచ్చులు మృదువుపఱచుననియు, నా భాషయందలి యవ్యవహితవ్యంజనములు శ్రుతిరంజకముగను, మనోహరముగ నుండుననియు, శబ్దములు తీవి గలవనియు, జాతీయము స్పష్టమైన దనియు, హెర్డరు తెలిపెను.

1794 సం.లో బెర్లిన్ సాహిత్యపరిషత్తు సంపూర్ణ భాషా లక్షణ వివరణమును గూర్చి పోటీపరీక్షలు చేయించినది. అందు 'డి. జెనిష్' అను బెర్లిన్‌నగర మతగురువునకు బహుమాన మీయఁబడినది. పరిపూర్ణమైన భాషకు 1. శబ్దసంపద, 2. శక్తి, 3. స్పష్టత, 4. శ్రావ్యత యను నాల్గు ముఖ్యలక్షణము లుండవలెననియు, నందు భాషలో 1. వస్తుభావాదులకు నెల్ల శబ్దములు కలవా? వాని నుండి నూత్నశబ్దములఁ బుట్టిప వీలగునా? యను దానినిబట్టి శబ్దసందయు, 2. వ్యాకరణసౌలభ్యమునందును నిఘంటువైశాల్యమందును భాషా శక్తియు, 3. స్పష్టత, శబ్దజాలమునందు నుండునని యతఁడా వ్యాసమున స్పష్టపఱచినాఁడు. ఈతఁడు తన జర్మన్‌భాషను ఫ్రెంచిభాషతోఁ బోల్చి, తన భాషకంటె ఫ్రెంచిభాషయే శ్రేష్ఠమైనదని యంగీకరించెను. మఱియు భాషలో మానవుని బుద్ధి నీతుల సారము వ్యక్తమగుననియు, మాటల రీతిలోనే మానవుల స్వభావము విశదమగునని ప్రాచ్యులు చెప్పినమాట సత్యమనియు, ననాగరికుల మాటలు మోటుగాను, నాగరికులమాటలు లలితముగా నుండుననియు, గ్రీకులభావన మున్నితమనియు, రోములు తాత్త్వికబుద్ధిగల కార్యసాధనపరు లనియు, ఫ్రెంచివారు సమ్మాన పాత్రులును, స్నేహభావముగల వారనియు, వారు గంభీర స్వభావులనియు, జర్మనులు తత్త్వైకదృక్కు లనియు, పై వారి స్వభావము వారి భాషయందు ప్రతిఫలించుననియు నాతని వ్యాసపీఠికలోఁ దెలిపెను.

క్రీ. శ. 19-వ శతాబ్దములో భాషాశాస్త్రాభ్యుదయమున నొక నూతన వికాసము గలిగినది. తత్ఫలితముగ యూరోపు దేశ భాషలలోని పదములను సంస్కృతభాషా పదములతోఁ బోల్చిచూచి, వానికి

పాశ్చాత్య దేశములందు సంస్కృత భాషా పరిచయము

సాదృశ్యము పొడఁగట్టఁ బడినది. తర్వాతనా యా భాషల వ్యాకరణములును, వాని నిర్మాణక్రమము, వాని పరస్పరసంబంధము గుర్తింపఁబడినవి. భాషల వర్గీకరణము, భాషా పద ప్రాచీనచరిత్ర, భాషలలోఁ గలుగు మార్పులు మొదలైనవి తారతమ్య దృష్టితో పరిశీలింపఁబడసాగినవి. ఈ రీతిగ భాషకుఁగూడ నొక

చరిత్ర గలదని గ్రహింపఁబడినది. దీని కంతకును ముఖ్యకారణము యూరోపులో సంస్కృత భాషాపరిచయ భాగ్యమే.

ఫ్రాంసు దేశీయులు నాంగ్లేయులును భారత దేశమున రాజ్యస్థాపన కొఱకుఁ బోరాడుచుండు కాలమున నుభయ దేశముల వారును గూడ భారత దేశ భాషావాఙ్మయ నాగరకతలఁ గూర్చి నేర్చుకొన నుత్సాహపడి, యందులకు ప్రయత్నములు చేసిరి. వారిలో ఫ్రాంసు దేశమిషనరీ యగు 'కోర్డో' (Coeurdoux) యను నతఁడు సంస్కృత భాషాపదములకు, లాటిన్ భాషాపదములకుఁ గల సంబంధమును వివరముగాఁ దెల్పుచు నొక వ్యాసమును వ్రాసి, ఫ్రెంచివారికి మొట్టమొదట తెలియ పంపినాఁడు. అట్లే 'సర్ విలియం జోన్సు, (1706) అను నాంగ్లవిద్వాంసుఁడు భాషాశాస్త్ర విషయమున సంస్కృతభాషకుఁగల ప్రాముఖ్యమును దెలియపఱచుచు, సంస్కృతభాషా ప్రాచీనతయు, దానికి గ్రీకు లాటిన్ భాషలతోఁ గల సంబంధమును విషయమున పదములందే కాక, వ్యాకరణవిషయమున ధాతుక్రియారూపములలోఁ గూడఁ గలదనియు, నా మూఁడుభాషలు నేకమాతృక లనియు, గాథిక్, కెల్టిక్, ప్రాచీన పెర్షియను భాషలుగూడ సంస్కృతముతో సంబంధము గలిగియున్నవనియు నాంగ్లేయులకు విశదపఱచెను. తరువాత 'ష్లెగెల్' (Schlegel) అను జర్మనుపండితుఁడు సంస్కృతమునకు నితర యూరోపియన్ భాషలకుఁగల సంబంధమును జూపి, వివిధ దేశభాషలను పరిశీలించి, ప్రపంచమందలి భాషల నన్నింటిని రెండు విధములుగా విభజించినాఁడు. ఒకటి, సంస్కృతభాషతో నంబంధముగల భాషలనియు. రెండు, నా భాషతో సంబంధము లేని భాషలనియు విభాగము చేసినాఁడు. ష్లెగెల్ భాషల యందలి పదములే ధ్వనిపరిణామసూత్రములచే (Phonetic law) భిన్నరూపములు దాల్చిన వను విషయమును గూర్చి కృషి చేయకున్నను, భాషల బాహ్యారూప సాదృశ్యమును గుర్తించెను. ధ్వనిసూత్రములను గూర్చి యాతని తరువాతివారగు 'రాస్కు, గ్రిమ్, బాప్' మొదలైనవారు కృషిచేసిరి. ఇట్లు సంస్కృతభాష యొక ప్రామాణిక భాష యగుటచే యైరోపా దేశములలో ప్రతి విశ్వవిద్యాలయమందును

సంస్కృతభాష కొక యాచార్యపీఠము స్థాపింపఁబడి యా భాషలో పరిశోధనలు సలుప ప్రారంభింపఁబడినవి.

డెన్మార్కు దేశములో 'రాస్కు' పండితుఁడు బాల్యమునుండి వ్యాకరణవేత్తయై, ఐస్లాండిక్ భాష నితరభాషలతోఁ బోల్చిచూచి నాఁడు. ఒక జాతియొక్క మత సాంఘికాచారములు మారినను, వారు మాట్లాడుభాషలోని పదములనుబట్టి వారి ప్రాచీనచరిత్ర గ్రహింప వీలగుననియు, భాషల సంబంధమును నిర్ణయించుటకు వాని వ్యాకరణాంశములు ముఖ్యసాధనముగాని శబ్దజాలము గాదనియు, శబ్దజాలము నితరభాషలనుండి యెరువుదెచ్చుకొనవచ్చును గాని, వ్యాకరణవిషయము లట్లు గాదనియు, నత్యావశ్యకములగు వస్తువులను దెలుపు పదములును, సర్వనామములు, సంఖ్యావాచకములు మొదలైనవి భిన్నభాషలలో పోలిక గలిగియున్న యెడల నవి పరస్పరసంబంధము గలిగి యేకభాషాకుటుంబమునకుఁ జెందినవని నిర్ణయింపవచ్చు నని తెల్పెను. శబ్దములను బట్టి వివిధ భాషలలోని ధ్వనులెట్లు మారునో పరిశీలించి, వాని మూలమున స్వర సూత్రము (Phonetic laws) లను గల్పింపవచ్చునని యితఁడు నిర్దేశించెను. ఈ పద్ధతి నవలంబించి యైరోపాభాషల పరస్పర సంబంధమును నిర్ణయించి, వానిని వివిధ శాఖలుగా విభజించినాఁ డితఁడు. హిందూదేశమునకు వచ్చి యితఁడు హిందూదేశ భాషలయు, పరిషియన్ జెండవెస్త భాషలయు లక్షణములను పేర్కొని, మలబారిక్ భాషలని వ్యవహరింపఁబడు ద్రావిడభాషలు, సంస్కృతభాషకంటె భిన్నమైనవని మొట్టమొదట లోకమునకు ప్రకటించినాఁడు.

రాస్కు

ఈతని తర్వాత 'జేకబ్ గ్రిమ్' (Jacob Grim) అను జర్మను పండితుఁడు జర్మానిక్ భాషలకు చారిత్రకవ్యాకరణమును రచించి భాషాశాస్త్రములో చారిత్రకపద్ధతిని (Historical grammar) ప్రవేశపెట్టినాఁడు. చారిత్రకపద్ధతితోఁబాటు తులనాత్మకపద్ధతిని గూడ (Comparative method) కలిపి, సన్నిహితభాషలలోని రూపములతోఁ బోల్చి వాని

గ్రిమ్

సంబంధమును నిర్ణయించుటచే వాని చరిత్రను గుర్తింపనగు నని యీతని యుద్దేశము. సన్నిహితభాషల తులనాత్మక పరిశీలనమే భాషాచరిత్ర యగును. జర్మానిక్ భాషల నిట్టి తులనాత్మక పరిశీలన మొనర్చి యితఁ డొక ధ్వనిపరివర్తనమును (Sound change) కనిపెట్టెను. అది యేదన, నితర యిండోయూరోపియన్ భాషలలోని 'ప, త, క' అను ధ్వనులు జర్మానిక్ భాషలలో (f, th,h) 'ఫ, థ, హ' లుగా క్రమమున మారునని యితఁడు నిరూపించెను. ఉదా: (సం) పితా, (లాటిన్) పేటెర్ శబ్దములు, గాథిక్ భాషలో 'Faeotor' అని మారుటచేతనే యింగ్లీషులో 'Father' 'ఫాథర్' అని యయ్యెను. ఈధ్వనిసూత్ర మతని పేరితో 'Grim's law' అని పిలువఁబడెను. ఇందుఁగొన్ని దోషము లున్నను ధ్వనిసూత్రములను, గుర్తించుట భాషాశాస్త్రమున నొక ముఖ్యవిషయముగా నంగీకరింపఁబడినది.

రాస్కు, గ్రిమ్‌లతోఁ బాటు ప్రముఖస్థాన మాక్రమించిన మూఁడవ పఖ్యాత భాషాశాస్త్రజ్ఞుఁడు 'ఫ్రాంజ్ బాప్' (Franz Bopp).

బాప్

ఇతఁడుగూడ జర్మనీదేశస్థుఁడే. ఇతఁడు ఇండో యూరోపియన్ భాషల కన్నింటికి ప్రప్రథమమున సమగ్రవ్యాకరణము వ్రాసినాఁడు. ధ్వనిసూత్రములను గూర్చి యితఁడు పరిశ్రమ చేయకపోయినను, పదవాక్య నిర్మాణపద్ధతిని నిరూపించుటలో నితఁడు విశేషకృషి చేసెను. సంస్కృతభాషా సహాయముచే నితఁ డైరోపాభాషలలోని విభక్త్యాది వ్యాకరణరూపముల మూలరూపములను గుర్తించి, గ్రీకు లాటిన్ భాషలు సంస్కృత భాషా జన్యములు గావనియు, నివి యన్నియుఁగలసి మఱియొక మూల భాషనుండి పుట్టినవనియు, సంస్కృతభాష మాత్ర మితర సోదరభాషల కంటె మూలభాషాలక్షణములను నిలుపుకొని యున్నదని నిరూపించెను. మఱియు నీ భాషాకుటుంబములోని విభక్తిప్రత్యయములు పూర్వము ప్రత్యేకార్థముగల స్వతంత్ర శబ్దముల యవశిష్ట రూపములే యనియు నితఁడు ప్రతిపాదించెను. ప్రపంచములోని భాషలనన్నింటి నితఁడు మూఁడు విధములుగ విభజించినాఁడు (1) ధాతు ప్రత్యయ సంశ్లేషా

గములేని భాషలు. ఉదా: చీనాభాష. ఇందు వాక్యమందు పదము. లకుఁగల స్థానమును బట్టి యర్థనిర్ణయమగును. (2) ఏకాక్షర ధాతువులు ప్రత్యయ సంయోగమున వివిధ వ్యాకరణరూపము లేర్పడునవి. ఉదా: సంస్కృతము మొ. (3) ద్వ్యక్షర ధాతువులు గల భాషలు, మూఁడు హల్లులతోఁగూడిన ధాతువులు గలవి. ఉదా: అరబ్బీ, హీబ్రూ మొదలైన సెమిటిక్ భాషలు. ఇందా యీ వ్యంజనముల మధ్య నచ్చులు చేర్పఁబడి వ్యాకరణరూపము లేర్పడుచుండును.

గ్రిమ్ జర్మానిక్ భాషలకు ధ్వనిసూత్రముల నేర్పరచినట్లే, ఇండోయూరోపియన్ భాషలకు 'పాట్' (Pott) అను నాతఁడు ధ్వని సూత్రములను గూర్చినాఁడు. మఱియు భాషల సాజాత్యమును నిర్ణయించుటలో నీ ధ్వనిసూత్రముల ప్రాముఖ్యము నితఁడు ప్రదర్శించెను. కాని ధ్వని సాదృశ్య మాత్రముచేతనే భాషల సంబంధమును నిర్ణయింపరాదని యితఁడు హెచ్చరించెను. ఆంగ్లపదమగు 'bad'ను, పర్షియన్ శబ్దమగు 'bed'ను సారూప్యము గలవి కాని, సంబంధముమాత్రము వీనికి లేదు. అట్లే ఆంగ్లమున 'prop'ను. తెలుఁగున ప్రాపు; (ఇం) gaul, గొల్లలు (తె); Mouth - మూతి(తె). పరిషియన్ పదమగు Xva har=Sister=Oestic-O ఈ రెండు పదములకు రూపసామ్యము లేక పోయినను సాజాత్యము గలవి. ధ్వనిసూత్రములచే నిది నిరూపింపనగును. మఱియు నితఁడు ధాతు రూపముల పట్టికలను గూర్చి, పదవ్యుత్పత్తులను నిర్ణయించు ధాతు కోశము నొకదానిని తయారు చేసినాఁడు.

పాట్

తర్వాత (Wilhelma Von Humboldt) హూంబోల్టు అను నతఁడు భాష నిత్య చలనాత్మకమనియు, పరిపూర్ణత నొందినది కాదనియు, ప్రత్యేకపదములు భాష గాదనియు తెలిపినాఁడు. పిమ్మట (J. H. Bredsdorff) బ్రెడ్స్‌డార్ఫ అను నతఁడు పదములలో మార్పులు గలుగుటకు ముఖ్యకారణములు (1) తప్పుగా విని, తప్పగా నర్థము చేసికొనుట (2) మాట యొక్క యథార్థ స్వరూపము జ్ఞప్తికి రాకుండుట (3) వాగింద్రియదోషము

భాషా పరివర్తనము

(4) అలసతయే విశేషకారణము గాన నిది ముఖ్యము. (5) స్వరసామ్యమున నూత్న పదము సృష్టించుట (6) స్పష్టోచ్చారణ ప్రయత్నము (7) నూత్న భావప్రకటనావశ్యకత యనునవి ప్రధానములని తెల్పినాఁడు.

స్వరసూత్రముల నాధారము చేసికొని ఇండోయూరోపియన్ మూలభాషా స్వరూపమును నిర్ణయింపవలయునని మొట్టమొదట 'ష్లైచర్' (Schleicher) అను నతఁడు ప్రయత్నించినాఁడు. దానివలని వివిధభాషలలోని

ష్లైచర్

మార్పులను, వాని పరస్పరసంబంధమును గ్రహించి యా భాషల క్రమాభివృద్ధి సూచన కిది తోడ్పడునని యతఁ డుద్దేశించి, యట్టి మూల భాషలో నొక కథను వ్రాసి చూపెను. మఱియు నీ భాషాకుటుంబ వృక్షము నొకదాని నితఁడు తయారు చేసినాఁడు. ఈతఁడు నిర్ణయించిన మూల భాషారూపము లీతని యూహాకల్పితములే కాని, నిర్వివాదములు కావు. మూలభాషలో నచ్చులును, హల్లులును బహుస్వల్పములనియు, సంస్కృత మందలి వర్ణములే మూలభాషకు సన్నిహితముగా నుండెననియు, పద నిర్మాణ మొక్కవిధముననే జరిగెనని యీతఁ డభిప్రాయపడెను. కాని తర్వాత 'వెర్నగర్', 'బ్రుగ్మన్' అను వారలు పరిశోధనలు సల్పి, సంస్కృతమునకంటె మూలభాషయందు హల్లులు నచ్చులుగూడ నధిక సంఖ్యాకములు గలవనియు, సంధ్యక్షరములలో 'అఇ, ఎఇ, ఒఇ, ఆఇ, ఏఇ, ఓఇ'' అను నవియు, హ్రస్వతర 'అ' కారమును, అజ్లక్షణమే కల (l, m, n, r, )' ల,మ,న, ర.'అను హల్లులును, మూఁడురీతులులు గల కంఠ్యములు మొదలగునవి ఇండోయూరోపియన్ మూలభాషలోఁ గలవని కనుగొనఁ గలిగినారు.

ష్లైచర్ భావముల ప్రకారము ఇండోయూరోపియన్ కుటుంబ భాషలలోని పదజాలమును 'ఆగస్టు ఫిక్కు' అను నాతఁడు తయారుచేసి నాఁడు. ఈ పదకోశము 'ఇండో ఐరేనియన్' అనియు, 'యూరోపియన్' అనియు

ఆగస్టు ఫిక్కు

రెండు భాషావర్గములుగా విభజింపఁబడినవి. ఇండోయూరోపియన్ భాష

లన్నిటికి సజాతీయ పదములను గూర్చుటలో నిత్కడగ్రగామి యయ్యెను. ఇండోయూరోపియన్ కుటుంబభాషల కన్నింటికి వ్యాకరణరచన గావింపఁబడినది. లాటిన్‌భాషాజన్యమైన వివిధ భాషలకన్నింటికి పరస్పర సంబంధమును క్రమపరిణామమును నిరూపింపఁబడినది.

ఈ కాలమున ప్రతి భాషయందును గానవచ్చు వివిధ విషయములను క్రోడీకరించి, వర్గీకరించి వాని స్వరూపము నున్నదున్నట్లు ప్రతిపాదించుట, ధ్వనిపరిణామ సూత్రముల ప్రాముఖ్యమును గమనించి వాని సహాయమున భాషలలోని సమస్యలను పరిష్కరించుట, శబ్దముల వ్యుత్పత్తిని నిర్ణయించుటలో నూహపై నాధారపడక, వాని పూర్వచరిత్ర నన్వేషించి సప్రమాణముగ నిర్ణయించుట, ప్రాచీన భాషా పరిణామమును వివరించు విషయమున నేటికాల భాషాపరిశీలనమును గూడ గమనించుట, సంధి, స్వరము, నర్థపరిణామము మొదలగు వాని విషయమై విశేషశ్రద్ధ వహింపఁబడుచున్నది. ఇట్లు బాప్, ష్లైచర్‌లు మొదలిడిన పనిని 'బ్రుగ్‌మన్' కొనసాగించి స్థిరరూపమును గూర్చెను.

ఇట్టి భాషాపరిశోధన ఫలితముగా ప్రపంచభాషల నన్నింటిని వానివాని లక్షణములను బట్టి వివిధ భాషాకుటుంబములుగా 'మాక్సుమిల్లరు' (Max Mullar) మొదలైన వారు విభజించిరి. మాక్సుమిల్లరు

మాక్స్ మిల్లరు

తన భాషాశాస్త్రోపన్యాస సంపుటములలో నీ భాషాపరిశోధన విషయములన్నియు స్పష్టముగ, సులభగ్రాహ్యముగ వివరించినాఁడు. మఱియు 'విట్నీ' (Whitney) మొదలైనవా రాపరిశోధనల విషయములను పునఃపరిశీలన చేసి సంస్కరించిరి.

ఇంత వరకు పాశ్చాత్య దేశములలో ఇండోయూరోపియన్ భాషలలో జరిగిన భాషాశాస్త్ర పరిశోధనలఁ గూర్చి పరిశీలింపఁబడినది. ఇఁక భారత దేశమున దర్శిలా జరిగిన భాషాపరిశోధనలఁ గూర్చి విచారితము. అందును ద్రావిడభాషలఁ గూర్చి జరిగిన కృషి గమనింపఁదగినది.

ఆధునికోత్తరహిందూస్థాన భాషలను గూర్చి 'బీమ్సు' (Beams) అను నతఁడొక 'తులనాత్మక వ్యాకరణమును' (Comparative grammar of the Modern Aryan languages of India) వ్రాసినాఁడు. మఱియు డాక్టరు 'హార్నిలు' అను నాతఁడు గౌడభాషల కట్లే వ్యాకరణమును రచించినాఁడు. ఇఁక దక్షిణహిందూదేశమందలి తమిళ, మలయాళ, తెలుఁగు, కన్నడాది భాషలకు 'ద్రావిడ భాషాతులనాత్మక వ్యాకరణము' డాక్టరు 'కాల్డవెల్'అను మిషనరీ విశేష పరిశ్రమ చేసి వ్రాసినాఁడు. అంతకుఁ బూర్వమే రాస్కు' అను డేనిష్ పండితుఁడు ఇండోయూరోపియన్ భాషలను' గూర్చి పరిశోధించుచు, నీ దక్షిణహిందూదేశభాషలు సంస్కృత భాషతో నెట్టి సంబంధమును లేనివని మొట్టమొదట తెల్పినాఁడు. అతఁడీ దక్షిణహిందూదేశ భాషలను 'మలయారిక్ భాష'లని పేర్కొనినాఁడు. మాక్సుమిల్ల రీ దక్షిణదేశభాషలను 'తములిక్ భాష' లని వ్యవహరించెను. కాని వీనికి ద్రావిడభాషలని నామకరణమును చేసినది కాల్డైవెలే.

బీమ్సు, హార్నిలు

కాల్డైవెల్

కాల్డైవెలు భావములకు విరుద్ధముగా ద్రావిడభాష లార్యభాషా కుటుంబమునకుఁ జెందినవని ప్రతిపాదించిన దక్షిణభారతీయపండితుఁడు యం. శేషగిరిశాస్త్రిగారు. ఈయన సంస్కృత తమిళాంధ్ర కర్ణాటక మహారాష్ట్రాద్యనేక భాషలలో పాండిత్య మలవరచుకొని, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో సంస్కృత భాషాచార్యులుగను దేశభాషా పర్యవేక్షకుఁడుగ నుండి, క్రీ. శ. 1884 సం.న 'Notes on Aryan & Dravidian Philology' అను గ్రంథమును ప్రచురించినారు. ద్రావిడభాషాపదములను సంస్కృత భాషాపదములతో నెట్లో ముడిపెట్టి యా రెండుభాషలకు సంబంధమును గూర్చుటకు వారు భగీరథప్రయత్నము చేసిరి. కాని, రూపనిష్పత్తిని కల్పించుటలో స్వరమాత్ర కల్పనము చేయక స్వేచ్ఛాపలంబు లగుటచే, నీతని పద్ధతి శాస్త్రీయమైనది కాదని యెంచి పండితులు వీరిభావముల

యం. శేషగిరిశాస్త్రి

నాదరింపరైరి. ఇట్లే మద్రాసు క్రిష్టియన్ కళాశాలాంధ్ర పండితులగు వేకుమళ్ల రాజగోపాలరావుగారు ఆంధ్ర పదముల కొన్నింటికి నాంగ్లేయ పదములతో పోలికఁ జూపి, ద్రావిడభాష లార్యభాషలతో సంబంధము గలవని ప్రతిపాదించి హాస్యాస్పదము పాలైరి. పై యిద్దరి మార్గము నవలంబించిన నవీనులు డా. చి. నారాయణరావుగారు గూడ నాంధ్ర భాషలో గొప్ప కృషిచేసిన వారయ్యు. వారి భాషా పరిశోధనము నిష్ప్రయోజనముగ పరిణమించినది

వేకుమళ్ల రాజగోపాలరావు

దక్షిణదేశభాషలను గూర్చి ప్రత్యేకముగా గొందఱు కృషిచేసి వ్యాకరణములను, పదకోశములను తయారు చేసిరి. తమిళభాషకు 'పోప్' పండితుఁడును, కన్నడమునకు 'కిట్టెలు, రైస్' పండితులును, మలయాళమునకు 'గండర్టు'ను, తెలుఁగునకు 'బ్రౌను' దొరయు వ్యాకరణకోశాదులను వ్రాసిరి. తర్వాత Sir George Grierson గారి పర్యవేక్షణమున హిందూదేశమున నాసేతుహిమాచలమునఁ గల వివిధభాషలకు సమీక్షణ (Linguistic Survey of India) కూర్పఁబడినది. ఉత్తరహిందూదేశమున మరాటీ బంగాళీ భాషలకు 'సునీతి కుమార ఛటర్జీ' పండితుఁడు చక్కని వ్యాకరణమును నవీన భాషాశాస్త్రానుసారముగ రచించినాఁడు. బిషప్ కాల్డెవెలు మార్గము ననుసరించి ద్రావిడభాషలందలి విభక్తి ప్రత్యయములనుగూర్చి మద్రాసు విశ్వకళాపరిషత్తున నాంధ్రశాఖాధ్యక్షులగు శ్రీ కోరాడరామకృష్ణయ్యగారు చక్కని పరిశోధనలను చేసిరి. కన్నడ మలయాళభాషలలో అర్. నరసింహాచార్యులు, ఎస్. నరసింహయ్య, ఉల్లూరు పరమేశ్వరయ్యర్, ఎల్. వి. రామస్వామి అయ్యరు మొదలైనవారు విశేష కృషిజేసిరి. ద్రావిడభాషల విశేషలక్షణములను గూర్చియు, నందలి ధ్వనిసంప్రదాయ పరిణామ పద్ధతులను గూర్చియు, నీ భాషల ప్రాచీన చరిత్ర పరిశీలనము మొదలైన యనేక విషయములను గూర్చి 'London School of Oriental Studies' అను సంస్థలో టి.

గ్రియర్ సన్

నూత్న పరిశోధలు

(T. Burrows), ఆల్‌ఫ్రెడ్ మాస్టర్ (Alfred Master), టర్నరు (Turner) మొదలైన పండితులు విశేషమైన కృషిచేసి 'Dravidian Studies' అను పత్రికలో వ్యాసములను ప్రచురించిరి. అమెరికాదేశములో 'భాషా తత్త్వశాస్త్ర పత్రిక' (Plilological Journal)లో M. B. (Emeneau) ఎం, బి, ఏమెనో మొదలైనవారు ద్రావిడభాషా తత్త్వమును గూర్చి తమ పరిశోధనములను ప్రచురించిరి. ఇంక ఫ్రాంస్ (France) దేశములోఁ గూడ (Jules Block) జూలెస్ బ్లాక్ పండితుఁడు ద్రావిడభాషా నిర్మాణలక్షణమును గూర్చి ఫ్రెంచి భాషలో నీ మధ్య నొక చక్కని గ్రంథమును ప్రచురించినాఁడు.

అద్యతన కాలమున అమెరికాదేశములో 'వర్ణనాత్మక భాషా తత్త్వశాస్త్రము' నభివృద్ధిచేసి (Descriptive linguistics) నూతన మార్గమును పట్టించిరి. అందు Phonemes, morphemes, clines, phatic Communion, dictics, idiolects మొదలైనపారిభాషిక పదములు వాడఁబడి, భాషాతత్త్వ పరిశోధనము లోఁతుగ, సూక్ష్మ పరిశీలనముతోఁ జేయఁబడుచున్నది. ఇందు ముఖ్యముగా 'ధ్వని పరిణామమునకు' 'భాషా నిర్మాణపద్ధతు'లకు విశేష ప్రాధాన్య మొసఁగఁ బడుచున్నది. మఱియు నిందు లిఖితరూపమున నున్న భాషల కంటె నిత్య వ్యవహారమున నున్న వాగ్రూపమైన భాషలకే ప్రాముఖ్య మొసఁగఁ బడును. అక్షరవిన్యాసము కంటె ధ్వనిమూలకమైన యుచ్చారణకే గౌరవము హెచ్చు గలదు. ఇంతయే కాక యిందెట్టి యపభ్రంశరూపమైన నెవరిచేనైన నెప్పుడైన వ్యవహరింపఁబడుచో నది పరిశీలింపఁబడి, విచారణకు గైకొనఁ బడును.

ప్రాచీన నవీన భాషాతత్త్వ పరిశోధనల తారతమ్యము

(1) పూర్వకాలమున ప్రామాణికమైన సాహిత్యగ్రంథములగు కావ్యములలోని వ్యాకరణ యుక్తములై, సాధువులైన ప్రామాణిక కవి ప్రయోగములు మాత్రమే పరిశీలన కర్హములని గ్రహింపఁబడెడివి. ప్రస్తుతకాలమున గ్రంథస్థము గాక వ్యవహారమందు మాత్రమున్న శబ్దముల భ్రష్టరూపములు గూడ పరిశోధనార్హములైనవి. (2) పూర్వ

కాల భాషాపరిశీలమున ధ్వనిసూత్రములకును, ధ్వని పరిణామమును గూర్చియు విశేషమైన శ్రద్ధ యుండెడిది కాదు. ప్రస్తుతకాల పరిశీలన మున ధ్వనిశాస్త్రమునకు, ధ్వనిపరిణామమునకే యెక్కువ ప్రాముఖ్య మీయఁబడినది. (3) పూర్వకాలమున నిర్మాణ విధానమున, ననఁగా, శబ్దనిర్మాణ, వాక్యనిర్మాణములందు స్థూలదృష్టి మాత్రమే యుండెడిది. నవీన పరిశోధనమున భాషానిర్మాణమున నతి సూక్ష్మ దృష్టి ప్రబలి యెక్కువ శ్రద్ధ తీసికొనఁ బడినది. (4) ప్రాచీనకాలమున మృతభాషలగు గ్రీకు, లాటిన్, సంస్కృతము, ప్రాకృతము మొదలైన భాషలను గూర్చియే యెక్కువ శ్రద్ధ వహింపఁ బడినది. నవీన పరిశోధన లలో సజీవమై, నిత్య వ్యవహార మందున్న వివిధ రాష్ట్రీయభాషలును వాని మాండలికములు నెక్కువ శ్రద్ధతో పరిశీలింపఁబడు చున్నవి. (5) పూర్వము కేవలము వాగవయములపై నాధారపడి ధ్వని యుచ్చారణ పద్ధతులు పరిశీలింపఁ బడినవి. ప్రస్తుతము ధ్వని శ్రవణ యంత్రముల మూలమున స్వరకల్పన విధానము పరిశోధింపఁ బడు చున్నవి. (6) పూర్వకాలమున భాషల వర్గీకరణమునకును, వివిధ భాషా కుటుంబ లక్షణముల నిర్ణయించుటకును గృషిచేయఁ బడినది.

# రెండవ ప్రకరణము

## వాగుత్పత్తి - వర్ణవిభాగము

స్ఫోటరూపమగు శబ్దబ్రహ్మ ప్రతి మానవునియందును పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యను స్థానభేదములను బట్టి నాల్గు విధములుగా నున్న విషయము యోగసాధనచేఁ దెలిసికొనఁ బడిన దని శ్రుతి ప్రమాణము గలదు. కాని ప్రాకృతపురుషు లంతర్దృష్టి లేని వారగుటచే వాచకాంగముల ద్వారమున బయలువెడలు వైఖరీ వాక్కునే కాని తక్కిన వానినిఁ దెలిసికొన లేకున్నారు.

> చత్వారి వాక్ పరిమితా పదాని, తాని విదుః బ్రాహ్మణా యే మనీషిణః।
> గుహా త్రీణి నిహితా నేఙ్గయంతి, తురీయం వాచో మనుష్యా వదంతి ॥

అని శ్రుతివాక్యము. పాణినీయ శిక్షాగ్రంథమున శబ్దోచ్చారణ క్రియ యీ రీతిగ వర్ణింపఁబడినది.

> " ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనో యుఙ్క్తే వివక్షయా
> మనః కాయాగ్ని మాహన్తి స ప్రేరయతి మారుతం
> మారుత స్తూరసి చరన్ మన్ద్రం జనయతి స్వరం "

'ఆత్మ మొట్టమొదట బుద్ధిద్వారా సకల విషయములను గ్రహించుటచే మనస్సున మాటలాడుదమను కోరిక పొడమును. మనోమూలమునఁ గాయాగ్ని (జాఠరాగ్ని) చలించును. ఆ కాయాగ్ని వాయువును బ్రేరణ చేయును. పిదప నీ వాయువు హృదయమునందుఁ బ్రవేశించి మంద్రస్వరమును బుట్టించును'. ఈ స్వరమే పిదపఁ గంఠతాల్వాది భేదమూలమున నోటినుండి వెలువడును. పై శ్లోకములోని చివర పాదములు రెండును మైత్ర్యుపనిషత్తులో సైతము గానఁ బడుచున్నవి. (మైత్ర్యు - 7-11). అందువలన నీ శ్లోకభావము, లేక శ్లోకమే పాణిని కంటె ప్రాచీనమైనదని తోఁచుచున్నది. మైత్ర్యుపనిషత్తు పాణినికంటెఁ బ్రాచీన మని 'మాక్సుమిల్లరు' Sacred Books

of the east Series Vol. XV., pp. 41-51 లోఁ దెలిపినాఁడు. కాయాగ్ని నే యాధునిక శారీరశాస్త్రమునందు 'మజ్జాతంతు'వులని వాడుచున్నారు.

వాగ్వ్యాపారమున మనస్సును వాగవయవములును పరస్పర సహాకారము గలిగి యుండును. కాన ప్రత్యక్షములగు వాగవయవములే

వాగవయవములు

వన, (1) కృకాగ్రము (Larynx). :- ఇది శ్వాస నాళిక పై భాగమున నొక పేటికవలె నిర్మింపఁబడి యుండును. (2) జిహ్వ (Glottis) :- ఈ కృకాగ్ర పేటికలో సగము పై భాగమున శ్వాసనాళిక కొక ద్వారము వంటి దుండును. అదే జిహ్వ. ఇది కృకాగ్రమున కిరువైపులఁ జేర్పఁ బడిన రెండు చర్మపు పొరలతో నేర్పడి యుండును. (3) నాద తంతువులు (Vocal chords) :- ఈ రెండు చర్మపు పొరలే నాదతంతువు లనఁ బడును. అవి సమయానుకూలముగ సాగుచు, ముడుచుకొను చుండును. అవి తంత్రులు, లేక తీగెలవలె నుండు ననుకొను సాధారణభావము యథార్థము గాదు. దగ్గరకుఁ జేర్పఁబడు రెండు తెరల వలె నివి యుండును. ఒక డోలు చర్మము మధ్యగా చీల్పఁ బడినపు డెట్లుండునో, నీ నాద తంతువు లట్లుండును. ఈ చీలిక పురుషులలో సాధారణావస్థలో ½ అంగుళము పొడ వుండి, సాగినపు డొక యంగుళము వఱకుండును. స్త్రీలలో నిది ½ అంగుళము పొడవుండి, సాగినపుడు ¾ అంగుళ మగును. (4) కొండనాలుక (Epiglottis) :- జిహ్వకు పై భాగమున, కృకాగ్ర మున నొక మూతవలె నొక సుకుమారమైన పత్రాకారపు మాంస ముండును. అదే కొండ నాలుక. సామాన్యముగా నది నాలుక వెనుక క్రిందుగా నిలబడి యుండి, గాలి పీల్చుటకు కృకాగ్రమును తెఱచి యుండును. కృకాగ్రములో నన్య పదార్థములు పడునను భయము గలిగినపుడు కొండనాలుక క్రిందకువ్రాలి యా దారిని మూయును. దేనినైన మనము మ్రింగునపు డదిమూసియే యుండును. (5) గళాగ్రము (Pharynx) :- ఇది కృకాగ్రము పైన నొక పేటికవలె నేర్పడి యుండును. దీనికి పై భాగమున రెండు తలుపులు గల ద్వారము లుండును. క్రింది

భాగపు దారులలో నొకటి కృకాగ్రమునకును, మఱియొకటి యాహార నాళికను జేర్చును. పై భాగపు దారులలో నొకటి నోటికిని, నింకొకటి నాసికకుఁ గాని పోవును. (6) కఠిన - మృదు తాలువులు (**Hard & Soft palates**) :- నోటి పైకప్పు రెండు భాగములు గలది; ముందు భాగమును, వెనుక భాగమును. ముందుభాగ మర్ధ చంద్రాకారమున బొమికతో నుండి మాంసకండతోఁ గప్పఁ బడినది. ఇదే కఠినతాలువు. వెనుకభాగము మాంసపు కండతో నిర్మింపఁబడి చైతన్యముతో నొప్పు చుండును. దీనిని మృదు తాలు వందురు. (7) లంబిక (Uvula) :- మృదుతాలువు యొక్క చివర కొన వంకర తిరిగి వ్రేలాడు భాగము లంబిక యనఁ బడును. ఇది విశ్రాంతి సమయమున నాలుక మొదట వ్రేలాడు చుండును. మృదుతాలువున కున్న మాంస కండల మూలమున నంబిక లేచుటయు, సాచుటయు జరుగును. లంబికకుఁ మాంసకండ యుండి దాని మూలమున నది క్రిందకు మీఁదకు వ్రాలు చుండును. దీని వలన నాసిక మార్గము మూయఁ బడుటయు, తెరవఁ బడుటయు గూడ జరుగును. (8) నాసిక మార్గము - (Nasal Passage) :- ఇది నోటి పైభాగమున ముక్కునుండి లంబికవఱకు వ్యాపించి యుండును. (9) నాలుక (**Tongue**) - ఇది వాగవయవములలో చాల ముఖ్యమైనది. నోటి క్రింది భాగమున నిది యమర్పఁబడి, స్వేచ్ఛా చలనము గలదై, యనేక విధములుగా మడతలు పడఁ గలదు. (10) దంతములు :- (Teeth) :- నిశ్చలముగా నుండునట్లు కూర్పఁ బడినవి. (11) ఓష్ఠములు (Lips) :- కండలతో నేర్పడుటచే నివి వివిధ రూపములుగ నుండఁగలవు. (12) క్రింది దౌడ (lower jaw) :-వాగ్ద్వారమును విశాలముగఁ గాని, సంకుచితముగఁ గాని చేసి, యందలి యితరావయవములను స్వేచ్ఛగా దమ ధర్మము లను జేయనీయును. (13) నాసికాంతర్భాగము (Nasal cavity). (14) శ్వాసనాళిక (wind pipe) (15) ఆహారనాళిక (food pipe). (16) జిహ్వామూలము (back of the tongue). (17) జిహ్వామధ్యము (**front on the tongue**). (18) జిహ్వాగ్రము (**tip of the tongue**).

(19) దంతమూలము (teeth ridge). (20) దంతాగ్రము (teeth front). ఈ యవయవముల మూలముననే వర్ణోత్పత్తియు, వాగ్వ్యాపారమును సాగును.

ధ్వనిపుట్టుక

సామాన్యోచ్ఛ్వాస నిశ్వాసములం దూపిరితిత్తులలోనికిఁ బీల్చుకొనఁ బడిన గాలి, తిరిగి కడుపునను గంఠముననుగల కండరముల బిగింపు వలన బైటికి వదలిపెట్టఁబడుచున్నది. అది యూపిరిగొట్టము ద్వార కృకాగ్రము (larynx) ను జేరి, యటనుండి రెండు నాదతంతువుల మధ్యనుండి పోవును. అది తర్వాత గళాగ్రభాగము (pharynx) ను జేరి, కంఠ, జిహ్వా, తాల్వోష్ఠాదులను తాకకుండ ముఖనాసికా ద్వారముల కుండ బైటికిఁ బోవును. ఈ యుచ్ఛ్వాస నిశ్వాసములు తీక్ష్ణముగా నున్నపుడు కాని, పడిశము మొదలైన వానివలన నాటంకము లేనపుడు కాని, కలుగు ధ్వని గమనింప రానింత స్వల్పముగ నుండును. ఆ స్వల్పధ్వని యైనను మార్గపార్శ్వముల యొరిపిడి వలననే కలుగుచున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు తీక్ష్ణమైన కొలఁది, లేదా, నిశ్వాసమార్గమున నాటంకమున్న కొలఁది, యొరిపిడి యధికమై యాధ్వని స్పష్టతరముగ వినిపించును.

నిశ్వాసావయవ స్థానమందలి వివిధ కండరముల శక్తిని ప్రయోగించుట మూలముననే యీ నిశ్వాసము భాషగా మారుచున్నది. మాట్లాడునపు డూపిరితిత్తులనుండి గాలి, సామాన్య స్థితియందువలె, మెల్లగను, శక్తిహీనముగను వెడలదు. కాని హెచ్చు తగ్గులగు శక్తితో చిన్న చిన్న తఫాల వరుసగా గాలి వెడలఁగొట్టఁబడును. ఇట్టి శక్తివంతమైన గాలి నాదతంతువుల రెండింటి కొసల మీఁదుగాఁబోయి, కండరముల బిగువుచే పరస్పరాకర్షణ మొంది వ్యాపించును. ఇట్టి పరిస్థితి యందీ రీతిగ భాషాంశమగు శబ్దము, లేక ధ్వని, లేక నాదము ప్రారంభమగును. జిహ్వను దాటిన తర్వాత నీ నాదపూరక వాయుతరంగము, గొంతుక, నాలుక, తాలువు, దౌడ, పెదవులు మొదలైన వాని వ్యాకుంచనకండరముల వ్యాపారముచే వివిధమైన నున్నితములు, క్లిష్టములు వగు

మార్పులకు లోనగును. మాట్లాడు నపు డీ యవయవవ్యాపారముచే నాదమార్గ మెడ తెగకుండ బహువేగముగ చిన్నదగుట, పెద్దదగుట, మూసికొనుట, సంకుచితమగుట మొదలగు ననేక విధరూపములను పొందును. ఈ వివిధమైన రూపములనుండి వివిధాక్షర సంజ్ఞ గల ధ్వనులు పుట్టును. వెనుకఁ దెల్పిన రీతిగ, పైన వివరించిన వాగవయవములన్నియు విరామముగ నున్నపుడు, నోరు తెరచియుండినను, లేక మూసికొని యున్నను గూడ, సామాన్యోచ్ఛ్వాస నిశ్వాసములు జరుగు నపుడు మాత్రము, గుర్తింపఁదగినంత ధ్వనియుండదు. కొన్ని స్థానము లందుఁ గొన్ని విధములఁ జేయు ప్రయత్నములచేతను, కండర వ్యాపారములచేతను, భాషాధ్వనులు పుట్టుచున్నవి. స్వరములకు వివిధ వ్యంజనములకుఁగూడ, నాదతంత్రులను కంపింపఁజేయుటలోనే కండర వ్యాపారము యొక్క ప్రథమ ప్రయోజన మున్నది,

వాగ్వ్యాపారము

జిహ్వా యిరుపార్శ్వములందుండి రెండు మాంసపు పొరలగు నాదతంత్రులు దగ్గరకు లాగఁబడఁగ, శ్వాసనాళికనుండి పైకివచ్చు గాలి, నాదతంత్రుల మధ్య చీలికనుండి బలవంతముగా కొంచె మెడము చేసికొని పైకి త్రోసికొనుచు పోవును. ఆ పొరలు తిరిగి యథాస్థానమునకు వెనువెంటనే పడిపోయి, మరల తత్క్షణమే త్వరగా లేచుచు, నిట్లు క్షణమున ననేక పర్యాయములు జరుగుచుండును. నాగస్వర వాద్యవిశేషమున మధ్య నుండు పీక, యూదిన గాలిచే నెట్లు కంపమొంది ధ్వనించునో, యట్లే యీ నాదతంత్రులు శ్వాసనాళికనుండి వచ్చు గాలిచే కంపించి ధ్వని చేయును. ఈ కంపనము మూలముననే ధ్వని గలుగును. నాదతంత్రు లీ విధముగ పనిచేసినపుడే, ధ్వనిలో నాదమున్నదని చెప్పఁబడును. కొన్ని వ్యంజనములు శ్వాసనాళికలో నేదో యొక చోట గలిగిన యొఱి పిడిచేఁగలుగును. అవి నాదతంత్రుల కంపనమును గోరవు. వానిలో 'శ్వాసము' (breath) మాత్రమే యుండును. కాని నాద (voice) ముండదు. అందుచే నవి 'నాదహీనము' (voiceless) లనఁబడినవి.

(i) నాదవంతమైన ధ్వనులలో వాయుప్రవాహము నాదతంత్రుల యొద్ద నీ క్రిందఁ జూపిన విధమున మారును.




(ii) నాదహీనమైన ధ్వనుల వాయుప్రవాహ మీ క్రింది రీతిగ ప్రసరించును.




ఒకానొక ధ్వని నిలుచు కాల విషయముకంటె, నొక స్వరము నుచ్చరించుటలో వాయుప్రవాహమునఁ గల కంపనములు పలువిధములుగ నుండినను, మూఁడు స్పష్టమైన విధములుగ గుర్తింపఁబడినవి.

1. వేగము: అనఁగా నాదతంత్రు లొకానొక కాలములో కంపించు సంఖ్యలోఁగల భేదము. దీని ఫలితము జనించు నచ్చులోఁ గాక, యాధ్వని వెలువడు స్వరితములో (pitch) లో నుండును. నాద తంత్రుల కంపనమెంత యెక్కువ వేగముగ నున్న, వాయుతరంగమంత చిన్నదై, ధ్వనియంత యెక్కువ కీచుగ నుండును. దీర్ఘాలు దీయుచు మాట్లాడు మాటలలో 'స్వరిత' ముండును. చిన్ననాదతంత్రులు దీర్ఘ నాదతంత్రుల కంటె నెక్కువసార్లు ప్రకంపింపఁగలవు. కాన, స్త్రీ పురుషుల నాదతంత్రులలోఁ గల వ్యత్యాసమును బట్టి వారి స్వరిత కంఠ ధ్వనిలోఁగూడ భేదముండును.

2. వైశాల్యము (Amplitude): నాదకంపము తరంగములుగ పరిగణింపఁబడుటచే నీతరంగముల యౌన్నత్యము మీఁద నీ వైశాల్యమాధారపడియుండును. ఈ తరంగముల వైశాల్య తారతమ్యము నిలువు గీతలచే నీ క్రింది పటమునఁ దెలుపఁబడును.

దీని ఫలిత ముదాత్తత లేక యుచ్చత. (loudness or stress) : వాయుప్రసారశక్తిని బట్టి నాదతంత్రుల యూపులును, బలాబలములను

(1)



(ii)

బట్టి యీ ప్రకంపవైశాల్యము నుండును. భాషాచరిత్రలో నుదాత్తో చ్చారణ కధికమైన విలువ గలదు.

(3) రూపభేదము (form);-ధ్వని సమానమైన యుదాత్తతగాని స్వరితముగాని కలిగియున్నను, నిశ్వాస వాయువు వెడలు నాదమార్గమున నేర్పడు వివిధ రూపములవలన, నది గుణములో భిన్నమై యుండవచ్చును. కాన నీ ప్రక్క రూపముగల నాదతరంగము. ～～～～～～ వేగమునఁ గాని, బలమునఁ గాని భేదములేకయే, ముఖద్వారమునఁగల విశిష్టవిరూపమువలన నీ క్రింది రీతిగ మారవచ్చును. ～～～～～～ అప్పుడు చాలభేదమున నాదము వెడలును. ఈ భేదమును బట్టియే స్వరములు, లేక అచ్చు లన్నియు నిర్ణయింపఁబడును. నాదతంత్రులకు సంబంధించినంతవఱకు దాని యుత్పత్తి సమానమే. అ, ఇ, ఉ, ఒ, ఔ, ఏ, ఐ ల పరస్పరభేద మీగుణముననే కలదు. ఈ గుణము నోరు, నాసిక, గళాగ్రముల కూటస్థలమున నేర్పడు విరూపమునఁ గలుగును.

యథార్థమున కీస్వరధ్వనుల, లేక, యచ్చుధ్వనుల సంఖ్య యపరిమితముగాఁ గనఁబడును. కాని ప్రయోగమున వీని నన్నింటిని

**అచ్చుల యుత్పత్తి**

గుర్తించి యుపయోగింపఁజాలము. వివిధ భాష లలోను, మాండలికములలోను గుర్తింపఁదగిన స్వరము లన్నింటిని సేకరించినచో నది యొక పెద్ద పట్టిక యగును. భాషా శాస్త్రజ్ఞుఁడు వాని నన్నింటినిఁ గలిపినను ముప్పదియారు (36) మూల

స్వరములకంటె నధికమునకుఁ బోఁజాలఁడు. నాలుక యొక్క మూఁడూర్ధ్వ రూపములు, మూఁడు సంకుచిత రూపములు, రెండు వర్తులాకారములు, రెండు వెడల్పురూపములు గలవి మొత్తము 36 మాత్రమే యగును.

నాదతంత్రులను కంపించిన వాయువు స్వరమార్గమునుండి పోవు నపుడు, నాలుక యథాస్థానమున విశ్రామమున నుండఁగ, పెదవులు తెరచిమాత్రముంచి (ముందునకు పొడుచుటకాని, వెనుకకు కుంచించుట కాని చేయక) మృదు తాలువును గళాగ్రము వెనుక కెత్తినచో, 'అట్' లోని 'అ' కార స్వరముద్భవించును. దీనికి భిన్నముగా, కృకాగ్రమును పైకెత్తి, పెదవులను నోటిమూలలను కుంచించి, నాలుకను తాలువు దగ్గరకెత్తి, శబ్దగోళమును చిన్నదిగ చేసి, స్వరోచ్చారణమునందెల్ల నల్పముగ నొనర్చినచో 'ఇ' స్వరము పుట్టును. మరల, కృకాగ్రమును క్రిందకు దించి, పెదవులను ముందునకుఁజాపి గుండ్రము చేయుటచే విశాలగోళమును సృజించి, నాలుకను మృదుతాలువు వైపున కెత్తి, పెదవులను సంకుచిత మొనర్చినచో 'ఉ' కారము జనించును. ఇఁక పెదవుల నట్లే ముందునకు గుండ్రముగా పొడగించి, కృకాగ్రమును పై కెత్తినచో 'ఐ' కారముదయించును. ప్రతి స్వరోచ్చారణ వర్ణన మనవసరము. నాలుక నెత్తుట, త్రిప్పుట, సంకుచితపఱచుటలోఁ గల న్యూనాధిక్యములతోడను, పెదవులు బుగ్గలతో గుండ్రముగా చేయు టలోఁ గల నెక్కువ తక్కువలలోను వివిధ స్వరములు లేక అచ్చులు భేదించును. పై 36 స్వరముల నిట్లు వర్గీకరింపవచ్చును.

1. ఎత్తు, మధ్య (లేక) క్రిందగా నాలుక యెత్తబడు స్థానములు— ఉదా: 'అ, ఇ'

2. (i) వెనుకకు:- నాలుక వెనుక భాగము మృదుతాలువును జేరిన: అ, ఒ, ఉ.

(ii) ముందునకు:- నాలుక నోటి కప్పును చేరినచో - ఎ, ఇ, ఐ.

3. సంకుచితము, విశాలము:- 'ఆ'లో విశాలముగను, 'అ'లో సంకుచితముగను నాలుక యుండును.

4. వర్తువ, వర్తువలేకుండుట :- పెదవులు, బుగ్గలును, 'ఉ'కు ఎక్కువ, 'ఒ' కు తక్కువ. 'ఆ'కు హీనముగ గుండ్రమగును.

వీనిలో 'అ' కారము స్పష్టమును, ప్రాతిపదికమునైన స్వరము. అది ప్రకృతిసిద్ధము నవికృతమునైన యచ్చు. 'ఇ' కార మున్నతమును, సంకుచిత మార్గమును గలది. 'ఉ' కారము గుండ్రమును, పొడవునైన మార్గము గలది. ఇప్పటికి మూఁడు ముఖ్యమైన యచ్చులు వచ్చినవి. వీని నొక త్రికోణముగఁ గూర్చిన,




మిగిలిన యచ్చులన్నింటిని వీని మధ్యనే కూర్పవచ్చును. 'ఎ,ఒ, ఐ, ఔ'లు వానికిఁ జెందిన యౌన్నత్య వర్తువలను బట్టియుండును.




ఇండో జర్మానిక్ భాషలలో, ఎ = అఇ (ఎఇ, ఉఇ,) ; ఓ = అఉ (ఎఉ, ఒఉ); సంస్కృతమున నివియు, ఔ, ఐ, లును సంధ్యక్షరములు. వీనిలో 'ఏ, ఓ 'లు గుణగతమైన స్వరములు; సంధిలో గుణముచే వచ్చినవి. ఉదా :- ఉప + ఇంద్రః=ఉపేంద్రః ; గంగా + ఉదకం = గంగోదకం. ఇట్లే, 'ఐ, ఔ 'లు వృద్ధిగతమైన స్వరములు, వృద్ధిచే వచ్చినవి. ఉదా ;

ఉప + ఏతి = ఉపైతి; ప్రష్ఠ + ఊహః=ప్రష్ఠౌహః ; గంగా+ఓఘః= గంగౌఘః. ఐ, ఔ లను diphthongs అని ఇంగ్లీషుభాషలో అంటారు.

పైనఁ దెల్పిన స్పష్టాచ్చులు గాక, యనిశ్చితము, నస్పష్టమునైన యొక యచ్చు ముఖ్యముగా పాశ్చాత్యభాషలలో గుర్తింపఁబడినది.

అస్పష్టాచ్చు
neutral vowel

ఊనిక (accent) లేని స్వరములం దిది యుండును. ఉదా :- ' ămong , ăt home: ătone; ăttempt; vehĕment ; tŏgether ; phenomenă , (ఇందు పైన గీతనుంచిన యచ్చుమాత్రమే) దీనికి వ్రాఁతలో నుండునచ్చు నుచ్చారణమున నేకము మాత్రము గాదు. దీనికి ప్రత్యేకమైన గుర్తు లేదు. కాని భాషాశాస్త్రజ్ఞులు సామాన్యముగా తలక్రిందైన యాంగ్ల 'e' కారపు గుర్తును 'ə' వాడుదురు.

ద్రావిడభాషలలోఁ గూడ నీ యస్పష్టాచ్చులు గలవు. ఇవి పదముల యాదిమధ్యాంతము లందుండుచు, పోవుచు, శబ్దముల రూపములను మార్చుచుండును. ఉదా : (తమిళమున) 'అరశర్ ; ఇరశర్ ; ఇరణ్డు ; ఎఱక్కుమ్ ; ఉలగు మొదలగు 'ర, ల' లాదిగాఁగల పదములకు ప్రారంభమున నూతగా నిలుచునవి. తెలుఁగున ; 'అరను, అరయు, ఎఱక, ఒలయు' మొదలగు పదములలో నారంభాచ్చు లిట్టివే.

(1) తెలుఁగు శబ్దముల మధ్యమందలి అకార, ఉకారములు గొన్ని యనిశ్చితములై, యుచ్చారణ మనిర్ధారిత మగుటకుఁ గారణమైనవి. ఉదా: నిలకడ- నిలుకడ ; పడక-పడుక ; పడమర-పడుమర ; మొదలైనవానిలోని యస్పష్టాచ్చులు.

(2) తెలుఁగు పదముల తుది 'ఉ' కారము వ్యవహారమందును సంధిలోను లోపించుటకుఁ గారణ మది యస్పష్టాచ్చు కాబట్టియే.

(3) పదమధ్యమందలి సంయుక్తాక్షరములను విడదీయుటకుఁ గాను మధ్య చేర్పఁబడిన (స్వరభక్తి లేక విప్రకర్షమున) (anaptyxis) యచ్చు ఇట్టి యస్పష్టాచ్చే. ఉదా: ఇంద్ర > ఇందిర ; చంద్ర > చందిర : చంద్రుఁడు > చందురుఁడు ;

(4) పదమధ్యగతమైన (యుపధా) అచ్చులోపించుట (**syncopation**) యది యస్పష్టాచ్చగుట వలననే. ఉదా: చిలుక > చిల్క; అలుక > అల్క; కలికి > కల్కి; కొలది > కొల్ది; మొదలైనవి. కాని విభక్త్యాది వ్యాకరణరూపముల యుపధాచ్చులకు సాధారణముగ లోపమురాదు. ఏలన, నది యస్పష్టాచ్చు గాకుండుటయే కారణము. ఉదా: చలికి > 'చల్కి' కాదు.

(5) పదాంతమందుఁ గొన్ని యచ్చులు సాధారణముగ వ్యవహారమునను, వాఙ్మయమున సంధియందును లోపించుట యిందుచేతనే. ఉదా: భయంపడు; విజయంచేయు; ధనమ్; ఫలమ్ మొ॥

ఈ మార్పులు మాండలికములకు దారితీసి యొకపు డర్థభేదమును గూడ గల్గించును. తర్వాత నివి ప్రత్యేక భాషలుగ పరిణమింపఁగలవు.

ఇంతవఱకు స్వచ్ఛమైన యననునాసి కాచ్చులు మాత్రము తెలుపఁబడినవి. అనఁగా నాసికమార్గము మూయఁబడగా నుచ్చరింపఁబడిన యచ్చులు. నాసికధ్వనితోఁ గూడినవి యనునాసికాచ్చు లనఁబడును. అప్పుడు వాయు ప్రసారము నాసికరంధ్రము ద్వారగూడ జరుగును. ఇందుచేతనే సిద్ధాంత కౌముదియందుఁగూడ నివి యంగీకరింపఁబడి, 'ముఖనాసికా వచనోనునాసికః'-'ముఖసహిత నాసికయోచ్చార్యమాణో వర్ణోనునాసిక సంజ్ఞ స్యాత్'అని చెప్పఁబడినది. ఇందుచేతనే ప్రతియచ్చును రెండు తెఱఁగు లగును. కాన ప్రతి యచ్చు (అ,ఇ,ఉ,ఎ,ఒ,ఋ)ను హ్రస్వ, దీర్ఘ, ప్లుతమను మూఁడు విధములును, ఉదాత్తానుదాత్త స్వరితములను మూఁడు భేదములును, అనునాసికా, అననునాసికములను రెండు తెఱగులును గలసి మొత్తము (3×3×2=18) పదునెనిమిది విధములుగ నుండును. ఉదా: 'ఆకు'లో 'ఆ' అననునాసిక; 'తాటాకు'లో 'ఆ' అనునాసిక 'ఆ' కారమగును. 'అఙ్లే,' మఱ్ఱాకులోని 'ఆ' కారము; cff. Man, మాన్ (ఆంగ్లములో). **Mat, Cat, Fat, Rat, etc.**

అనునాసికాచ్చులు

ఐ - ఔలు (Diphthongs) :- వాగవయవము లొకానొక స్వరోచ్చారణ స్థానము నుండి మఱియొక స్వరోచ్చారణ స్థానమునకు మారుటలో మధ్యకాలమున ధ్వనించు నాదఫలితము (వక్రము, వక్రతరము), ఐ, ఔ లగును. కాన అయ్, అవ్, ఎయ్, ఎవ్, మొదలైనవి రెండచ్చుల కలయిక యని మాత్రము చెప్పుటకు వీలులేదు. యథార్థమున కీ రెండింటిలో నే యొకటియుఁ గూడ కాదు. పాశ్చాత్యభాషలలో వీనికి ప్రత్యేకమైన గుర్తులులేక, రెండచ్చులు వరుసగ వ్రాయఁ బడును. కాని యీ నియమముగూడ కచ్చితముగ లేదు. కొన్ని చోట్ల రెండచ్చులు వరుసగా నున్నచోట్లఁ గూడ నీ యుచ్చారణము లేక పోవుటయుఁగలదు. ఉదా : Pour (పోర్); Broad (బ్రాడ్); మఱికొన్ని చోట్ల 'ఇ' కారమే 'ఐ' కారముగా నుచ్చరింపఁబడును. ఉదా: Nice (నైస్); Vice (వైస్).

స్వర-వ్యంజనములు ; పరుష-సరళములు ; అంతస్థములు

అచ్చు, (స్వరము) లనఁగా నుచ్చరింపఁదగిన ధ్వనులనియు, హల్లు (వ్యంజనము) లనఁగా నట్లుచ్చరించుటకు వీలులేని ధ్వనులనియు, నక్షర సమామ్నాయమునఁ జేయఁబడిన ప్రాచీనవిభాగము శాస్త్రదృష్ట్యా యథార్థముగాదు. సామాన్యముగా హల్లులనఁబడునవి యచ్చులకంటెఁ బైన వివరించిన రీతిగ విశిష్టమై, నాదనాసిక ద్వారములందు (పూర్తిగ కాక పోయినను) ముఖ్యముగ జనించిన వని నమంజసముగ వివక్షింపఁబడినవి. నినదించినను, లేక, శ్వాసించినను నవి వాయుప్రవాహమార్గమున నెక్కడో యొకచోట, రాపిడిఫలితమునఁ గాని లేక, సంపూర్ణ నిరోధఫలితమునఁ గాని పుట్టును. ఈ వ్యంజనములు దమకుఁదాము వర్ణములను గూర్పలేవనుటయు, వానిలోఁగొన్ని స్వరముల కూడిక లేకుండ నుండలేవనుటయు యథార్థమే యైనను, వర్ణసమామ్నాయమున, వ్యంజనములను గూర్చి సామాన్యముగా వర్ణింపఁబడిన యనేక విషయములలోఁ బైఁ జెప్పిన విషయము చెల్లదు. ఉదా॥ ఆంగ్లేయభాషలో table - (టేబిల్); father (ఫాదర్); even (ఈవెన్)

bosom (బోసమ్) వంటి పదములును, ఫ్రెంచిభాషలో arbre (అర్బ్రి); table (టేబిల్); వంటి మాటలును, జర్మన్ భాషలో handel (హాండెల్) vater (వాటెర్); guten (గూటెన్); gutem (గూటెమ్) వంటి శబ్దము లందును వర్ణరచనాక్రమము యాథార్థ్యమును గప్పిపుచ్చును. యథార్థ మున కా పదములు 'tabl, fathr, evn, bosm,' అర్బ్, గుట్న్ మొదలైన క్రమముగా నుచ్చరింపఁబడును. ఇందుచే నంతస్థములగు 'ర్, ల్'లును, అనునాసికములగు 'మ్, న్'లును దమకుఁదామే వర్ణనిర్మాణ దక్షత గల్గియున్నవనియే చెప్పఁదగును. సంస్కృతభాష లోను, స్లవోనిక్ భాషలలోను, అంతస్థములు వ్రాఁతయందుఁ గూడ నచ్చుల యనుసరణ లేకుండగనే వర్ణములుగా నేర్పడి, యాతగూడఁ గలిగియున్నవి. అదే విధముగ 'Z జ, V వ' కారము లచ్చుల సహాయము లేకుండనే స్వతంత్రములుగ వ్యవహరింపఁగలవు. Was అను పదము సాధారణముగ 'Wz, వ్జ' అనియుచ్చరింపఁబడును. కాన పరుష - సరళములు మాత్రమే (క, గ; త, ద; ప, బ;) సామాన్యముగ వర్ణవిభాగమున వ్యంజనములని వ్యవహరింప నగును. ప్రత్యక్షానుభవ మున 'నాద' భారమును వహింపని ధ్వనులు వ్యంజనములుగానే పరిగ ణింపఁబడఁగ, 'నాద' భారమును వహించు ధ్వనులు, స్వరములు గాక పోయినను, వర్ణనిర్మాణమున నచ్చుల బాధ్యతను నిర్వహింపఁగలవు. ఏలన, నాంగ్లేయభాషలో, ఎ, ఇ, ఐ, ఒ, యు, (a, e, i, o, u) అను వర్ణములే కాక, z, v, l m, n, r. (జ, వ, ల, మ, న, ర) అను నాదో ష్మములు, నాదాంతస్థములు, అనునాసికములును గూడ వర్ణనిర్మాణ శక్తి గలవి. మిగిలినవి సర్వవ్యవహారములకు సంపూర్ణ వ్యంజనము లుగా పరిగణింపనగును.

కాన 'స్వర - వ్యంజనముల'ను సాధారణ వ్యతిరేకభావము సమంజసముగాదు. అవి 'ధ్వనులు - నిర్ధ్వను' లనుట సరసముగా నుండును. అందు ధ్వనులనఁగా, స్వరముగల యచ్చులుగాని యితరములు గాని, హల్లులతోఁ జేరనివి యగును. అందుచే 'ధ్వనులు - నిర్ధ్వను లు' గాఁ గూడ 'ర, ల' లమరును. ఏలన, 'లాస్కర్' (Lascar)

అను పదమున 'ర,ల' లు రెండును వ్యంజనములే. కాని 'మిజరబుల్' (Miserable) అను మాటలో 'ర, ల'లు రెండును గూడ (Sonants) యథార్థమునకు ధ్వనులే యగును. (ఉచ్చారణ: మిజరబ్ల.)

మఱియు నచ్చులైన 'ఇ - ఉ'లు రెండును త్వరితోచ్చారణమున, లేదా, వ్యవహారమున 'య - వ'లుగా వ్యంజనోచ్చారణమును బొందును. ఈ ధర్మమున నివి 'యంతస్థములు (semi vowels)గా వ్యవహరింపఁబడును. ఉదా: ఇక్కడ > యిక్కడ; ఉన్నాడు > వున్నాడు. (వ్యావహారి కాంధ్ర భాషాప్రయోగము చూడుడు.)

వ్యంజనములు వివిధపద్ధతుల ననుసరించి యనేక విధములుగా విభజింపఁబడుటకు వీలిచ్చును. వాని విభాగవిచారణము, (1) ఉచ్చారణ పద్ధతి లేక గుణము (బాహ్యప్రయత్నము) ననుసరించును. అనఁగా, నాదము, శ్వాసము, మహాప్రాణమను దానిపై నాధారపడును. (kind of articulation) (2) వాని యుచ్చారణ సమయమున నాదమార్గమున నేర్పడు వివృతత్వ ప్రమాణమును (degree of openness) అనఁగా ఆభ్యంతర ప్రయత్నమును బట్టియు. (3) స్థానకరణ మనఁగా నాదమార్గమున నెక్కడ వానికి యొరపిడి, యాగుట, మొదలైనవి జరుగునో (place of articulation) వానిని బట్టియు మూఁడు విభాగములుగ నిర్ణయింపఁబడును.

హల్లులు-వాని విభాగము

'నాదము' (voice) ను గుఱించి వెనుకఁ దెలుపఁబడినది. శ్వాస (breath) మనఁగా నాదతంతువుల కంపనము లేక పోవుటయే. మహాప్రాణములగు వ్యంజనములలో శ్వాసముగాని, నాదముగాని యుండి, బలవంతముగా నొత్తుతోఁ బలుకఁ బడును. ఇందుచే నాలుగు విధములైన ధ్వనులు సామాన్యముగా తెలియనగును. అవి క్రమముగా 1. నాదవంతములు. 2. నాదరహితములు. 3. నాదమహాప్రాణములు. 4. నాదరహిత మహాప్రాణములు ననునవి. భారతీయు లింకను సూక్ష్మవిచారము చేసి బాహ్యప్రయత్నము పదకొండు విధములని తెల్పిరి. అవి 1. వివారము

బాహ్య ప్రయత్నము
Kind of articulation

2. సంవారము. 3. శ్వాసము. 4. నాదము, 5. ఘోషము. 6. అఘోషము. 7. అల్పప్రాణము. 8. మహాప్రాణము. 9. ఉదాత్తము. 10. అనుదాత్తము. 11. స్వరితము. ఇందు శ్వాసము=Breath. నాదము=Voiced, మహాప్రాణము=Aspirate అగును. ఉదాత్తానుదాత్త స్వరితము లూనిక (Accent) కుఁ జెందినవి. మిగిలిన సంవార వివారములు, ఘోషలును భారతీయ వైయాకరణుల విశేష విభజనకుఁ జెందినవి. వివార సంవారములు శ్వాసనాళిక పొందు వివృతత్వ సంవృతత్వములను దెలుపును. ఘోష మనునది శ్వాసము కంటె నధికమును, నాదముకంటె తక్కువయు నగు ధ్వనిని సూచింప వచ్చును. వీనిని పాశ్చాత్యులు గుర్తించినట్లు తోఁచదు. లేదా, వారు వివార, శ్వాస, అఘోషములను మూఁటినిఁ గలిపి Unvoiced అనియు, సంవార, నాద, ఘోషములను మూఁటినిఁ గలిపి Voiced అనియు పేర్కొనిరని చెప్పవలయును. సిద్ధాంతకౌముదియందు వర్ణసమామ్నాయ మిట్లు బాహ్యప్రయత్నమును బట్టి విభజింపఁబడినది.

1. క, చ, ట, త, ప ; ఖ, ఛ, ఠ, థ, ఫ :- శ, ష, స :- వివార, శ్వాస, అఘోషములు, - Unvoiced or Voiceless.
2. గ, జ, డ, ద, బ ; ఘ, ఝ, ఢ, ధ, భ ; హ, య, వ, ర, ల :- సంవార, నాద, ఘోషములు - Voiced
3. క, చ, ట, త, ప ; గ, జ, డ, ద, బ ; య, ర, ల, వ :- అల్పప్రాణములు - Unaspirates.
4. ఖ, ఛ, ఠ, థ, ఫ ; ఘ, ఝ, ఢ, ధ, భ ; శ, ష, స, హ:- మహాప్రాణములు - Aspirates
5. ఘ, ఝ, ఢ, ధ, భ :- Voiced Aspirates.
6. ఖ, ఛ, ఠ, థ, ఫ :- Unvoiced Aspirates.

వివిధములైన వ్యంజనముల నుచ్చరించుటకు శ్వాసనాళికను వివిధ స్థలములం దనేక విధములుగ సంకుచిత పఱచ వలసియుండును. బాహ్యప్రయత్నమున వాయుప్రవాహము కొన్ని వేళలఁ బూర్తిగ బంధింప వలసి యుండును, నొకపుడు మఱియొక త్రోవ మూలముగ పోనిచ్చుచు సంపర్కముచే దారిలోఁ గొంత భాగమే యాటంక పెట్టఁ

అభ్యంతర ప్రయత్నము (Degree of Openness)

బడును. ఎట్లన పెదవులు మూయఁబడి నాసిక మార్గము తెరవఁ బడును. లేదా, నాలుక తాలుమధ్యము నంటి వచ్చును, కాని ప్రక్కల దారి నొసఁగవచ్చును. (ఉదా:-'ల'కారోచ్చారణము.)

ఈ క్రింది ప్రయోగములు ప్రత్యేకముగ గమనింపఁదగినవి.

(1) నోరును ముక్కును బూర్తిగ మూసినపుడు స్పర్శలు (Stops, mutes, or explosives) పలుకఁబడును. ఉదా:-క, త,ప; గ,డ,బ; ఖ, థ, ఫ; ఘ, ఢ, భ, లు. ఇవిక్షణికములే కాని దీర్ఘములు గావు. క్రిందివి సాగదీయ నగును.

(2) నోరును బూర్తిగ మూసి, నాసికా ద్వారమును దెఱచిన అనునాసికములు (Nasals) పుట్టును. ఉదా:-ఙ, ఞ, ణ, న, మ, లు.

(3) నోటిని నాలుకచే మూయుటవలన అంతస్థములు జనించుచున్నవి. నాలుక ప్రక్కలనుండి గాలి దాటిపోయినచో 'ల'కారమును, నాలుక క్రిందికి వంచఁగ గాలి పైనుండి పోయినచో 'ర'కారమును నుద్భవించును.

(4) నోటిమార్గము దగ్గరగా సంకుచిత పఱచి, దాని మధ్య సన్నని సందుకుండ గాలి జారినపుడు, నాదమున్నను లేకున్నను, కొంత రొయిఱిపిడి గల్గి యూష్మములు (Spirants or Fricatives) పుట్టును. అందు 'శ ష స'లు. (z, s, v, f, u, p) అనునవి Sibilants అనియు, మిగిలినవి Fricatives అనియు కొందఱి భావము.

స్థానకరణములకు సన్నికర్షత్వ ముండునట్లుగా నాభ్యంతర ప్రయత్న మొప్పును. ఇది భారతీయ వైయాకరణుల మతము ననుసరించి నాల్గు విధములుగా నుండును. అవి (అ) స్పృష్టము (ఆ) ఈషత్ స్పృష్టము (ఇ) వివృతము. (ఈ) సంవృతము.

(అ) స్పృష్టములు:- స్థానకరణములకుఁ బూర్తియైన స్పర్శ గలిగి, వాయువు నిరోధింపఁబడిన తర్వాత వెలువడును. ఇవి స్పర్శలను (Mutes) పేరుగల యైదు వర్గాక్షరములును గలసి 25 వర్ణములు.

(ఆ) ఈషత్ స్పష్టములు :- స్థానకణములతోఁ గొంచెము స్పర్శ గలవి. అట్టివి యంతస్థము (Semi Vowels) లగు 'య, ర, ల, వ'లు.

(ఇ) వివృతములు :- 'వివృత మూష్మాణాం స్వరాణాం చ'. 'శ, ష, స'లను నూష్మములకు (Sibilants), అచ్చులకు వివృత మాభ్యం

తర ప్రయత్నమని భావము. కాని కొందఱు ఊష్మము లీషద్వివృతము లనియు, అచ్చులు మాత్రమే వివృతాభ్యంతర ప్రయత్నము గలవనియు తలఁచిరి. వివృతమనఁగా తెఱవఁ బడుట. వివృత ప్రయత్నమున స్థాకరణములతో వాయు వడ్డు తగులక యుండును.

(ఈ) సంవృతము :- 'అవర్ణస్య ప్రయోగే సంవృతం, ప్రక్రియాదాశాయాం తు వివృతమేవ చ.' హ్రస్వమైన 'అ'కారము సంవృతము. అట్టి 'అ'కారము వ్యాకరణముచే నేదేని కార్యము చేయునపుడు వివృతమే కాని సంవృతము గాదు.

ముఖద్వారము మూఁతబడుట కాని, సంకుచిత పఱచుట కాని జరుగు స్థానము లనేకము గలవు. ప్రత్యేకావయవములు, నవయవ భాగములును సంకుచిత పఱచినపుడు గలుగు ధ్వనులను విశేషముగ విభజింప వచ్చును. కాని వాని యుత్పత్తిస్థానమును బట్టి ప్రత్యేకించుట చాలును. (1) మృదుతాలువు, లేక, కంఠము దగ్గర. (2) కఠిన తాలువు లేక పై దంతముల దగ్గర. (3) దంత్యముల వద్ద. (4) పెదవుల దగ్గర.

స్థాన కరణములు
Place of articulation




1. క్రింది పెదవి 2. మీది పెదవి. 3. మీదిదంతములు. 4 దంతమూలము. 5 ముఁదుతాలువు లేక కఠిన తాలువు. 6. మూర్ధము లేక మధ్యతాలువు. 7. మృదుతాలువు లేక వెనుకతాలువు, 8. కంఠబిలము. 9. జిహ్వామూలము.

(1) కంఠ్యములు (Gutturals, Velars) :-వీని నుచ్చరించుటకు మృదుతాలువును,జిహ్వామూలము నుపయోగపడును. సెమిటిక్ భాషలోని 'q'యు, జర్మను భాషలోని 'Ch'యు నిట్టివి. ఉదా:- 'Nach, auch' పదములలోనివి. స్కాచ్చి భాషలోని 'Ch' - 'boch', ఫ్రెంచి, నార్తంబరియా భాషలలోని'ర'కారమును ముఖ్యముగా గుర్తింపఁదగినవి. ప్రాచీనభాషా సంప్రదాయమున నివి కంఠ్యములుగా గుర్తింపఁబడినవి. ఇవి వేలరు (Velars) లని కూడ పిలవఁబడును. ఏలన, మృదుతాలువును వెలం (Velum) అని కూడ నందురు. అవి క (q), గ (g), ఖ (qh), ఘ (gh). వీని యనునాసికాక్షరము 'ఙ' 'ng', tongue పదములో వలె నుండును. ఆంగ్లమున Come లోని 'c' 'క'కారమును, 'go' లోని 'g' 'గ' కారమును వేలరులు.

(2) తాలవ్యములు (Palatals):- వీని నుచ్చరించునపుడు కఠిన తాలువు దగ్గర నాలుక మధ్యసంకుచితత్వ మేర్పడును. సెమిటిక్ భాష లోని 'k'యు, నాంగ్లమందలి 'k' (King); 'g' (Give), 'య'(Yes); జర్మన్ భాషలోని 'ch', ఇటాలియన్ భాషలోని 'gl' (bottiglia)యు నీ జాతికిఁ జెందినవి. ప్రాచీన యిండోయూరోపియన్ భాషలో తాలవ్య వ్యంజన సముదాయము గ్రహింపఁబడినది. అవి కంఠ్యములకు భిన్నము లుగా నిట్లు వ్రాయఁబడినవి. ఇవి k, g, kh, gh అనునాసిక n. యును. ప్రాశ్చాత్య ఇండోయూరోపియన్ భాషలు 'కెంటుం' భాషలనియు, ప్రాచ్య యిండోయూరోపియన్ భాషలు 'శతం' భాషలనియుఁ బిలువఁబడును. 'శతం' భాషలలో తాలవ్యములు (Spirants) 'చ' కారోచ్చారణమును, 'కెంటుం' భాషలలో నవి (Explosives) 'క కారోచ్చారణమును దాల్చును.

(a) (i) ఆర్యభాషలు, (ii) ఆర్మీనియన్ భాష, (iii) ఫ్రిజియన్ భాష, (iv) ఆల్బేనియన్ భాష - ఈ నాల్గును ప్రాచ్యయిండో యూరోపియన్ భాషలై 'శతం' భాషలగుచున్నవి.

(b) (i) గ్రీకు, (ii) ఇటాలిక్, (iii) కెల్టిక్, (iv) ట్యూటానిక్, (v) బాల్టిక్ స్లెవోనిక్ భాషలు పాశ్చాత్యయిండోయూరోపియన్ భాషల క్రింద చేరి 'కెంటుం' భాష లగుచున్నవి.

(3) మూర్ధన్యములు (Cerebrals or cacuminals):-కఠినతాలువు క్రిందుగా నాలుకచివర వెనుకకుఁ దిరిగెనా మూర్ధన్యము లుద్భవించును. ఉదా :- 'ష' (ship) : z (pleasure); 'ట, ఠ, డ, ఢ, ణ' అను మూర్ధన్యాలు సంస్కృతమునఁ దప్ప, యితర యిండోయూరోపియన్ భాషలలో లేవు.

(4) దంత్యములు (dentals):-నాలుక చివర పై దంతములను దాకుట వలనఁగాని, సమీపముగ చేరుటవలనఁగాని దంత్యము లుద్భవించును. అవి 'త, ద'లును, సూష్మములలో 'స' కారమును, అంతస్థములలో 'ల' కారమును నగుచున్నవి. జర్మనీభాషలోను, మఱికొన్ని భాషలలో నాలుక చివరభాగము దంతములను చక్కగాఁ దాకును. అందుచే యథార్థముగ నవి దంత్యము లగుచున్నవి. ప్రాచీన యిండోయూరోపియన్ భాషలో దంత్యవ్యవర్గము 'త, థ, ద, ధ'యు, దాని యనునాసికాక్షరమగు 'న'యును.

(5) ఓష్ఠ్యములు (labials):- ఇందు పెదవులు ముఖ్యస్థానము వహించును. ఉదా : 'ప,బ,మ'. పై పెదవియు క్రింది పెదవియుఁ గలసికొని విడివడినపుడీ ధ్వని కలుగును. కాని క్రింది పెదవితో పై దంతములు గూడినపుడు 'ఫ, (f), వ' ధ్వనులు పుట్టును. ఈ చివరవి దంతోష్ఠ్యము లనఁబడును. ప్రాచీన యిండోయూరోపియన్ భాషలో నోష్ఠ్యవర్గము ప, బ, ఫ, భ యు దాని అనునాసికయగు 'మ'యును.

పాణిని సూత్రము :-

(1) 'అ, కు, హ విసర్జనీయానాం కణ్ఠః - అ, క, ఖ, గ, ఘ, ఙ, హ - వీనికి కంఠ ముత్పత్తిస్థానం.

(2) ఇ, చు, య, శానాం తాలుః - ఇ, చ, ఛ, జ, ఝ, ఞ, య, శ - వీనికి దాడ లుత్పత్తిస్థానము.

(3) ఋ, టు, ర, షా ణాం మూర్ధాః - ఋ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ష - వీనికి శిర స్సుత్పత్తిస్థానము.

(4) ఌ, తు, ల, సానాం దంతాః-ఌ, త, థ, ద, ధ, న, ల, స - వీనికి దంతము లుత్పత్తిస్థానము.

(5) ఉ, ఉపధ్మానీయానా మోష్ఠౌ - ఉ, ప, ఫ, బ, భ, మ - వీనికి పెదవు లుత్పత్తిస్థానము.

ఈ క్రింది ధ్వనులకు రెండేసి స్థానములు:

(6) ఞ, మ, ఙ, ణ, నా, నాం నాసికాచ - ఙ, ఞ, ణ, న, మ, లకు ముక్కుకూడ నుత్పత్తిస్థానము.

(7) ఏదైతోః కంఠతాలు - ఏ, ఐ, లకు - కంఠము, దౌడయును.

(8) ఓదౌతోః కంఠోష్ఠమ్ - ఓ, ఔ, లకు - కంఠము, పెదవియును.

వకారస్య దంతోష్ఠమ్ - వ, కు దంతము, పెదవియు.

సమానధర్మము (parallelism) :- స్థానకరణ విషయములో స్పర్శలకు, నూష్మములకు, ననునాసిములకు సమానత్వము గలదు. ఓష్ఠ్యములగు 'ప, బ'ల వలెనే 'వ, ఫ' లును, ననునాసికయగు 'మ' కారమునకు సమానత్వ ముండును. 'మ, ప' కారముల కుచ్చారణమునఁ గల భేదమెక్కడనఁగా, 'మ' కారోచ్చారణమునందు పెదవులు మూయఁబడిన తర్వాత నాసికద్వారము తెరవఁబడును. అట్లే దంత్యములగు 'త, ద'లకును వాని యనునాసికయగు 'న' కారమునకుఁ గలదు. ఆ విధముగనే కంఠ తాలవ్యములకును వర్తించును.

'హ' కారధ్వని (Aspirate) :- నోరు తెఱచి, యూపిరితిత్తుల నుండి బలవంతముగా నాదరహితమైన యూపిరిని వెడలనిచ్చి, బిగియ పట్టిన కృకాగ్రపురంధ్రములో స్పష్టమగు నొరపిడి గలుగునట్లుగాఁ జేసినపుడు 'హ' కారధ్వని పుట్టును. అది నాదరహితమైన యుచ్చారణమే యగును.

వర్ణముల స్థానప్రయత్న వివరణ పట్టిక

| స్థానము | కరణము | స్పృష్ట | | | | | ఈషత్ స్పృష్ట (అంతస్థ) | వివృత అర్ధస్పృష్ట(ఊష్మ) | | వివృత అస్పృష్ట (అచ్చులు) | సంవృత (అచ్చులు) | ఆభ్యంతర ప్రయత్నము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వివార శ్వాస అఘోష | | సంవార నాద ఘోష | | | సంవార నాద ఘోష | వివార శ్వాస అఘోష | సంవార నాద ఘోష | ఉదాత్త అనుదాత్త స్వరిత | ఉదాత్త అనుదాత్త స్వరిత | బాహ్య ప్రయత్నము |
| | | అల్ప ప్రాణ | మహా ప్రాణ | అల్ప ప్రాణ | మహా ప్రాణ | అల్ప ప్రాణ | అల్ప ప్రాణ | మహా ప్రాణ | మహా ప్రాణ | | | |
| | | | | | | అను నాసిక | | | | | అను నాసిక అననునాసిక | నాసిక వలన గల్గిన భేదము |
| | | | | | | | | | | హ్రస్వ, దీర్ఘ ప్లుతము | హ్రస్వ | కాలము వలన భేదము |
| కంఠము | జిహ్వామూలం | క | ఖ | గ | ఘ | ఙ | | ఃక | హ | అ 18 | అ అ. | |
| తాలువు | జిహ్వాగ్రము | చ | ఛ | జ | ఝ | ఞ | య యఁ | శ | | ఇ 18 | | |
| మూర్ధము | కొనుకకు మడచిన జిహ్వాగ్రము | ట | ఠ | డ | ఢ | ణ | ర రఁ | ష | | ఋ 18 | | |
| ఊర్ధ్వదంతము | జిహ్వాగ్రము | త | థ | ద | ధ | న | ల లఁ | స | | ఌ 12 | | |
| ఊర్ధ్వోష్ఠము | క్రింది ఓష్ఠము | ప | ఫ | బ | భ | మ | | ఃప | | ఉ 18 | | |
| ఊర్ధ్వదంతము | క్రింది ఓష్ఠము | | | | | | వ వఁ | | | | | |
| తాలువు | | | | | | | | | | ఎ–12 | వీనియందు కూడ జిహ్వా | |
| ఓష్ఠములు | | | | | | | | | | ఐ–12 | కరణముగ పనిచేయును. | |
| నాసిక | | | | | | అను | | | | ఓ–12 | | |
| | | | | | | స్వార | | | | ఔ–12 | | |

ప్రాశ్చాత్య సంప్రదాయ వర్ణముల స్థానప్రయత్న వివరణ పట్టిక.

| | Velar | Palatal | | Dental | | Labrial | |
|---|---|---|---|---|---|---|---|
| | | Palatal | Cacuminal | Alveolar | Dental | Labio-Dental | Labal |
| **Vowels:-** | | | | | | | |
| Pure | u, o, a. | u,o,u,e,ı | e, ı. | | | | o, u |
| Nasalised | u, o, a. | e, ı. | | | | | o, u |
| **Nosals :-** | | | | | | | |
| Sonant | n | n | | n | | | m |
| Consonant | n | n | | n | | | m |
| **Liquids :-** | | | | | | | |
| Sonant | | | | r l | | | |
| Consonant | Northumbr-r | gl (Ital) | | r l | | | |
| **Sibilant Spirants:-** | | | | | | | |
| Voiced | | | z (z) | z (z) | | | |
| Voiceless | | | s | s | | | |
| **Spirants proper :-** | | | | | | | |
| Voiced | | | ı = (y) | | o | v | u (w) |
| Voiceless | ch (loch) | ch (ıch) | | | p | f | |
| **Stops :-** | | | | | | | |
| Voiced | g (go) | g (give) | | d (Eng) | d (Ger) | | b |
| Voiceless | q (come) | k (key) | | t (Eng) | t (Ger) | | p |
| Voiced Aspirate | gh | gh | | dh | | | bh |
| Voiceless Aspirate | qh. | kh | | th | | | ph |

సామాన్యముగ జనులు మాట్లాడు నపుడు పైనఁ దెలిపిన యనేక ధ్వనులు స్వతంత్రముగ నుచ్చరింపఁబడవు, ఒక్క గుక్కలో మాట్లాడి నపు డందలి వివిధవర్ణము లన్నియు ప్రత్యేకావయవ చాలనములతో నుచ్చరింపఁబడవు అవి యొకదాని కింకొకటి యంటియుండి సాగిపోవుచు, వాగవయవము

చరధ్వని (Glide)

లొక స్థానమునుండి మఱియొక స్థానమునకు దాటిపోవుచుండును. భిన్నోచ్చారణగల ప్రతి రెండుధ్వనులలోఁగూడ నిట్టి ధ్వనిచలన (glide) ముండును. సాధారణముగ నీ చరధ్వనులకు లేఖనమున పాతినిధ్య ముండవలసిన రీతిగ లేదు. ఈ చరధ్వని స్వరములతోడను, వ్యంజనముల తోడను గూడఁగల్గును. ఇవి రెండు విధములుగ నుండును. ఒక భిన్న ధ్వనినుండి మఱియొక భిన్నధ్వని కుచ్చారణము మారునపుడు, మధ్య మొదటి ధ్వనినుండి దిగి రెండవ ధ్వని కెక్కవలయును గదా. ఇందుచే దిగుడుధ్వని, లేక, యవరోహణచరధ్వని (off glide) యనియు, నెక్కుడుధ్వని లేక, యారోహణచరధ్వని (on glide) యనియు రెండు విధములైన చరధ్వను లుండును. ఈ చరధ్వని పూర్వవర్ణమునకుఁ జెందినచో నవరోహణ చరధ్వని (off glide) యనఁబడును, లేక యుత్తర వర్ణమునకుఁ జెందినచో, నారోహణ చరధ్వని (on glide) యనఁబడును. ఉదా :- ఆంగ్లమున 'due - డ్యు' అను పదమును 'du $w_e$'-'డు వ్వె' అని యథార్థమున కుచ్చరించవలెను. ఇందుచే 'w' లేక 'వు' అను చరధ్వని 'u' నకు 'e' నకు మధ్యనేర్పడును. ఇది 'u' నకు అవరోహణ చరధ్వనియు, 'e' కు ఆరోహణ చరధ్వనియు నగును.

ఒకప్పు డీ చరధ్వని యూత (accent) చెందుటయు, లేక దీర్ఘ మగుటయుఁగల్గి, స్పష్టోచ్చారణతో లిఖితరూపము గూడఁదాల్చును. అప్పుడిది యొక ప్రత్యేక వర్ణముగా రూపొందును. ఉదా :-(Ger) anros —— andros ; (Fr.) tenre —— tendre ఇందు 'డ - d' చరధ్వని రూపము దాల్చినది. ఈ చరధ్వని మూఁడు విధములుగ నుండును. శబ్దము యొక్క ప్రారంభముునను, మధ్యను, చివరనుగూడ నిది కలుగవచ్చును. ఉదా :-ప్రారంభమున : స్కూలు——ఇస్కూలు ; మధ్య : స్నేహ—— సినేహ (ప్రాకృతము); చివర :- sound — sonus (Latin). ప్రతి భాషలో నీ చరధ్వని యొకటే మాదిరిగా నుండదు, వివిధ రీతులుగా నుండును. ఆ యా భాషల యుచ్చారణ రీతులను బట్టి యవి యుండును.

ద్రావిడభాషలలో నిది 'య - వ 'లతో నుండును. ఈ భాషలలో నిది మూఁడు స్థలములందు సంభవించును. (అ) రెండచ్చులమధ్యను (ఆ) అచ్చులతో ప్రారంభించు పదముల మొదట నాగినపుడును. (ఇ) పద మధ్యమున వచ్చు నవరోహణ చరధ్వనియు.

రెండచ్చులు వరుసగా వచ్చి యందొక్కటికూడ లోపింపన పుడు మధ్య లంకెధ్వనిగా 'య' కాని, 'వ' కాని జనించును. అది

అచ్చుల మధ్య చరధ్వని
**Inter-vocal glide**

(అ) ప్రాతిపదికకు ప్రత్యయమును చేర్చినపుడు.
(ఆ) క్రియకు ప్రత్యయములు గలుపఁబడినపుడు.
(ఇ) కారకమున, సముచ్చయము, ప్రశ్నార్థము, ఏవార్థకాదులు చేర్చఁబడినపుడు. (ఈ) వాక్యమున సంధి జరిగినపు డీ చరధ్వని పుట్టును.

(అ) నామప్రత్యయములలో ఉదా:- ఆమె + య్ + అందు = ఆమె యందు; తల్లి + య్ + అందు = తల్లియందు; గురు + వ్ + ఉను = గురువును; ఇందు 'య' కారము వైయాకరుణలచే గ్రహింపఁబడినది. కాని 'వ' కారము గ్రహింపఁబడక, పదములో నైక్యము చెందినదిగా నూహింపఁబడినది. ఇట్లే, పూ + వ్ + ఉ = పూవు.

(ఆ) క్రియాప్రత్యములలో ఉదా:- చేసి + య్ + ఉండెను = చేసి యుండెను; చెప్పఁబడి + య్ + ఉన్నది — చెప్పఁబడి యున్నది.

(ఇ) కారకమునకు ఉదా:- సీత + య్ + ఉ — సీతయు; బిడ్డ + య్ + ఉను! బిడ్డయును — సీతయును బిడ్డయును (సముచ్చయము); తల్లి + య్ + ఎ — తల్లియే (అవధారణ);

(ఈ) సంధిలో ఉదా:- మా + య్ + ఇల్లు — మా యిల్లు.

వాక్యములో పదముల మధ్య నాగినపుడు 'ఇ, ఈ, ఎ, ఏ' లతో ప్రారంభించు పదములముందు 'య' కారమును, 'ఉ, ఊ, ఒ, ఓ 'లతో ప్రారంభించు పదములముందు 'వ' కారమును జేర్చి పలుకుట ద్రావిడ జాతివారికి సహజమై పోయినది. ఈ విధమైన యుచ్చారణ యాంగ్లపదములకుఁగూడ నలవాటై పోయినది. ఉదా:-

ఆరోహణ చరధ్వని
**on-glide**

oration — వోరేషన్ ; only— వోన్లి ; energy — యెనర్జీ ; elbow— యెల్బో ; Englishman—యింగ్లీషుమాన్ ; అట్లే తమిళమున, ఉదా :-ఎన్న (ఏమి) — యెన్న ; ఎరుమై — (గేదె) — యెరుమై. ఒకప్పు డీయారోహణ చరధ్వని పదముతోఁ గలిసిపోయి సంధినిఁగూడ నడ్డగించును. ఉదా॥ నువ్వు యింకా ; మీరు యిక్కడి కొచ్చి ; వానికి యెందుకు ; వాడు వక పనిచేశాడు ; జ్ఞాపకము వుందా? ఏం వున్నవి. మొ॥.

'ఆంధ్ర శబ్ద చింతామణి' యకారాది పదముల నంగీకరించి యది 'లఘు య' కారమని తెలిపినది. ఉదా :- యెప్పుడు ; యెందుకు ; యేమి మొః. (చూ. సంజ్ఞా 9). 'అద్యః క్రియాసు భూతార్థద్యోతినం ఆద్యగం వినా సర్వః'-భూతకాల క్రియలలోను, పదారంభమునను తప్ప, యితర స్థలములలో 'య' కారము 'అ' కారమగును. క్రియలలో- 'పో - య్+ఎను—పోయెను. (సంధినూ-26) 'సర్వత్రాజ్యత్ కార్యం జ్ఞేయం యస్య దృతప్రకృతికేభ్యః'-దృతప్రకృతికము తర్వాత వచ్చిన 'య' కారము 'అ' కారముగా పరిగణింపవలెను. అనఁగా సంధి కొఱకు 'య' కారము నిరాదరింపనగును. కాని యిట్టిది 'వూరు, వొక్కటి' మొ॥ 'వ' కార మంగీకరింపఁబడలేదు. అది గ్రామ్యముగా నెంచఁబడినది.

3. ద్రావిడబాషలలో నిది చాల యరుదు, తెలుఁగున కొలఁది గాఁగలదు. ఉదా :-ఆ-వ్ + ఉ—ఆవు మొ॥ (cff -తమ-ఆ=గోవు)

అవరోహణ చరధ్వని
off glide

పూ-వ్ + ఉ — పూవు; గురు + వ్ + ఉ — గురువు; గోవు; విష్ణువు మొ॥ (చింతామణి నూ, అజంతప్ర, 44. "సర్వతోదో 'వు' ర్భవతి 'ము' వత్.") యకారమునకు ఉదా :- స్త్రీయు; హరియు; మొ॥. ఇది పదముతోఁగలిసిపోయి వానిలో నొక భాగముగ పరిగణింపఁ బడుచున్నది.

# మూఁడవ ప్రకరణము

## భాషాజాతుల వర్గీకరణము

ప్రపంచమున సుమారు మూఁడువేల భాషలున్నవి. అందులోఁ గొన్ని వ్యవహార భ్రష్టములై మృతభాషలని పిలువఁబడు చున్నవి. ఉదా:- గ్రీకు, లాటిన్, సంస్కృతము, ప్రాకృతము మొదలైనవి. కొన్ని నిత్యవ్యవహారము నందుండి సజీవములైనవి. ఈ ప్రపంచభాషల స్థూల పరిశీలనము వలననే యవి రెండు పద్ధతులపై విభజింప వచ్చునని తెలియుచున్నది. భాష వాక్యముల రూపమున వెలువడును గదా. వాక్యమున రెండు భాగములున్నవి. ఒకటి, శబ్దజాలము; రెండు శబ్దముల కుండు పరస్పర సంబంధమును దెల్పు విధానము. కాన భాష వ్యక్తీకరించు విధానమును బట్టి, యనఁగా, శబ్ద నిర్మాణవిధము, లేక, వ్యాకరణ రీతులలోఁ గల సాదృశ్య భేదములను బట్టి విచారించుట. రెండవది, యవి వ్యక్తీకరించు సాధన సామగ్రిని బట్టి, యనఁగా, సమాన భావములను వ్యక్తీకరించు పదముల సామ్యమును బట్టి వాని సంబంధ మును నిర్ణయించుట. భాషావిషయములో పదములను, వాక్యములను గూర్చు విధానమున భాషలకు పరస్పర మేకదేశముగఁ గాని, సంపూర్ణ ముగఁ గాని ముఖ్య విషయములలోఁ గల పోలికగాని, లేక భేదము గాని గుర్తించుట యొక మార్గము. సమాన భావములను వ్యక్తీకరించు టకుఁ గాను సమాన ధాతువులు, ప్రత్యయములు నుపయోగించు సాధన సామగ్రిలో, విశేషముగఁ గాని, కొంతవఱకుఁ గాని కల భేద సాదృశము లను గుర్తించుట రెండవ విధము.

శబ్దస్వరూప నిర్మాణ పద్ధతితోఁ జేయఁబడిన భాషావిభాగ మాంగ్లమున మార్ఫలాజికల్ (morphological) పద్ధతి యనియు, శబ్ద సామగ్రిదృష్టితోఁ జేయఁబడిన భాషావిభాగము శబ్దజాల సంబంధ పద్ధతి, లేక, జన్యజనక పద్ధతి యనియు, దీనినే యాంగ్లమున జీనియొలాజికల్ (geneological) పద్ధతియనియు నందురు. వీనిలో మొదటి దానిలో,

వాక్యమున వ్యాకరణ సంబంధమును దెలుపుటకును, ప్రత్యేకార్థమును నిర్ణయించుటకును బదములు స్వీకరించు వివిధరూపములను బట్టి భాషలు విభజింపఁబడును. రెండవది, భాషలలోఁగల సదృశమైన ధాతువుల నుండి పుట్టిన పదములనుబట్టి యవి చారిత్రకముగా నొక భాషాకుటుంబము నకుఁ జెంది, యొక భాషలోనుండి యింకొక భాష పుట్టినదని కాని, లేక, యా రెండుభాషలును మఱియొక ప్రాచీనమగు మూఁడవభాష నుండి పుట్టినవని కాని తెలుపును. ఇట్టి భాషాశాస్త్ర పరిశీలనచే రెండుభాషలు విశేష శబ్దసామగ్రియందును, శబ్దస్వరూప నిర్మాణవిధాన మందును సామ్యము గలిగియున్నచో నవి చరిత్రాత్మముగ సన్నిహిత సంబంధము గలిగియున్నవని నిర్ణయింప నగుచున్నవి. స్పష్టమైన సాదృశ్యముండుటను బట్టి యాంగ్ల, జర్మనీ, డచ్చి, డేనిష్ భాషల నొక భాషావంశశాఖ క్రిందఁజేర్పవచ్చును. అవి ప్రాచీన ట్యుటానిక్ మూల భాషాజాతి జన్యములని యూహింప నగును. మఱికొంత పరిశోధన వలన గ్రీకు, లాటిన్, సంస్కృత భాషలలోఁగల ధాతుసామగ్రి విశేష ముగ ప్రాచీన ట్యూటానిక్ భాషా ధాతుసామగ్రితో ప్రాతిపదికయందు సాదృశ్యము గలిగియున్నదని గుర్తించినపుడా వంశవృక్షశాఖ విశాలమై యా భాషలను గూడఁ దనలోఁ జేర్చికొనును. సమానమైన మూల భాషనుండి, విశేషమైన ప్రసిద్ధ శబ్దసామగ్రియు, స్వరూప నిర్మాణ విధానము గూడఁ బుట్టెనని తెలుపు నెన్ని భాషలనైనను భాషావంశ వృక్షము స్వీకరించును.

## I

## శబ్ద స్వరూప నిర్మాణ సంబంధ భాషాజాతి విభాగము, లేక, వ్యాకరణ సామ్యకృత భాషాజాతి విభాగము.

**(Morphological classification)**

ప్రపంచములోని భాషలన్నింటిని సుస్పష్టమైన ప్రత్యేకవిధమగు శబ్దస్వరూప నిర్మాణసంబంధ జాతి విభాగములుగా విభజించుట సాధ్యమైన పనికాదు. (1) అనేక భాషాకుటుంబములను జూచినపు

డవి యన్నియు సమానమైన ప్రాథమిక స్థితిలోనుండి నిర్మింపఁబడి, కాల క్రమమున పరిణామ మొంది విశేషభేదము పొందినట్లుగా గోచరించును. కాని మఱికొంత పరిణామము తర్వాత ననేక భేదమార్గములు పట్టి, తిరిగి యవి పరస్పరము సమీపమునకుఁ జేరు చుండునట్లు గనుపించును. ఉదా :- ఆంగ్లో-సాక్సను భాష శబ్దస్వరూప నిర్మాణ విధానమున చైనా భాషతో బహుదూరముగా నుండియు, నవీనాంగ్ల భాష ప్రత్యయములతోఁ గంటె, వాక్యమున శబ్దములకుఁగల స్థానమును బట్టియు, ప్రత్యేక పదములను బట్టియు నాశబ్దముల వ్యాకరణాత్మక సంబంధమును దెలుపు నట్టి విధమున నవీనచైనాభాషను సమీపించుచున్నది. (2) లేదా అన్ని భాషలును మొదట నొకటే విధమైన శబ్దస్వరూప నిర్మాణ పద్ధతిలో ప్రారంభించి, యొకటే మార్గమున నభివృద్ధి చెందుచుండినను, గొన్ని యతి త్వరితముగను, మఱికొన్ని మందముగను సాగిపోయి పరి ణామ మొందు చుండవచ్చును. ఉదా :- ఆంగ్ల భాష తన తోడి భాష యగు జర్మనీభాషకంటె నతి త్వరితముగ పరిణామ మొందినది. (3) లేదా, భాషలు వివిధ మార్గముల పరిణమించుచు క్రమముగఁ గొన్ని మాత్రము పరస్పరము సమీపించుటయు, మఱికొన్ని దూరము ననే యుండుటయు సంభవింప వచ్చును. సత్యమేదైనను నీ యభిప్రాయ ములలో నేదో నొకదానిని పురస్కరించుకొని భాషాపరిశీలనమునకుఁ బూనుకొనరాదు. భాషాశాస్త్రజ్ఞుఁడు భాషావిషయములను వ్యాక రించి సాక్ష్యప్రమాణమున పై వానిలో నేది సంభావ్యమో దాని నంగీ కరించుట యోగ్యము. పై మూఁడు మార్గములలో రెండవది సుసం భావ్యమని భాషాశాస్త్రజ్ఞు లేకగ్రీవముగా కాకపోయినను, స్థూలముగా నైన నంగీకరించిరి. ఇందు యథార్థవిషయములకంటె, పరిణామము ననుసరించి యవి యే యే దశలఁబొందినవో గుర్తింపవలసిన బాధ్యత యున్నది.

చాలవరకు భాషలన్నియు శబ్దస్వరూప నిర్మాణ పద్ధతి నను సరించి మూఁడు విధములుగ విభజింపఁబడి, యవి యారోహణక్రమ ములో నభివృద్ధి చెందినవని సాధారణముగ విశ్వసింపఁబడుచున్నవి. అవి

(1) ధాతురూప పదభాషలు, లేక, ప్రత్యయరహిత భాషలు. (Monosyllabic or Isolating or Radical or Inorganic languages) ఉదా:- చైనా దేశభాష. (2) సంయుక్త ధాతురూప పద భాషలు, లేక స్పష్టప్రత్యయాంత భాషలు (Agglutinative languages). ఉదా:-టర్కీ-జపాను దేశభాషలు, ద్రావిడ భాషలును. (3) ప్రత్యయ సంకీర్ణ భాషలు (Inflectional or Organic or Amalgamating languages) ఉదా:- సెమిటిక్, ఇండోయూరోపియన్ భాషలు. ఈ త్రివిధ భాషాజాతి విభాగ మనేక భాషాశాస్త్రజ్ఞులచే సంపూర్ణమైనదిగను, సంతృప్తికరమైనదిగ నామోదింపఁబడినది. అట్టి వారిలో ననేకులు మూఁడవజాతి వగు ప్రత్యయసంకీర్ణభాష లొకప్పుడు రెండవజాతివగు సంయుక్త ధాతురూప పద భాషాస్థితిలో నుండియుండెడి వనియు, నవియు, తత్పూర్వము మొదటిజాతివగు ధాతురూప పద భాషా పరిస్థితిలో నుండి యుండవలె ననియు నంగీకరించిరి. అనఁగా, సంకర్ణ ప్రత్యయాంత శబ్దములు (Inflected words) తత్పూర్వము ధాతువు స్పష్ట గోచర మగుచు, ప్రత్యయములు ప్రత్యేకము రూపముతోడను, ప్రయోజనము తోడను వివరముగఁ గలుపఁబడి నట్లుండు సంయుక్త ధాతు రూప పదస్థితి (Agglutination) యందుండెడివనియు, మఱియు నా స్థితికిఁ బూర్వము ప్రత్యయములుగాఁ గలుపఁ బడిన వర్ణకములు గూడ ప్రత్యేక పదము లుగా నుండి, ప్రత్యయ రహితములుగా నుండెడివనియు నామోదింపఁ బడినవి. ఉదా:- ప్రస్తుత తెలుఁగు భాషా పరిణామము. వచ్చాఁడు - వచ్చినాఁడు-వచ్చినవాఁడు ; వ్రాస్తున్నాఁడు-వ్రాస్తున్న వాఁడు-వ్రాయు చున్నవాఁడు. మొ॥. కాని బహు స్వల్ప సంఖ్యాకులైన భాషా శాస్త్రజ్ఞులు మాత్ర మీ వాదమునకుఁ దగిన నిదర్శనము లేదనియు, విశేషించి దానికి వ్యతిరేకముగనే, యనఁగా సంకీర్ణ ప్రత్యయాంతత్వము నుండియే క్రమముగా ప్రత్యయ రహిత పద్ధతి పరిణమించెనని వాదింతురు. ఉదా:-ఇండో యూరోపియను భాషా కుటుంబలోని ప్రాచీన భాషలగు గ్రీకు, లాటిన్, భాషలు సంకీర్ణ ప్రత్యయాంత (Inflectional) భాషలైనను, నవీన యూరోపియను భాషయగు నాంగ్ల భాష ప్రత్యయరహిత భాషగా పరిణమించినది. ఈ వాదము చిట్ట

చివరకుఁ బరిశీలింపఁ దగినది. ఈ లోపుగ కొన్ని యుదాహరణముల పరిశీలనమువలన ప్రపంచమందలి భాషల నన్నిటిని నీ త్రివిధ భాషా వర్గములలోఁ గూడ విభజించుటలోఁ గల కష్టము స్పష్టమగును.

'సుప్తిఙంతం పదం' అని పదము నిర్వచింపఁ బడినది. అనఁగా, 'సుప్' లను నామవాచక ప్రత్యయములు గాని, లేక, 'తిఙ్'లను క్రియా ప్రత్యయములుగాని ధాతువునకుఁ జేర్పఁబడినపుడే పదమగు నని భావము. కేవలము ధాతువు శబ్దముగాఁ జాలదు. అది వాక్యములో స్వతంత్రముగా వాడఁబడదు. ఇతర జాతి భాషలలో స్వతంత్ర పదములుగా వాడఁబడని కేవల ధాతువు లీ జాతిభాషలలో స్వతంత్రపదములుగా వాడఁబడును. ఈ జాతి భాషలందు ధాతువులకు లింగ, వచన, కాలాది భేదములను దెలుపుటకై ప్రత్యయములు గాని యుపసర్గలు గాని చేర్పఁబడవు. ఇందుచే వీనిలోని పదములు మార్పు చెందుట కాని, లేక, యితర పదములతోఁ గూడుట కాని జరుగదు. శబ్దముల కుండు పరస్పర సంబంధము ప్రత్యేక పదములచేఁ గాని, లేక, వాక్యమందా పదములకుఁ గల స్థానమును బట్టి కాని తెలియనగును. మార్పు లేని పదములకూర్పవలననే వాక్యరచన యీ భాషలలోఁగావింపఁ బడును. వీనిలో శబ్దనిర్మాణము పరిపూర్ణదశకు రాలేదు. వాక్యము నందు పదములు కర్త, క్రియ, కర్మక్రమమునఁగూర్పఁబడును. వాక్యములో పదముల స్థానము మారిన యెడల యర్థము గూడ మారును. ప్రత్యయరహిత దశలో సుమారు పదములన్నియు నేకస్వర (Monosyllable) మాత్రములై, లింగ, కాల, వచన విభక్తులవలన భేదము చెందక యుండును. 'మామిడి పండు' అను కర్మధారయ సమాసమందలి పదముల స్థానమును మార్చినచో 'పండుమామిడి' యని యర్థమునఁ గూడ మారిపోవును. ప్రత్యయరహిత భాషలలో పదములు వివిధ స్థానభేదములతో సంధింపఁబడును. తత్ఫలితముగా సమాసమందలి పదములను విడఁదీసి ప్రత్యేకముగ వాడవచ్చును. ఉదా :- వొ=నేను,

1. ధాతురూప పద భాషలు లేక ప్రత్యయ రహిత భాషలు Isolating or radical or positional languages.

వో - చె=మేము, 'వో' కు 'చె' కలుపుటచే నిది యేర్పడినది. దానికి 'జాతి - సమూహము' అని యర్థము. మఱియు నీజాతి భాషలలో నొకటే శబ్దముచ్చరింపఁబడిన యుచ్చ, నీచ, లేక, యుదాత్తానుదాత్తోచ్చారణ భేదముచే (నొకే భావమునకుఁ జెందినను) భిన్నభాషాభాగముగఁగూడ నగును. ప్రత్యయరహిత భాషలలో ముఖ్యమైనది చైనా భాష ; అన్నాము, సియాము, బర్మా, టిబెట్టు మొదలైన దేశభాషలీజాతికిఁ జెందినవి. చైనాభాషలో 'నే నతనిఁగొట్టితి' ననుటకు 'న్గోటాని' యని యందురు. 'అతఁడు నను గొట్టె' ననుటకు నిటాన్గో' యని యనవలయును. ఇంతే కాని శబ్దములకుఁ బ్రత్యయములు చేర్చు పద్ధతియే యందు లేదు. చైనాభాషలో 'పౌ' యనఁగా 'రక్షణ' యని యర్థము. దీనిని క్రియగా కాని, నామవాచకముగా కాని, క్రియాజన్య విశేషణముగఁ గాని, భూత భవిష్య ద్వర్తమాన కాలార్థకములందుఁ గాని వాడినపుడిది, రక్షించు, రక్షణ, రక్షించుచున్న, రక్షింపఁబడి, రక్షించెను, రక్షకుఁడు మొదలైనవానివలె నెట్టి మార్పులను బొందదు. ఈ భాషలలోఁగల విశేషమిది. అర్థభేదములు ప్రత్యేక పదములచే వ్యక్తీకరింపఁబడును.

పై విధ జాతిభాషల కంటె భిన్నముగా నీజాతిభాషలలో వాక్యమందలి శబ్దములకుఁ గల పరస్పర సంబంధము ధాతువునకుఁ జేర్పఁబడు ప్రత్యయోపసర్గల మూలమునఁ దెలుపఁబడును. (1) వీనిలో ధాతువును ప్రత్యయమును గలిసిపోక దేనికది స్పష్టముగ గోచరించుచుండును. (2) మఱియు నవి యేవిధమైన మార్పును పొందవు, కాన వానిని తేలికగ వేర్పఱుపవచ్చును. (3) ఈ జాతిభాషల ముఖ్యలక్షణ మేమనఁగా, కాల, లింగ, వచన, విభక్త్యాది ప్రత్యయములు ధాతువునకు లంకెగా తగిలింపఁబడి, గొలుసువలెఁ గలుపఁబడును. (4) ఇతర సంయుత వర్ణకము లేమైనను గొంతమార్పు చెందినను, ధాతు వెప్పుడు నెంతమాత్రము మార్పుగాని, వికారముగాని పొందక యథాస్థితియందే యుండును. కాన ప్రాతిపదికయు, ప్రత్యయోపసర్గాదులును వైయా

2. సంయుక్త ధాతురూప పద భాషలు
Agglutinative languages

కరణులచే నెట్టి క్రమయు లేకుండగనే ప్రత్యేకింపఁబడగలవు. ఇందుచే నీ భాషలు సంయుక్త ధాతురూప పద భాషలని వ్యవహరింపఁబడినవి. అనఁగా మూలధాతువునకు నూతన వర్ణక ప్రత్యయములు సంయుక్తము లగును, లేక, కలుపఁబడును. ఈ జాతిలో ఇండోయూరోపియన్ భాషలును, సిధియన్ భాషాసమూహమును జేరును శబ్దజాలమునను, వ్యాకరణవిషయములందు నీ భాషలు పరస్పరము బహుభేదము గలిగి యున్నవి. కాని వాక్యమందలి శబ్దముల పరస్పరసంబంధమును దెలుపుటకుఁగాను సహాయపదములు గూర్పఁబడు విధానమున మాత్రే మీ భాషలలో సామ్యమున్నట్లు గనుపించుచున్నది. ఇందుచేతనే యివి యొక వర్గములోఁ జేర్పఁబడినవి. మూల నిర్మాణవిధమున వీనిలో సామ్యముండి, పరిణామములో భేదముగలిగి యుండును. అల్పసంయత స్వభావముగల సిధియాభాషా సమూహమున నీ సంయుతి ధర్మము యథావిధిగా నిలిచియున్నది. ప్రతి సమాసమందలి వివిధప్రత్యయములుగూడఁ దన మూలస్థానమును నిలుపుకొనుటయేః కాక, తన ప్రత్యేక వ్యక్తిత్వమునుగూడ నిలబెట్టుకొనినది. ఈ ప్రత్యేక లక్షణమున ద్రావిడ భాషలు ఇండోయూపియన్ భాషలకంటె, సిధియన్ భాషలతోడనే యెక్కువ సామరస్యము నెఱపుచున్నవి. కనుక నా ద్రావిడభాషా కుటుంబమందలి ప్రతిభాషకు నొకే క్రియా విభక్తిప్రత్యయములున్నవి. ఈ జాతిభాషలలో సంయుతత్వము మూఁడు విధములుగా నుండును. (అ) ప్రత్యయరూపమున (Suffixes) (ఇ) ఉపసర్గలరూపమున (prefixes). (ఈ) ప్రత్యయోపసర్గల రెంటి రూపములనే కాక, యాపని పద మధ్యస్థవర్ణకము (inflxes) లచే గూడ జరుగును. ఇందుచే నివి మూఁడు విధములుగ నైనవి.

(అ) హంగరీ, టర్కీ, ఫిన్నిషియా, జపాను దేశభాషలును ద్రావిడబాషలును నామవాచకమునకు విభక్త్యాది ప్రత్యయములును, క్రియలకు కాలద్యోతకాది ప్రత్యయములును శబ్దనిర్మాణపద్ధతి నాదర్శ

ప్రాయమైన పద సంయుతరూపమునఁ గూర్పఁబడును. ఉదా:- తెలుఁగు

ప్రత్యయ సంయుత విధ భాషలు
**Suffix agglutinating type of languages**

టర్కీ భాషలనుండి క్రియకు; టర్కీభాష నుండి, క్రియకు - 'సేవ్ మెక్' ప్రేమించు; సేవ్ ఇన్ మెక్ =(తను) ప్రేమించుకొను; సేవ్ ఇష్ మెక్ =పరస్పరము ప్రేమించు; సేవ్ డిర్ మెక్ =ప్రేమింపఁజేయు; సేవ్ ఇన్ మెక్ =ప్రేమింపఁబడు; సేవ్ మి మెక్ = ప్రేమింపక; సేవ్ ఇన్ డిర్ ఇల్ మి (తను) ప్రేమించుకొన నీయక." మొ.

ఇక్లే నామవాచకమునకు విభక్తిప్రత్యయములు చేర్పఁబడుట కూడ నగును.

టర్కీభాష :—

| | ఏకవచనము | | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమ | ఇవ్ (=ఇల్లు) | ... | ఇవ్ లెర్ (ఇళ్లర్) |
| ద్వితీ | ఇవ్ ఇ (ఇవి) | | ఇవ్ లెర్ ఇ (ఇవ్లెరి) |
| చతుర్థి | ఇవ్ ఎ (ఇవె) | | ఇవ్ లెర్ ఎ (ఇవ్లెరె) |
| పంచమి | ఇవ్ డెన్ (ఇవ్డెన్)... | | ఇవ్ లెర్ డెన్ (ఇవ్లెర్డెన్) |
| షష్ఠి | ఇవ్ ఇన్ (ఇవిన్)... | | ఇవ్ లెర్ ఇన్ (ఇవ్లెరిన్) |
| | ఇవ్ డె (ఇవ్డె) | ... | ఇవ్ లెర్ డె (ఇవ్లెర్డె) |

తెలుగుభాష

| | | |
|---|---|---|
| రాముడు | | రాములు |
| రాముని | ... | రాములను |
| రామునిచే, తో, | ... | రాములచే, తో |
| రామునికొఱకు | ... | రాములకొఱకు |
| రామునివలన | .. | రాములవలన |
| రామునియొక్క | .. | రాములయొక్క |
| రామునియందు | .. | రాములయందు |

ఇక్కడ సర్వత్రా ధాతువు లెక్కడను మార్పు చెందకయే యున్నవి. ందలి వ్యాకరణ రూపములు, లేక యర్థవిశేషములు, ప్రత్యయములు చేర్పఁబడుటచేఁగలిగి, ప్రత్యేక ప్రయోజనము కొఱకైన వర్ణకములు

గుర్తింపఁబడి, తేలికగ మనస్సులో ప్రత్యేకింపఁదగి యున్నవి. పై నామవాచకమునకు విభక్తిప్రత్యయములు గలుపఁబడిన విధానములో నొకటే విభక్తిప్రత్యయ మేకవచనమందును బహువచనమందును గూడఁ గలుపఁబడుట స్పష్టముగ నున్నది. మఱియు బహువచనమున విభక్తి ప్రత్యయములకు ముందుగా బహువచన ద్యోతకవర్ణకము చేర్పఁబడినది. ఈ రూపములన్నిటి యందును ముఖ్యవిషయమగు ధాతు వెంతమాత్రము మార్పు చెందకయున్నది. అది యెట్టి వికారమును గూడ పొందలేదు. ఈ ప్రత్యయములన్నియు ధాతువునకుఁ జివరఁజేర్పఁబడి, వాని స్థానమునఁ గుదిరిపోయినవి. ఇవి యన్నియు నొకటి రెండక్షరముల చొప్పున నుండి, యొకదాని కింకొకటి గొలుసులంకెవలెఁగలిసియుండి సంబంధమును బోధించుచున్నవి. ఇఁక శబ్దనిర్మాణ పద్ధతి కూడ నిశ్లేష్ఠ యుండును. ఉదా:- (టర్కీ-భాషనుండి) ఇవ్ ఇమ్—నా యిల్లు; ఇవ్ ఇమ్ డెన్=నా యింటినుండి; ఇవ్ లెర్ ఇమ్ డెన్=నా యిండ్లనుండి; మొ.

కాని యీ వర్గమునకుం జెందిన భాషలన్నియు నేకభాషా కుటుంబమునకుఁ జెందినవని మాత్రము తలంచుటకు వీలులేదు. అవి భాషానిర్మాణ సాధారణధర్మములలో మాత్రమే సామ్యము గలిగి యున్నవి. అంతే. విశేష ధర్మములలో ననఁగా, శబ్దజాలము మొ॥ వానిలో నవి భేదించుచున్నవి, కాన భిన్న భాషా కుటుంబములకుఁ జేరును. చరిత్ర కందని బహుప్రాచీన కాలమునఁగూడ నవి యేకకుటుంబమునకుఁ జెందఁదగిన సామాన్యసంబంధము వానిలో గుర్తింపఁబడలేదు.

ద్రావిడ భాషలు

ద్రావిడభాషలు ముఖ్యముగా నీ జాతికిఁ జెందినవి. అందు ధాతువు లేక, ప్రాతిపదిక యెప్పుడును మారదు. ఉదాహరణమున నొక తెలుఁగు క్రియను వ్యాకరించి చూచినచో స్పష్టమగును. 'తినుచున్నాఁడు' అను దానిని వ్యాకరించినచో 'తిను + చు + ఉన్ + అ + (వా) డు.' ఇందు 'తిను' అనునది ధాతువు; 'చు' వర్తమానార్థక చువర్ణకము: 'ఉన్' వర్తమానార్థక క్రియాప్రత్యయము; 'అ' సంబంధార్థక ప్రత్యయము. 'డు'

వాడు లోని యవశిష్టరూపము, పురుషబోధకము. ఇందు ధాతువు మార్పుచెందక, సంబంధ బోధకములగు ప్రత్యయములలో మాత్రము గొంచెము మార్పు చెందినది.

ఈ భాషలలో నుపసర్గలను వాడుట కొంతవఱకు తెలియక పోలేదు. తమిళభాషలో, 'అదు=అది-ఆవస్తువు; ఇదు=ఇది; ఎదు=ఏది. మొ॥. గ్రీకు సంస్కృత భాషలలో నుపసర్గలను సలక్షణముగా వాడుట యిండోయూరోపియన్ భాషల ప్రత్యయాంత పద్ధతి. కాని ద్రావిడభాషలలో నుపసర్గలను వాడుట ప్రత్యేకమైన విశిష్టపద్ధతి కాదు. ద్రావిడభాషలలోని వ్యాకరణవిధానము లేక, వాక్యరచనా పద్ధతి ఊరల్-ఆల్టైక్ కుటుంబమునకుఁ జెందినది. అనఁగా, అర్థసంబంధముల కూర్పును మార్పును సిద్ధముగాఁ గలుపుటకును, దీసివేయుటకును వీలైన ప్రత్యయముల మూలమున జరుగును. అట్టి రూపములు 'తుళు' భాషనుండి సాధారణముగ నుదాహరింపఁబడును. 'మల్‌పువె' నేను చేయుదును; మల్‌పావె=నేను చేయించుదును; మల్‌పేవె=నేను మాటి మాటికిఁ జేయుదును. వీనిలో నర్థమును మార్చుటకు చేయు ప్రత్యయముల రూపములు ధాతువునకుఁ గలుపుటకును, దీసివేయుటకును గూడ వీలుగ నుండును. మఱియు వీనిలో నర్థముల మార్పు ధాతువులోపలి యచ్చును మార్చుట వలనఁగూడఁ గలుగుచున్నది. దీని నాంగ్ల భాషలో 'అబ్లాట్' (ablout) అందురు. cff :—ring, rang, rung etc. ఈ రీతి తెలుఁగుననఁగూడఁ గొంతవఱకు కలదు. ఉదా :- తిను - తిని - తినె - తిన, మొ॥. సెమిటిక్ భాషలలో నర్థభేదమునకుఁగాను ధాతువు నందలి యచ్చును మార్చు పద్ధతికిని దీనికిని భేదముండిన నుండవచ్చును. యథార్థమున కది యసంభావ్యము. 'పువ్, పావ్, పేవ్' మొ॥. కేవలము వర్ణకములు గాక, కూడికవలనఁ గలిగియున్నవి. ప్రస్తుతము మన మిక్కడ ప్రత్యయములను వాడు విధము మాత్రమే గమనింపఁ దగినది. ఇది 'ఉరల్ - ఆల్టైక్' విధానమునకు సన్నిహిత సాదృశ్యము గలిగి యున్నది. 'మల్‌పావె :- ప్రేరణార్థకము; మల్‌పావుజి :- వ్యతిరేకార్థకము; మల్‌పువెడ :- చేద్యర్థకము.'

ఆదర్శప్రాయమైన సంయుక్త ధాతుకూ పద భాషలలో నామమునకు విభక్తిప్రత్యయము లేకవచనమున నామమునకు వెంటనే కలుపఁబడును; బహువచనమున నామమునకు బహువచన ప్రత్యయము కలిపిన మీఁదట విభక్తిప్రత్యయములు చేర్చఁబడును. ఉదా:-తమిళమున ఫలన్=బహుమానము అను పద మీవిధముగ నుండును.

| | | ఏకవచనము | | బహువచనము |
|---|---|---|---|---|
| ప్ర | ... | పలన్ | ... | పలన్‌గల్ |
| సం(ప) | ... | పలనే(ఏ) | .. | పలన్‌గళే (ఏ) |
| ద్వి | ... | పలనై (ఐ) | ... | పలన్‌గళై (ఐ) |
| ష | ... | పలనుడైయ (ఉడైయ). | | పలన్ గలుడైయ (ఉడైయ) |

సంయుతత్వమునకును (agglutination), ప్రత్యయ సంకీర్ణత్వమునకును (inflection) గలభేదమును సేవక శబ్దమునకుఁగన్నడ సంస్కృత భాషలలో విభక్తిప్రత్యయములను గలుపు విధానమును పరిశీలించిన స్పష్టమగును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సంస్కృతమున | ... | తృ | ... | చ | .. | సప్త |
| బహువచనమున | ... | సేవకైః | ... | సేవకాభ్యాం | .. | సేవకేషు |

ఇందు బహువచనప్రత్యయము ప్రత్యేకముగ లేదు. కాని, వచన విభక్తులు రెండును గలిసి ప్రత్యయములుగా పరిణమించినవి. కాని,

కన్నడమున ... సేవక-ర్-ఇంద ... సేవక-ర్-(ఇ)గె .. సేవక-ర్-(అ)ల్లి

ఇక్కడ బహువచన ప్రత్యయమగు 'ర్' స్పష్టముగను, స్వతంత్రముగను విభక్తి ప్రత్యయమునకు ప్రత్యేకముగ నున్నది.

దక్షిణాఫ్రికా దేశములో మాట్లాడఁబడు 'బంటు' భాషా కుటుంబములోని 'జులు, కాఫర్'భాషలలో వాక్యములోని పదములు ప్రత్యేకముగానుండి, శబ్దముల పరస్పర సంబంధమును, వాని యర్థభేదమును విశేషముగ నుపసర్గల మూలమున ప్రతిపాదింపఁబడును. ఉదా:- జులుభాషలో:-'న్గ-ఉము-న్తు'=మనిషితో; 'న్గ-అబ-న్తు'=మను

ష్యులతో అని అర్థము. ఇందు 'న్గ'=తో; 'అము' ఏకవచనమును, 'అబ' - బహువచనమును ద్యోతకముచేయు నుపసర్గలు. ఈ విధముగ క్రియలకు కాలభేదాదులుగూడ నుపసర్గలచే వ్యక్తీకరింపఁబడును. ఈ భాషలలో విశిష్టలక్షణ మేమనఁగా, పదముల

**ఉపసర్గ సంయుత విధ భాషలు**
**Preffx-agglutinatıng type of langunges**

సంబంధమును, నర్థభేదములును ద్రావిడాది పై విధభాషలలో ప్రత్యయముల మూలమున ప్రతిపాదింపఁబడఁగ, నిందు ఉపసర్గల మూలమునఁ జేయఁబడును. ఇట్లని, ప్రత్యయములను గలుపు విధాన మీా భాషలలో నసలు లేనేలేదని చెప్పుటకు మాత్రము వీలు లేదు. ఉదా :- క్రియలలో కాలభేదాదులను దెలుపుటకు ప్రత్యయములు గలుపఁబడును. 'కాఫరు' భాషలో :- 'తంద=ప్రేమ; తందిస=ప్రేమించు; తందన; పరస్పరము ప్రేమించుకొను; తందిసన =పరస్పరము ప్రేమించుకొనుటమాను; తందెక= ప్రేమింపఁబడి.' కాన నీ విధానమునకును ద్రావిడభాషా పద్ధతికిని భేద మున్నట్లు గనుపించదు. కాని బంటుభాషలలో నుపసర్గవిధానము సక్రమముగను, విశిష్టముగ నున్నది. ద్రావిడాది ప్రత్యయసంయుత విధభాషలలో షష్ఠీవిభక్తికి ప్రత్యేకప్రత్యయము గలుపఁబడఁగ, బంటు భాషలలో నొక యుపసర్గవర్ణక ముపయోగింపఁబడును. ఉదా :- (కాఫర్ భాష) కుతి=మాకు; కుని=వారికి; కుజి=వానికి మొ॥

బంటుభాషలలో నేకవచనముగూడ నొక యుపసర్గచే ప్రతిపాదింపఁబడును. కాఫర్ భాషలో 'ఉమ్, ఉ, ఇలి, ఇన్, ఇసి ఉలు' అను వానిలో నేదో యొకటి యేకవచనమున నుపసర్గగా వాడఁబడును. వీనికి బహువచనోపసర్గలు 'అబ, అమ, ఇమి'లు — 'ఉమ్' కును; 'ఉ'కు — 'ఒ'ను; 'ఇలి'కి — 'ఇ', 'అమ'లును; 'ఇన్'కు — 'ఇజ'ను; 'ఇసి'కి — 'ఇజి'ను మొ॥. కాన, 'ఉమ్నుట'=మనిషి; అబన్టు=మనుష్యులు; ఉబవొ=తండ్రి; ఒబవొ=తండ్రులు; ఇలిజ్వ=. మాట; అమజ్వ=మాటలు;

| ఏకవచనోపసర్గలు | ... | బహువచనోపసర్గలు |
|---|---|---|
| ఉమ్, | ... | అబ, అమ, ఇమి |
| ఉ | ... | ఒ |
| ఇలి | ... | ఇ, అమ, |
| ఇన్ | ... | ఇజిన్ |
| ఇసి | ... | ఇజి |
| ఏకవచనము | ... | బహువచనము |
| ఉమ్న్టు (మనిషి) | ... | అబన్టు (మనుష్యులు) |
| ఉబవొ (తండ్రి) | ... | ఒబవొ (తండ్రులు) |
| ఇలిజ్వి (మాట) | ... | అమజ్వి (మాటలు) |

మలయాపెనెన్సులాలో జనులు మాట్లాడు మలయో-పాలినీషియన్ భాషాకుటుంబమునందు సంయుక్తధాతురూప పద విధానము 'బంటు, ద్రావిడ' భాషలకంటె భిన్నమై, మూఁడు విధములుగ సంయుతత్త్వము గలిగియుండును. ఇందు ప్రత్యయములు, నుపసర్గలు, పదమధ్య వర్ణకములు (infixes), నామ్రేడితములు నుపయుక్తము లగును. ఈ మలయా-పాలినీషియన్ భాషాకుటుంబములో (అ) పాలినీషియన్ (ఆ) మెలనేషియన్ (ఇ) మలయన్ అను మూఁడు శాఖలు గలవు. ఈ మూఁడుశాఖలలో నుపసర్గలును, ప్రత్యయములును భిన్నప్రమాణములతో వాడఁబడును. ఆమ్రేడిత మీ భాషాకుటుంబములో మాత్రమే యుపయోగింపఁబడును, ఉదా:-పాలినీషియన్ శాఖలోని 'హవైయన్' భాషలో, 'హులి'=వెదకుట; 'హులిహులి=బాగుగ వెదకుట' యని యర్థము. అట్లే 'మఒరీ,భాషలో 'హైరె'=పో; హైరేహైరే=ఇక్కడ నుండి యక్కడకు నడచుట' యని యర్థము. మెలనేషియన్ శాఖలోని 'ఫిజ్జన్' భాషలో 'తల'=పంపుట - తలతల=కబురు, వార్త యని యర్థము. మలయన్ శాఖలోని 'మలయ' భాషలో 'రాజ'=రాజు; రాజరాజ=రాజులు. 'దయక్' భాషలో 'పుకుల్=కొట్టు - హాపుకుల్ పుకుల్=విశేషముగ కొట్టు' అని యర్థము.

మలయన్ శాఖలో, మిగిలిన వానివలె, నామవాచకములకు బహువచనములు గాని, విభక్తి ప్రత్యయములుగాని లేవు. ఇవి యవ్య

యములచే కాని, పదముల స్థానమును బట్టికాని నిర్ణయింపఁబడును. అట్టి యవ్యయము నామవాచకములకు మొదట కలిపి వ్రాయఁబడును.

పదమధ్య సంయుతవర్ణక విధభాషలు
**Infix agglutinating type of languages**

ఉదా :- 'దిరుమహా'=ఇంటిలో. కర్మణ్యర్థకములు క్రియకు ప్రత్యయములచేఁ గాని, యుపసర్గలచే కాని, లేక, పదమధ్యవర్ణకములచేఁ (infixes) గాని ప్రతిపాదింపఁబడును. నామాత్మకోపసర్గలు గాని, ప్రత్యయములు కాని యనేకము గలవు. ఈ శాఖలో విశిష్టమైనవి పదమధ్యగత వర్ణకములు (Infixes). ఇవి నామాత్మకములే కాక, క్రియల కాలమును, కర్మణ్యర్థక కర్త్రర్థకాదులను ప్రత్యేకముగ తెలుపుటకుఁగూడ నుపయోగపడును. ఉదా :- 'తగాల' భాషనుండి. 'సులత్'=వ్రాయుచు; సుములత్ (స్+ఉమ్+ఉలత్)=వ్రాయు; నున్గములత్ (స్+ఉన్గమ్+ఉలత్)-న్గ=న-(సిద్ధముగా) భూతకర్త్రర్థకము. 'సినుల తన్' (స్+ఇన్+ఉలత్+అన్) భూతకర్మర్థకమగును. బట్టక్ భాషలో :- నస=కడుగు-సినస (స్+ఇన్+అస)=కడుగఁబడు; పార్మోసాభాషలో :- నసి=ఉప్పు; సుమసి (స్+ఉమ్+అసి)=ఉప్పుగ చేయు (క్రియ); ఈ విచిత్ర విధానము 'సేమిటిక్' భాషలతోఁ బోల్పఁదగినది.

ఈ జాతిభాషలలో వాక్యమందలి శబ్దములకుఁగల పరస్పర సంబంధము సంయుక్తధాతురూప పద భాషలందువలె ధాతువునకుఁ జేర్పఁబడు ప్రత్యయోపసర్గల మూలముననే తెలుఁపబడును. కాని

3. ప్రత్యయ సంకీర్ణ భాషలు
**Amalgamating or Inflexional or Organic languages**

(1) యీ భాషలందు ప్రత్యయోపసర్గలు పరస్పరము గలిసిపోయి యైక్యమైపోవుటయే కాక, యవి ధాతువుతోఁగూడఁ గలిసిపోయి, విడదీయుటకు వీలులేనంత గాఢముగ మిళితమైపోయి, శబ్దములో నేభాగ మెంతవఱకు ధాతువో, యెంతవఱకు ప్రత్యయమో గుర్తించుటకు మాట్లాడు వారికిఁ గాని, భాషాశాస్త్రజ్ఞునకుఁ

గాని తెలియరాక క్లేశము గలిగించును. (2) మఱియు ప్రధానమైన ధాతువే స్వరమునందును, స్వరూపమునందును గూడఁ బూర్తిగా మారిపోయి, వివిధ శబ్దములలో నుండు నేకధాతువే గుర్తింపఁబడఁ జాలకుండును. (3) ఈ భాషలలోని ప్రత్యయములకు భాషలలో స్వతంత్ర స్థానము లేక పోవుటయే కాక, యవి సక్రమముగను, సుస్పష్టముగ నొక ప్రత్యేక ప్రయోజనము గలిగియున్నవనికూడ నంగీకరింపఁబడవు. (4) మఱియు నీ జాతిభాషలలో, సంయుత ధాతురూప పదభాషలలో వలె, నేకవచన బహువచనములకు రెంటికి నొకటే విధమైన ప్రత్యయములు గాక, వేరు వేరు ప్రత్యయములు వాడఁబడును. ఇండో యూరోపియన్ భాషాకుటుంబమునకుఁ జెందిన గ్రీకు, లాటిన్, సంస్కృతాది భాషలన్నియు నీప్రత్యయ సంకీర్ణ భాషావర్గమునకుఁ జేరినవి. ఎట్లైనను, వాక్యములో పదముల పరస్పరసంబంధమును దెలుపుటకును, నర్థభేదమును వ్యక్తీకరించుటకు నీ ప్రత్యయము లుపయోగింపఁబడునను విషయమున నీ జాతిభాషలు వెనుకటి సంయుక్తధాతురూప పద భాషాజాతితోఁ బోలిక గలియే యున్నవనుటకు సందేహము లేదు. కాని సంయుతధాతురూప పదభాషా జాతికిఁ జెందిన 'ఉరల్-ఆల్టైయిక్' భాషాశాఖలో శబ్దనిర్మాణ పద్ధతి సుస్పష్టముగను, సక్రమముగ ద్యోతకమగుచుండ, నిండోయూరోపియన్ భాషాశాఖలో నా లక్షణములు లోపించును. అదియే నీ రెంటికిఁ గల ముఖ్యభేదము. ఈ రెండుజాతుల భాషలలోఁగూడ నా యా పురుషవిభక్తుల ప్రత్యయముల యథార్థమైన మూలార్థము భిన్నమైనను గాక పోయినను ఫలితమున వాని ప్రయోజనము సమానమే. ఈ కారణముచే 'సంయుక్త ధాతురూప పద' జాతిని 'ప్రత్యయాంత' జాతికి భిన్నముగా నామకరణము చేయుట యశాస్త్రీయమగును. ఏలన, సంయుత ధాతురూప పదత్వము ప్రత్యయాంతముగూడ నగును. సుస్పష్ట ప్రత్యయత్వమును సంశ్లిష్టప్రత్యయాంతత్వమునుండి ప్రత్యేకపఱచు మఱియొక పదమును ప్రయోగింపవలసినచో, రెండవదానిని 'సంకీర్ణప్రత్యయ భాష' లని వాడుట సమంజసముగ నుండును. 'ప్రత్యయాంతభాష 'యను నామమును సంయుత

ధాతురూప పదభాషలకును, సంకీర్ణప్రత్యయభాషలకును కూడ కలిపి విశాలార్థమున వాడఁదగును. ఈ జాతి భాషలలో సమాస పదములు విశేషముగ నున్నను, శబ్దసంకీర్ణ శక్తి (incorporation) మాత్రము లేదు.

ఈ జాతిభాషలు సామాన్యముగా ప్రత్యయాంతభాషలని పిలువఁబడినను, వీనిని 'సంకీర్ణప్రత్యయభాష'లనుట మేలు. ఈ జాతిభాషలలో వివిధములైన ప్రత్యయాత్మక వర్ణకముల మూలమున శబ్దముల పరస్పర సంబంధమును, భావములు వ్యక్తీకరింపఁబడి, మార్పుచెందును. ఈ ప్రత్యయాత్మక వర్ణకములు విశేషముగా వాని ప్రత్యేకస్వరూపమును, ప్రాముఖ్యమును గోల్పోయి, సర్వసాధారణముగా ప్రధానధాతువుతో మిళితమై, ప్రత్యయప్రయోజనములు గలవి గానో లేక, మూలముననే యా రీతిగ నున్నట్లుగానో యంగీకరింపఁబడినవి. ఇవి సాధారణముగ 'సంయుతధాతు రూప పద'భాషలందువలె శబ్దములకు తగిలింపఁబడినట్లు స్పష్టముగ గోచరించును. ఒకానొక భాషలో శబ్దముల చివర ప్రత్యయములు వివిధార్థప్రతిపాదనమునకు గాను గలుపఁబడినపు డా ప్రత్యయములు కేవలము 'సంయుక్త ధాతురూప పద' విధానమో లేక 'సంకీర్ణప్రత్యయ' విధానమో నిర్ణయించుట కష్టసాధ్యమే యగును. స్పష్టముగా విడమర్చ జాలిన ప్రత్యయములకును, విడమర్చజాలని ప్రత్యయాంతములకు మధ్య కొంత తారతమ్యము గలదు. ఒకప్పుడా భేదము కూడ సందిగ్ధముగా గోచరించును. ఉదా: ద్రావిడభాషలు సాధారణముగా 'సంయుతధాతురూప పద' భాషల క్రింద వర్గీకరింపఁబడినవి. అయినప్పటికి, విభక్తి ప్రత్యయ విధానమున,-కల్ (రాయి), ద్వి.వి.లో 'కల్లై' (కర్మ); షష్ఠీ. వి. 'కల్లిన్'; అగును. ఈ పద్ధతి లాటిన్ భాషలోని శబ్దస్వరూప నిర్మాణపద్ధతి కెంత మాత్రము భిన్నము గాదు. చూడుడు. లాటిన్ భాష: లాపిస్-లాపిడెమ్-లాపిడిస్. ఇందలి చివరలు ప్రత్యయాత్మకములు. ఇవి, విశిష్టరూపముతో ప్రధానస్థానము నాక్రమించిన వని మాట్లాడు వారెంత మాత్రము గమనింపఁజాలరు. ద్వర స్వరూపములందు ధాతువు ప్రత్యయములనుండి ప్రత్యేకింపఁదగినట్లుగా నుండుటయే 'సంయుత ధాతురూప పద' విధాన లక్షణమగ

నిర్ణయించినచో జపానీయభాష యా జాతిభాష క్రిందఁ జేర్పఁబడుట సాగదు. కాన ఫలితార్థమేమన, భాషలు శబ్దనిర్మాణ పద్ధతిలో కొన్ని లక్షణములలో పరస్పరము కలిసిపోవు చుండును. అందుచే శాస్త్రీయ భేదములను కచ్చితముగా నిర్ణయించుట యసాధ్య మగును. ఈ క్రింది యాంధ్ర సంస్కృత భాషోదాహరణములు 'సంకీర్ణప్రత్యయ' 'సంయుత ధాతురూప పద' భాషా స్వరూప విధానముల తారతమ్యమును స్పష్టముగాఁ దెలుపును.

నామవాచకములు :

'నృ' శబ్దము – ఋ కారాంత పుంలింగము : (నరుఁడు)

| | ఏ | ద్వి | బ | ఏ | బ |
|---|---|---|---|---|---|
| ప్ర | నా | నరౌ | నరః | నరుడు | నరులు |
| ద్వి | నరం | నరౌ | నౄన్ | నరుని | నరులను |
| తృ | త్రా | నృభ్యాం | నృభిః | నరునిచే | నరులచే |
| చ | త్రే | నృభ్యాం | నృభ్యః | నరునికొఱకు | నరులకొఱకు |
| పం | నుః | నృభ్యాం | నృభ్యః | నరునివలన | నరులవలన |
| ష | నుః | త్రోః | నృణాం నౄణాం | నరునియొక్క | నరులయొక్క |
| స | నరి | త్రోః | నృషు | నరునియందు | నరులయందు. |

క్రియ : 'భూ', ధాతువు (ఉండు) (పరస్మపది) లఙ్. (భూత కాలము)

| | | | |
|---|---|---|---|
| ప్ర | అభవత్ | అభవతాం | అభవన్ |
| మ | అభవః | అభవతం | అభవత |
| ఉ | అభవం | అభవావ | అభవామ. |

'ఏధ' ధాతువు (వృద్ధిపొందు) (ఆత్మనేపది) లట్. (వర్తమాన కాలము)

| | | | |
|---|---|---|---|
| ప్ర | ఏధతే | ఏధేతే | ఏధన్తే |
| మ | ఏధసే | ఏధేథే | ఏధధ్వే |
| ఉ | ఏధే | ఏధావహే | ఏధామహే.

ఈ క్రిందివి నాలుగు ద్రావిడభాషలనుండి యుదాహరణములు.

| తెలుగు | తమిళము | మలయాళము | కన్నడము |
|---|---|---|---|
| నేనున్నాను | నాణ్ ఇరుక్కిఱేణ్ | నాన్ అగున్ను | నాను ఇద్దీని |
| నీవున్నావు | నీ ఇరుక్కిఱాయ్ | నీ అగున్ను | నిను ఇద్ది |
| వాడున్నాడు | అవణ్ ఇరుక్కిఱాణ్ | అవన్ అగున్ను | అవను ఇద్దాని |
| మేమున్నాము | నాన్‌గళ్ ఇరుక్కిఱోమ్ | నన్నళ్ అగున్ను | నావు ఇద్దేవె |
| మీరున్నారు | నీన్‌గళ్ ఇరుక్కిఱీగ్గళ్ | నిన్నళ్ అగున్ను | నీవు ఇద్దీరి |
| వారున్నారు | అవర్‌గళ్ ఇరుక్కిఱార్గళ్ | అవర్ అగున్ను | అవరు ఇద్దారె |

ద్రావిడభాషలలో ధాతువునకు ప్రత్యయమునకు మధ్య బహు వచవద్యోతక వర్ణకము స్పష్టముగఁ దెలుపఁబడఁగ, సంస్కృతమున వట్లు లేదు.

పై యుదాహరణములలో ద్రావిడభాషలగు తెలుఁగు, తమిళ, మలయాళ, కన్నడ భాషలలో ధాతువులును, ప్రత్యయములును స్పష్టముగా విడమర్చగలుగునట్లుగా నున్నవి. అందలి ధాతువు లేమాత్రము మార్పు చెంద లేదు. ఇఁక సంస్కృతభాషలోని యుదాహరణములలో ధాతువులును ప్రత్యయములును కలిసిపోయి, యా పదములలో నెంతవఱకు ప్రత్యయములో గుర్తింప వీలులేక పోవుటయే కాక, ధాతువులలోఁగూడ రూపములందు మార్పులు చెందినవి. ద్రావిడభాషలలో నామవాచకమునకు ఏక, బహువచనములలో రెంటికిఁగూడ నొకే విధమైన ప్రత్యయములు గలుపఁబడగ, సంస్కృతమున భిన్నప్రత్యయములు గలుపఁబడినవి. మఱియు వీని వలన సంయుతధాతురూప పద భాషలకు (agglutinative languages) ను, సంకీర్ణ ప్రత్యయాంత భాషలకు (inflexional languages) ను గల భేదము స్పష్టమగుచున్నది.

భాషాశాస్త్ర పరిశీలన మెంత వెనుకకు చూడఁదగినదో యంత పూర్వకాలమునుండియు నీ కుటుంబభాషలు ప్రత్యయసంకీర్ణ భాషలు గనే యున్నవి. నామవాచక, సర్వనామములకు వచనవిభక్తులను, ‘క్రియలకు వచన పురుష కాలములును దెలుపు ప్రత్యయములు చివర

చేర్పబడినవి. ఇట్టి మార్పులన్నియు చివరఁ జేర్పఁబడు ప్రత్యయముల మూలముననే జరుగును. అతిప్రాచీన స్థితి యందుఁ గూడ నీ ప్రత్యయములు స్వతంత్ర స్థానములు గలిగియున్నట్లు గోచరింపవు. పూర్వ

ఇండో యూరోపియా భాషలు

కాలమున ప్రాచీన ఇండోయూరోపియా భాషను మాట్లాడిన జనులు ప్రత్యేక ప్రత్యయముల కేదైన ప్రత్యేకార్థముల నారోపించినట్లు కాని, కనీసము వారు ధాతువును ప్రత్యయముతోఁ గలుపుచుంటి మను జ్ఞానము గలిగియుండిరని గాని యూహించుటకుఁ గూడ వీలులేదు. ప్రాచీన యిండోయూరోపియా భాషలలోని శబ్దముల నన్నింటిని విభాగములుగా చేయ ప్రయత్నించు భాషాశాస్త్రజ్ఞుఁడు, విభక్త్యంగములు, విభక్తి ప్రత్యయముల పెద్ద జాబితాను మాత్రము తయారుచేయఁగలడు. అతఁడు ప్రధానాప్రధాన పురుషప్రత్యయములు మొదలైన వానిని కనిపెట్టఁ గలడు. కాని యా ప్రత్యయముల కేదైన స్వతంత్రార్థమును కనిపెట్టుటలోఁ గాని, యవి యేవైన సర్వనామకమైన వని గాని, లేక నిర్దేశాత్మక ధాతువుయొక్క సంకుచితరూపములని గాని, లేక భ్రష్టరూపమని కాని కనిపెట్టుటలో నతఁడు విఫలుడగును. ప్రారంభమున నీ ప్రత్యయము లేవో యొకరూపమున ప్రత్యేకస్థానము గలిగి యర్థవంతములై యుండి సంయుక్తధాతురూప పద భాషలందువలె ధాతువులకుఁ జేర్పఁబడి వాక్యమున నా ధాతువుల సంబంధప్రయోజనములను దెలుపుచునుండెడి వని భాషాశాస్త్రజ్ఞుడు బలవంతముగా విశ్వసింపవలసిన వాఁడగును. కాని యతఁడా విషయమును వాస్తవమునకు ఋజువు చేయఁజాలడు. శ[illegible] నిర్మాణక్రమమున నీ యా వర్ణకము లీ యా కార్యములను నిర్వహించె నని బహుస్థూలముగ నతఁడు నిర్దేశింపవచ్చును. కాని యావర్ణకమ[illegible] లా యా కార్యము లెట్లు నిర్వహించును, వాని పూర్వరూపమ[illegible] లెట్లున్నవి? యని నిశ్చయాత్మకముగ ఋజువుచేయఁ గలుగుట చాల యరుదు. హేతువాదము ననుసరించి వీని ప్రారంభము సంయుక్త ధాతురూప పద పద్ధతి యని ముందుగనే విశ్వసింప తగినది. కా[illegible] యిండోయూరోపియా భాషలలోని యతి ప్రాచీన రూపములు పూర్తి

ప్రత్యయ సంకీర్ణ మూలములుగనే యుండెనని మరువగూడదు. ఉదా: 'ఇకుఓస్' (ekuos) (అశ్వ) పదము ప్రథమాంతమును, 'ఇకుఓసిఒ' షష్ఠ్యంతమగుచో, భాషాశాస్త్రజ్ఞుడు, నిశ్చయముగా కాకపోయినను, మొదటి దానిని, 'ఇక్ - ఉ + ఒ + స్' అనియు, రెండవ దానిని ఇక్ + ఉ - ఒ - సిఒ' అనియు వివరించును. 'ఇక్-ఉ-ఒ-స్'లో 'స్' ప్రథమావిభక్తి ప్రత్యయమనియు, 'ఒ' అనునది విభక్త్యంగ వర్ణక మనియు, చెప్పవచ్చును. కాని, యిక్కడ 'స్ - ఒ'లచే ప్రతిపాదింపఁ బడిన వానిస్వతంత్ర స్వరూపముగాని, విలువగాని యతఁడు స్పష్టపఱుపఁజాలఁడు. మఱియు దాని స్త్రీలింగ రూపము 'ఇకుఆ' అను మార్పునేల గ్రహించునో కూడ నతడు వివరింపలేడు. 'ఇకుఒసిఒ' పదములో నెంతవఱకు షష్ఠీవిభక్తి ప్రత్యయమో, యెంతవఱకు విభక్త్యంగమో నిశ్చయముగా చెప్పఁజాలడు. మఱియు, నాపదముల నుపయోగించుట కలవాటుపడిన వాఁడందలి 'ఒసిఒ' కాని 'సిఒ' కాని యిష్టము వచ్చినపుడు కలుపుటకును, లేనప్పుడు తీసివేయుటకును వీలుగ నుండునని యతఁడు భావించియుండడు.

ప్రాచీన యిండోయూరోపియా భాషలను వదలి, ప్రత్యేక యిండోయూరోపియన్ భాషలలోని ప్రాతరూపములకు దాటిపోయి పోయినచో, నందు ధాతువును ప్రత్యయమును (భ్రష్టోచ్చారణము మూలమున) పూర్తిగ సంకీర్ణమును పొందుటను గమనించగలము. సజాతీయ శబ్దము లన్నింటిలోఁగూడ ధాతువు స్పష్టమును సక్రమమునగు రూపములో నుండఁ గలుగుట తేలిక గాదు. అయినను, గ్రీకు, లాటిన్, గోథిక్ మొదలైన సర్వాచన భాషలలో కంటె దానియందు ధాతువు చాల తక్కువగ వికారరూపమును పొందినది. మఱియు ధాతువు భ్రష్ట రూపమును పొందుటతోఁబాటు ప్రత్యయము లెక్కువ విరూప పరిణామము నొందినవి. ప్రకృతి ప్రత్యయములు కలిసిపోయి యుచ్చారణములో నొకటి యైనది. ఉదా: ఇండోయూరోపిన్‌యన్ భాషలలో 'ఇస్' (ఉండు) ధాతువు వర్తమాన కాలైక వచనమున 'ఇస్మి' 'ఇసి', 'ఇస్తి' అగును. మఱియొక కాలమున 'సియేమ్, సియేస్,

'సిర్యేట్' అగును. ప్రాచీన గ్రీకుభాషలో పై వానికి క్రమముగా 'ఐమి, ఐ, ఎస్టి,'' యును, 'ఐయాన్, ఐయాన్, ఐయి' అగును. 'ఐమి - ఐ'లలో భ్రష్టోచ్చారణము 'ఇస్మి' ఇసి' లలోఁగల పూర్వపు క్రమమును రూపుమాపి, ధాతువు పూర్తిగా దాఁగిపోయినది. 'ఐ'లో ప్రత్యయముగూడ నదృశ్యమైనది. 'ఐయి'లో, పోలికచే నూతన రూప మూహింపఁబడిన 'ఇసైయేట్' (సిర్యేట్' కు మారుగా 'ఇసైయిట్')న, ధాతువులోని 'స్' ను, పురుషప్రత్యయమగు 'ట్' యును గూడ లోపించుటచే, ఫలితముగా రెండును మారురూపములు పొందినవి.

ఇట్లే భ్రష్టోచ్చారణమువలన ప్రాచీన యిండోయూరోపియా భాషలలో ప్రత్యయములు రూపు చెడినవి. ఈ కారణముచే ననేక ప్రత్యయముల మూలరూపములను నర్థములను గుర్తించుట యసాధ్యమైనది.

ఇండోయూరోపియా భాషలు ప్రత్యేకముగా తర్వాత దశలలో వివరణాత్మకములుగా (analytical) పెరిగిపోయినవి. దీనికి ముఖ్య కారణము, మూలప్రత్యయము లుచ్చారణమున భ్రష్టములై, తికమకలై, వాని పద్ధతియైనను గుర్తింపరానివై నవి. వాని స్థానమున నవ్యయములు, సహాయక్రియలు, నితర సహాయపదములు నాక్రమించినవి. ఈ పద్ధతులు చారిత్రముగ చాల వఱకు గుర్తింప వీలగుచున్నవి. ప్రారంభ దశలో వివరణపద్ధతి చాల యరుదుగ నుండెడిది. జన్యభాషలగు సంస్కృతమును, స్థిరపడిన భాషలును వాని సంవరణ synthetic) దశలో నవ్యయములను, స్వతంత్ర సర్వనామములను, నితరరూపముల నుపయోగింప మొదలిడినవి. తరువాత క్రమముగా నవీనభాషలు వాని నిర్మాణము ముఖ్యముగా పదస్థానముమీఁదను, సహాయవర్ణకముల మీఁద నాధారపడఁ జొచ్చినవి. ప్రాచీనవి శేష్యమున కథమపక్ష మెనిమిది విభక్తులుండగా, వివిధభాషలలో వాని వాడుకయు, స్వరూపమును గూడ తికమక లగుటచే,నవి యన్నియు వదిలివేయఁబడి, యవ్యయముల మూలమున నా భావము వ్యక్తీకరింప బడెను. నామ సర్వనామ క్రియల

కుండ మూఁడు వచనములలో (ఏక, ద్వి, బహు), ద్వి వచనము వదిలి వేయఁబడినది. ఉదా : ఆంగ్ల భాషలో క్రియాప్రత్యయము చాలవరకు లేదనియే చెప్పవచ్చును. ఇండోయూరోపియను భాషలలో నేదియు ప్రత్యయవిధానమును పూర్తిగా పరిత్యజింపలేదు. ఆంగ్లపర్షియా భాషలు చాలవరకు ప్రత్యయములను వదలుకొను మార్గము పట్టినవి. అయినప్పటికిని ఆంగ్లభాష బహువచనమునకు 'యస్' S ఒకప్పుడు en 'ఎన్' అను ప్రత్యయములను నిలుపుకొనియున్నది. షష్ఠీవిభక్తి ఉదా: man's, men's. (ఇవికూడ తొలగిపోవు గుర్తు లగపడుచున్నవి.) క్రియలలో కొన్ని ప్రత్యయములు మిగిలియున్నవి. ఉదా: lovest, loves, loved. కొన్ని బహువచనములలో ప్రత్యయవిధాన శేషము గోచరించును. ఉదా: foot-feet ; అట్లే క్రియలలోను. ఉదా : See-saw ; drink-drank,drunk. అస్తమించిన ప్రత్యయవిధానము కొన్ని చిహ్నముల నుంచివేసి, వచన కాలాది సంబంధమును దెలుపు సహాయ శబ్దములు వానికి బదులుగా నిర్వహించును. ఆంగ్లభాషలో 'I will go' of a man, అని చెప్పిన వివరణాత్మక (analytic) మగును. I went ; a man's అని చెప్పినపుడు ప్రత్యయాత్మకము నగును. ఇంకను సర్వ నామమును క్రియయు రెండును గూడ కలుపఁబడినచో, లాటిన్ భాషలో 'ఇవి' (ive), సంకీర్ణప్రత్యయాత్మకము పూర్తిగ నుండును. ప్రాచీన ఇండోయూరోపియాభాషను (దొరికి నంతవరకు) ప్రాచీన లాటిన్ భాషతోను, తర్వాత సామాన్యలాటిన్‌తోడను, పిమ్మట ప్రెంచి లేక గోథిక్ భాషలతోను, అటుపిమ్మట ఆంగ్లము లేక జర్మన్ భాష లతోఁ బోల్చి చూచినచో నేవిధముగా నా భాషలు క్రమముగా వివరణపద్ధతికి దారితీసినవో స్పష్టపడును.

ప్రాచీన యిండోయూరోపియన్ ధాతువులు ఏక హల్మాత్రములు. ప్రత్యయములు గాని, విభక్త్యంగములు గాని లేక యా ధాతువులు స్వతంత్రప్రయోగము గలవి కావు. విభక్త్యంగ వర్ణకము లేకుండ ధాతువునకు విభక్తిప్రత్యయము గాని, పురుషద్యోతక వర్ణకము గాని నరాసరిగా కలుపుట చాలా అరుదుగా నుండును. ఉదా: అస్-మి.

(సం. అస్-మి=అస్మి). నే నున్నాను. కాని కేవలము 'అస్' ధాతు వునకు భాషలో స్థానము లేదు. సామాన్యముగ ధాతువునకు ఏదేని వర్ణకమును చేర్చుటవలన ధాతువు విభక్త్యంగముగా నిర్మింపఁబడును. తర్వాత నా విభక్త్యంగమునకు వివిధములైన యర్థములను (వచన కాల విభక్త్యాదులను) దెలుపుటకు మరికొన్ని వర్ణకములు చేర్పఁబడి పూర్తిభావము వ్యక్తీకరింపఁబడును.

గ్రీకుభాషలో 'డో-థే-స్-ఒ-మెథా' అనుదానిలో ఈ (అను ధాతువు)+కర్మార్థకసంజ్ఞ+భవిష్యదర్థకవర్ణసము +విభక్త్యంగము+ ఉత్తమపురుష బహువచనమును కలిసి యున్నవి. ఇందలి భాగములు ఆదర్శసంయుక్తధాతు రూప పద భాషలందువలె ప్రత్యేక వ్యక్తిత్వముగల్గి యుండవు. టర్కీభాషలోని 'సెవ్-ఇన్-దర్-ఇల్-మి-మెక్'అను పద ములలోని వివిధ భాగములు టర్కీవానికి స్పష్టముగను తేలికగను వెంటనే గుర్తింప వీలగున ట్లుండును. ఆ వాక్యమందలి ప్రతిభాగమునకు నే యే యర్థమో వాడు వెంటనే స్పృహగల్గి యుండును. కాని గ్రీకుభాషను మాట్లాడు గ్రీకుల కట్టి జ్ఞాన ముండదు. ఇట్టి పోలికయే తమిళాంధ్రాది ద్రావిడభాషలకును సంస్కృతభాషకును గలదు. ఇండోయూరోపియన్ భాషలు మాట్లాడువారు తమ భాషలోని పదములందలి వివిధభాగ ములను వేర్పరపఁజాలరు.

ఇండోయూరోపియాభాషలలో నర్థవిశేషములకుఁ గాను శబ్దము లకు ముందుపసర్గలు వాడఁబడును. గ్రీకు సంస్కృతభాషలలో భూత కాలమున వాడబడు తొలి 'అ' కారము నిర్దేశార్థకము. ఉదా: అభవత్, అగచ్ఛత్ మొ॥. ఇతర యుపసర్గలుకూడ నిటువంటివే. వ్యతిరేకార్థకమున క్రియకు ముందు చేర్పఁబడు 'న' కారము సమా సమువంటిదే. ధాతువు పునరుక్తిమై, సమానముగా వాడఁబడుట బహుభాషలందుండు విధానము ఇండోయూరోపియాభాషలలో సామా న్యమే. ఉదా: సంస్కృతమున భూతకాలార్థమున 'భభూవ; మొ॥ లాటిన్: స్పొస్పొండి; గ్రీకు; తితెమి; గోథిక్: సైసైడ్' మొ॥

గ్రీకు సంస్కృతభాషలలో విభక్త్యంగములు స్వేచ్ఛగా సమసించును. లాటిన్ భాషయు దాని జన్యభాషలును కొంచెదిగా సమసించును. జర్మనిభాషలో విభక్త్యంగములు విశేషముగా, నాంగ్లమున చాల యరుదుగాను, విభక్త్యంగములు సమసించును.

ప్రాచీన యిండోయూరోపియన్ భాషలో ధాతువుయొక్క అచ్చుపరిణామ మొక విశేషలక్షణము. కాని ప్రారంభమున, సెమిటిక్ భాషలో యర్థప్రయోజనములకు గాను ధాతువులో వచ్చు అచ్చుపరివర్తనము వలె, నిండోయూరోపియాభాషలలో రాదు. ఈ భాషలో 'భెర్' ధాతువు 'భోర్, భృ, భ్రా' అనియు, 'ఎస్' ధాతువు 'స్' గాను, 'సెమ్' ధాతువు 'సామ్, స్మ'గ నుండవచ్చును. ఈ మార్పులు సంపూర్ణపదమందలి ప్రధానద్వితీయపు టూాల మీఁద నాధారపడి యుండునే కాని, సెమిటిభాషలో వలె నర్థభేదము సూచించునట్లు గావు. సెమిటిక్ భాషయందువలె ధాతువు కేవలము హల్లులతోఁ గూడి యుండు పద్ధతి యిండోయూరోపియాభాషలలో లేదు. ఇందొక యచ్చుండును. ఈ భాషాకుటుంబములో నామవాచక క్రియా ప్రత్యయము లనేక ముగా నుండును. నామవాచకమునకు ఏక, ద్వి, బహువచనముల విభక్తి ప్రత్యయములలో ననేక విశేషలక్షణము లున్నవి. క్రియకుఁగల వివిధ కాల బోధక ప్రత్యయములు బహువిశాలముగను క్లిష్టముగ నున్నవి. ఇండోయూరోపియా భాషాకుటుంబములోని వివిధ భాషా శాఖ లభివృద్ధి పొందినపు డందలి ప్రత్యయవిధానము భిన్నోచ్చారణ విశేషములచే ననేక రూపములతో స్వతంత్రముగా మార్పుచెందినది. కాన వివిధభాషలలోఁ గల ప్రత్యయవిధానము తుల్యముగా నుండలేక పోయినది. అవి వాని వాని హద్దులు దాటి పోయినవి.

సెమిటిక్ భాషలు

(హీబ్రూ, అరబిక్ మొదలైన) సెమిటిభాషలులో నితరభాష లలోఁ గల గొన్ని లక్షణములలో మాత్రము సమానగుణములు గలిగి యున్నను, వానిలో లేని కొన్ని విశిష్టమైన శబ్దనిర్మాణ లక్షణములు గలిగి యున్నవి. లింగ వచన పురుష విభక్తి చిహ్నములుగా ధాతువునకు చేర్పఁబడు ప్రత్యయ

ములు రూపమునందు గ్రీకు, లాటిన్ భాషలతో సాదృశ్యము లేకపోయి నప్పటికిని తత్త్వమున వానికంటె భిన్నము గాదు. ప్రాచీన అరబీ భాషలో నామవాచక క్రియా ప్రత్యయము లిట్టులుండును.

| | | ఏ | ద్వి | బ |
|---|---|---|---|---|
| ప్ర | — | అబ్డ్ + ఊ | అబ్డ్ + ఆని | అబ్డ్ + ఊన |
| ద్వి | — | అబ్డ్ + అ | అబ్డ్ + ఐని | అబ్డ్ + ఈన |
| ష | — | అబ్డ్ + ఈ | అబ్డ్ + ఐని | అబ్డ్ + ఈన |

ఉ. పు — ఏ కటబ్టు (నేను వ్రాసితిని)
మ. పు — ఏ . కటబ్ట (పులిం) - కటబ్టి (స్త్రీలిం)
ప్ర. పు — ఏ ... కటబ్.అ ( ,, ) - కటబ్ఆట్ ( ,, )

పై వానికిని టర్కీ లేక మాగ్యారుభాషలోని 'సంయుత ధాతురూపపద' విధానమునకును భేదమేమియు లేదు. ఉదా :- అరబీభాషాపద్ధతిలో 'కిటాబ్ ఈ' = నా పుస్తకము ; కిటాబ్ ఉక=నీ (పులిం). పుస్తకము; కిటాబ్ ఉకి = (స్త్రీ) = నీ పుస్తకము ; కిటాబ్ ఉహు = (పు). వాని పుస్తకము ; కిటాబ్ ఉహా (స్త్రీలిం) = ఆమె పుస్తకము.

ఇందు సంయుతధాతు పదరూపవిధానము సక్రమముగను స్పష్టముగ నున్నది. కాని సెమిటిక్ భాషలలో నీ పద్ధతి బహుమితముగా నుండును. ఈ శాఖలోని భాషలు దరిమిలా క్రమముగా వివరణరూపము (Analytical form)ను పొందినవి. ఉదా : హిబ్రూభాషలో ప్రత్యయములు పోయినపుడు వాని స్థానమున వర్ణకములు (Particles) చేరినవి.

ఇక ధాతువులను ప్రయోగించు విధములో నీ సెమిటిక్ భాషలు బహువిచిత్రముగా నుండును. ఈ భాషలలోని ధాతువులు మూఁడు హల్లులతోఁ గూడియుండి, యర్థప్రయోజనముల ననుసరించి యే యచ్చై నను దానిలో మధ్య ప్రవేశించును. ఆ రీతిని, 'క్ట్ల' అను ధాతువునుండి వివిధ ప్రయోజనానుగుణముగ, క్టైల్, క్టోల్, క్టిల్, క్టల్, క్టుల్, కట్ల్, కుటెల్, కుటల్, కటల్, కాటల్, కెటోల్, మొదలైన యనేక

రూపము లుండఁగలవు. కనుక 'కుటిల=వాడు చంపఁబడెను.' కటల=వాడు చంపెను. 'అక్టల = వాడు చంపించెను; యక్టులు = వాడు చంపును; కాటిల్ = చంపుచు' అని కలవు. ఇండోయూరోపియను భాషలలో క్రియాధాతువులో వచ్చు నచ్చువలన నర్థములో మార్పును కూర్చువిధాన మీ భాషలలోఁ గూడ గోచరించు ననుట నిజమే. (Ablaut and umlaut,) అబ్లాట్ - అమ్లాట్. ఉదా: స్విమ్ స్వామ్, స్వమ్ (Swim, swam, swum.) తెలుగులో పోలిక — తిను; తిని; తిన; తినె; తినక; మొ॥. కాని ఇండోయూరోపియన్ భాషలలో నీ వైవిధ్యము ప్రారంభమున స్వరమువలన, నూతవలనను మాత్రము గలిగినదే కాని, యర్థముమీద నాధారపడి యుండలేదు. మఱియు నవి యరుదుగాను, క్రమరహితము గాను నా భాషలలో నున్నవి. కాని సెమిటిక్ భాషలలో నా విధానము విశాలముగను, సక్రమముగ నుండి యతిముఖ్యస్థాన మాక్రమించి యున్నది. అది యా భాష యొక్క సారమై యున్నది. అర్థవైవిధ్యమును గూర్చుట కది బహుముఖ్యమైన మార్గము. సెమిటిభాషల శబ్దస్వరూప నిర్మాణవిధానములో నది యత్యవసరమైన క్రియాశక్తి. ఇండోయూరోపియన్ భాషలలో నీ యజ్భరివర్తన మట్టిది కాదు. సెమిటిభాషలలో ప్రత్యయముల కూర్పును సమాసములును విశేషముగ నుండవు.

సెమిటిక్ భాషలలోని విశిష్టలక్షణ మేమనగా ముఖ్యముగా అచ్చులధ్వనులందే వ్యాకరణవిధానమును, శబ్దనిర్ణయ లక్షణము నాధారపడి యున్నవి. ధాతువునందలి హల్లు లెప్పుడును మారక స్థిరముగా నుండును. అచ్చులుమాత్రమే బలస్థాన వచనములను బట్టి మారుచుండును. అట్టి ప్రతిమార్పును అర్థముండును, నితరశబ్దములతో సంబంధమును దెల్పు పట్టులను ప్రతిపాదించును. అందుచేతనే సెమిటిభాషలో కేవలము నైఘంటుకలక్షణము హల్లులందును. వ్యాకరణలక్షణ మచ్చులందుండు నని యొకరనిరి. ఇండోయూరోపియనుభాషలలో ప్రత్యయములు చేయుపని దాదా పంతయు సెమిటిక్ భాషలలో నచ్చులు చేయు నన్నమాట. అనగా సెమిటిక్ భాష

లలో ప్రత్యయవిధాన మంతర్గతముగా నుండును. ఇట్లనుటచే సెమిటిక్ భాషలలో ప్రత్యయవిధానము లేదని కాదు. అందు ప్రత్యయములు నుపసర్గలును గూడఁ గలవు. శబ్దార్థములలోని మార్పులు కేవల మందలి యచ్చులను మార్చుటవలననే కలుగవు. సెమిటిక్ భాషలు, ప్రత్యయముల, నుపసర్గలను, వర్ణకములను, స్థానములను గూడ నితర భాషాశాఖలందువలనే యుపయోగించును. కాని ధాతువుపై ధాతువును సమాసమువలె నుపయోగించు రీతి యీం భాషలం దుండదు. అయినను ధాతువునుండి యితర రూపములను, ముఖ్యముగా నుపసర్గల మూలమున గూర్చును. కాని యిందు ప్రత్యయములు బహుస్వల్పముగ మాత్రమే వాడఁబడును. ప్రేరణార్థకములును, నాత్మార్థకములును హీబ్రూభాషలో నుపసర్గల ద్వారా నిట్లు వ్యక్తీకరింపఁబడును. ఉదా: 'క్టల్' ధాతువు నుండి, 'హిక్టల్, హిత్కట్టిల్, నిక్టల్' మొదలైనవి. అరబిక్ భాషలో నీ విధముగా ప్రతిక్రియకును పదిహేనురూపములు చేయవచ్చును. కాని ధాతువునకు ప్రత్యయముపైన ప్రత్యయములను సమానములవలె కుప్పలుగా వాడుపద్ధతి 'ఉరల్ - ఆల్టయిక్' భాషాకుటుంబమునందును, ఇండోయూరోపియన్ భాషా శాఖలందునున్నట్లుగా సెమిటిక్ భాషలలో మాత్రము గానరావు.

ఇంతకంటె సెమిటిక్ భాషా వ్యాకరణమును గుఱించి యధికముగాఁ దెలుపుట నధికప్రసంగ మగును. ముఖ్యమైన విషయము లేవనగా. (1) ఈ భాషలలో, సక్రమమైన అచ్చుల వైవిధ్యప్రయోగము తక్క, నిర్మాణపద్ధతిలో క్రొత్తవిషయము లేవియు లేవు. అందలి యుపసర్గలును ప్రత్యయములును బంటు, మలయ, ఇండోయూరోపియన్ భాషా కుటుంబములందు కంటె పద్ధతియందు మార్పు లేదు. (2) నవీన ఇండోయూరోపియన్, మలయో - పొలినేషియన్ మొదలగు భాషాకుటుంబములందువలె నవి వివరణపద్ధతికి స్పష్టమగు పరిణామమును చూపుచున్నవి.

భాషావంశసంబంధమును దెల్పు శబ్దసాదృశమురీత్యా సెమిటిక్ భాషా కుటుంబములోని వివిధభాషలు, ఇండోయూరోపియన్ భాషా

కుటుంబమునకుఁ జెందిన దే శాఖలోని భాషలకంటెఁ గూడ సన్నిహిత సంబంధము గలిగియున్నవి.

4. సంపృక్త భాషలు Incorporating languages లేక అనేక శబ్ద సంయుత విధభాషలు. Polysynthetic or Holophrastic languages of America

అమెరికా దేశములోని యాదిమవాసులు మాట్లాడు భాషల సంఖ్య నాలుగువందలకు పైగా నుండును. అవి యన్నియు ననేక శబ్దసంయుతత్వ పద్ధతులలోనే యుండి, వైవిధ్యము గలిగియుండినను, ముప్పదికంటె తక్కువ శాఖలుగ కూర్చుటకు మాత్రము వీలులేక యుండును ముఖ్యముగా దక్షిణయమెరికాలోని యనేక భాషలను గూర్చి బహుస్వల్పముగా పరిశీలింపఁబడుటచే వాని సంబంధమును గూర్చిన సిద్ధాంతములు తేలలేదు.

సాధారణముగ చెప్పవలసినచో, వాని ముఖ్యలక్షణ మే మన గా, క్రియతోఁబాటు కర్త కర్మలను కాలస్థలాది బోధకవర్ణకము లన్నిటిని కలుపుకొని వాక్యమంతయు నొకసమాసముగా వ్యక్తీకరించు శక్తి యా భాషలు గల్గియుండును. ఒకప్పు డది బహుదీర్ఘసమాసముగాఁ గూడ పరిణమించును. ఇందలి శబ్దముల కూర్పు గ్రీకుభాషలో రెండుపదములను కలుపుటవంటిది కాని, యనేక యిండోయూరోపియూభాషలలో ప్రధాన పదమునకు ప్రత్యయములు చేర్చుట వంటిది కాని కాక, వాక్యములోని ప్రతిప్రత్యేక పదమందలి ప్రధానధ్వనితోగాని, వర్ణకముతోగాని, సమానముగా నల్లఁబడిఁ దానిలోని ప్రతి శబ్దగతభావమును వెంటనే మనస్సులో రేకెత్తించును. సామాన్యముగా యూరోపు దేశములోని వివరణాత్మక (analytical) భాషలందు, వాక్యమందలి భాగములగు సర్వనామము, నామము, కర్త, కర్మ, క్రియ మొదలైనవిగ ప్రతిపాదింపఁబడినవి. అమెరికాభాషలలోని సంపృక్త (polysynthetic) విధానమున వానిని కుంచించి యొకటిగ చేయఁబడి, ప్రత్యేకముగా నొక శబ్దముగ నుండును. ఈ సంపృక్తవిధాన మాంగ్ల భాషయందలి Indefatigableness

అనుమాటవలెను, గ్రీకుభాషలోని Katapepolemesometha అను పదము వలెను, సంస్కృతమున 'చతురంభోధిపరీతభూవలయ రక్షాదక్షచామీకరాయతదండః' అను సమాసమువలె నుండును. ఇవి భావార్థకములు, విశేషణాత్మకములుగ నున్నవి. వీనిని చిన్నపదములతో వ్యక్తీకరింప వచ్చును. కాని సంపృక్తపదమునందు వాక్యమందలి వివిధ భాషాభాగ శబ్దములందలి భావమంతయు నిమిడియుండును. వివరణాత్మకమైన యాంగ్లపదమునందుకంటె, ప్రత్యయాత్మకమైన గ్రీకుపదములో నొక మెట్టధికముగ పోవును. ఎట్లన, ధాతుప్రత్యయము క్రియతో కర్త సమసించి కాలాదిధర్మములను ప్రతిపాదించును. సంస్కృతమునఁ గూడ నిట్లే. ఉదా: గచ్ఛామి=నేను వెళ్లుదును. అయినను గ్రీకు సంస్కృతభాషలు పదము నామములో సర్వనామములు గల కర్మను దమలో మిళితము చేసికొన లేవు. ఆ భాషలు స్వల్ప భాషాభాగములను మాత్రమే తమలోఁ గలుపుకొనఁ గలవు. ఇండోయూరోపియన్ భాషలు ప్రత్యయములను కూర్చుకొను శక్తి యెంత గలిగియున్నను, ప్రత్యక్ష కర్మ (direct object) ను గాని, పరోక్ష కర్మ (indirect object) ను గాని కలుపుకొను శక్తి వానికి లేవు. ఆ భాషల నమెరికాభాషలతోఁ బోల్చి చూచి నవు డాశక్తివిధానము స్పష్టపడును. సంస్కృతభాషలో నొక వర్ణకము మాత్ర మా సమాసపు కూర్పున స్పష్టముగ నుండును. ఆ మిగులుభాగములు బహుముఖ్యములైనవిగ నుండును. అమెరికాభాషలలో శబ్దప్రతిపాదిత హ్రస్వీకరణమును, పరిసరానుగుణోచ్చారణమును మొదటనో, మధ్యనో, చివరనో నుండవచ్చును. అమెరికాయిండియనుల 'మస్సచూసెట్సు' భాషలో 'అతడు మొంగాళ్లపై క్రిందవ్రాలి యతనిని బ్రతిమాలె' ననుటకు పదునొకండు స్వరములు గల యొక పదమున్నది. అట్లే మెక్సికన్ భాషలో 'పురోహితుడ'నుటకు నిరువదియేడక్షరములు గల పద మొకటి కలదు. ఇవి యాశ్చర్యజనకములు. 'చెరొకీ'లో తెలుపఁబడినట్లు 'కుకూస్క్వ్యా' అను మాటకు 'నా ముఖము కడుగుకొందును' నని భావము. మెక్సికనుభాషలో 'నికల్చిహు అ' శబ్దమునకు నేను ఇల్లుకట్టుదును అనియు

'నిసోత్సితేమొబ' అనగా=' నేను పూలకొఱకు చూతును' అనియు, 'మినొమాపాపోవా' అనిన=' నేను నా చేతులు కడుగుకొందు 'ననియు నర్థము.

దాదాపు అమెరికాభాషలన్నియు బాహుళ్యముమీఁద సంపృక్త ధర్మము విలక్షణముగా గలిగియుండి, యుత్తర యమెరికాయిండియను లందఱిచే నది పరిపాలింపఁబడినను, గ్రీనులాండు - మెక్సికనుభాషలలో నీ సంపృక్తత్వము విధిగా నున్నదని కాని, నామవాచకమునకు ప్రత్యేక స్థానము లేదని కాని తలంచుట దోషము. మెక్సినను భాషలో 'నేను పూల వెదకితిని' అనుటకు 'నిసోత్సితేమొబ' అను పదము, సంపృక్తత్వ ధర్మము గలదైనను 'సోత్సి' అను రూపమునకు (పూవు). 'ట్ల్' ప్రత్యయము కలుపఁబడినపుడు ప్రత్యేకస్థాన ముండును. అప్పుడు 'సోత్సిట్ల్' = 'పువ్వు' అగును. అట్లే 'నితేమొబ' లోని దానికి 'ట్ల్' కలుపగా 'నెవాట్ల్' 'నేను' అగును.

ఏ భాషలోనైన నొకప్రత్యయముపై మరియొక ప్రత్యయమును విశేషార్థప్రతిపాదనకై కలుపఁబడఁగ, స్వరపరిణామ మెట్లున్నను, ధాతువు లెట్టి పరివర్తన మొందినను, విచక్షణ లేక యా భాష సంయుక్త ధాతురూప పదభాష యని పరిగణింపఁ బడినచో అమెరికాభాషల కా పేరు నొసంగవచ్చును. కాని యా పేరట్లు ప్రయోగింపరాదు. ప్రత్యయ సంకీర్ణభాషలను సంయుతధాతురూప పదభాషలనుండి, ప్రాతిపదిక పద్ధతిమీఁద కాక, దాని స్పష్టత, ఫలితముల మీఁద నాధారపడుచి ప్రత్యేకించినచో, సంపృక్తభాషలను పై ద్వివిధజాతుల నుండి సమాస ముగ వేఱు చేయవలసిన బాధ్యత మన కున్నది.

## II

## జన్యజనక సంబంధ నిర్ణాయక భాషాజాతి విభాగము

## (లేక) శబ్దజాల సామ్యకృత భాషాజాతి విభాగము

### (Genealogical Classification)

అనేక భాషలను పరిశీలించినపు డందలి నిత్యవ్యవహారములో నున్న విశేషశబ్దజాలము, లేదా, పదముల ధాతురూపములు సదృశముగా నున్నట్లు గోచరించినచో నా భాషలు చారిత్రకముగా సంబంధము గలిగియున్నవను భావము గలుగును. అనఁగా నవి యన్నియు నొకటే **పదజాలము** మూలభాషనుండి పుట్టినవనియు, వాని చారిత్రక పూర్వదశ లన్నియు దొరికినచో నా మూలభాష గుర్తింపనగుననియుఁ దోఁచును. సదృశములై నిత్య వ్యవహారములో నున్న యా శబ్దములు నిత్యపరిచితములగు వస్తువులు, జంతువుల పేర్లు, వ్యాపారములు, గుణములు, మొదలైనవి కావలయును. ఉదా: (1) అవయవ వాచకములు :- తల, ముక్కు, కన్ను, చెయ్యి, కాలు మొదలగునవి. (2) సంబంధబోధకములు :- తల్లి, తండ్రి, అక్క, అన్న మొ॥ (3) సర్వనామములు :- నేను, నీవు, వాఁడు. మొ॥ (4) సంఖ్యావాచకములు :- ఒకటి, రెండు, మూఁడు, నాలుగు, పది, నూరు మొ॥ (5) నిత్యము చూచువస్తువులు :- గోడ, ఇల్లు, పిల్లి, మేక, ఆవు, గెదె మొ॥ ఇట్టి పదజాలము సామాన్యముగా నా భాష మాట్లాడు వారందఱకు సులభముగ నర్థమై నిత్య వ్యవహారమున వారిచే వాడుకొనఁబడుటచే నవి యా భాషకు సహజమై యుండును. ఈ కాలమున ప్రత్యేకభాషలుగా పరిగణింపఁబడుచున్న ఫ్రెంచి, స్పానిష్ పోర్చుగీస్, రుమేనియన్, ఇటాలియన్ మొదలైన భాషలను బోల్చి చూచినపుడు, చారిత్రక నిదర్శనములను బట్టియు, భాషావిషయములను బట్టియు, నవి లాటిన్ భాషా పరిణామమును ప్రతిపాదించు వివిధ మాండలిక భాషాభేదములని గోచరించును. ఆ భాషలు సోదర భాషలనియు, ప్రాచీనలాటిన్ భాషాజన్యములని పిలచినచో దోష

ముండదు. తత్త్వదృష్టితో విచారించినపుడు, లాటిన్ భాష, తన పరిణామదశలో వివిధదేశకాలపరిస్థితులలో పొందిన వివిధమైన రూపములే యా భాషలని చెప్పవచ్చును. ఈ సత్యమును స్పష్టముగ గ్రహించిన మీఁదట, నవి యేకపితతోఁగూడిన కుటుంబముగ నేర్పడునని యాలంకారికముగ వ్యవహరించినచో నాక్షేప ముండకూడదు అదే విధమున, ఇంగ్లీషుభాషకును యూరోపుదేశమందలి ట్యూటానిక్ కుటుంబ భాషలకును గల సంబంధము, ఆంగ్లో-సాక్సనులు తమభాషను బ్రిటనుదేశమున నెలకొల్పుటకుఁ బూర్వము, జర్మనీదేశములో ప్రారంభమున నుండు ఆంగిలులు, సాక్సనులు మొదలగు జాతులకు సంబంధించినవారని దేశచరిత్ర వలనఁ దెలియుటచే విశదమగుచున్నది.

ఈ రెండువిషయములలో భాషావిషములు చారిత్రకనిదర్శములనే బలపఱచుచున్నవి. ఒకవేళ దేశచరిత్రక సాక్ష్యము లేకున్నను, భాషాశాస్త్రజ్ఞుఁడా యా భాషలను మాత్రము పరిశీలించినపుడందలి శబ్దముల సామ్యమును గుర్తించి, యాకర్షింపఁబడినవాఁడై, యా భాషలు పరస్పరసంబంధము గలవియై, యొక వంశవృక్షమునకుఁ జెందినవని కాని, యేకమాతృక లనికాని నిర్ణయింపక యుండలేడు. అట్లే, యుత్తర హిందూదేశమందలి భాషలన్నియు నా ప్రదేశమునఁ బూర్వకాలము వాడుకలోనున్న ప్రాకృతభాషల నుండి పుట్టినవనియు, నీ ప్రాకృతభాషలందలి భేదముకూడ ప్రాచీనప్రాకృతమను భాష, మగధావంతి శూరసేనాది దేశములలో భిన్నరీతుల నుచ్చరింపఁబడుటచేఁ గలిగినదేయనియు, నీ ప్రాకృతమును వైదికభాషయుఁగూడ 'జెండవెస్టా' (Zend Avesta) భాషతోఁ బోల్పఁబడినపుడవి యన్నియు సన్నిహిత సంబంధముగలవియై ప్రాచీనార్యభాషనుండి పుట్టినట్లును కేవల మా యా భాషలందలి పోలికలనుబట్టి నిశ్చయింపవచ్చును. విశాలమైన శబ్ద సామ్యమును బట్టి సామాన్యమానవుఁడు తన నిర్ణయము నిర్దోషమైనదనియు, స్వయంసాక్ష్యము గలదనియు భావించును. కాని భాషా శాస్త్రజ్ఞుఁడా శబ్దజాలసామ్యమును నాలుగువైపుల విచారించును. ఒక భాష తనతో నే మాత్రమును సంబంధములేని మఱియొక భాషనుండి

విశేషశబ్దజాలమును తేలికగ నెరువు తెచ్చుకొనఁగలదని శబ్దశాస్త్రజ్ఞులకు బాగుగ తెలియును. ఇట్లెరువు దెచ్చుకొన్న పదములనేకము స్వభాషాపదములవలె స్వభాషాసంప్రదాయానుగుణముగ వాడుకొనఁబడుటచే, స్వభాషలోఁ గలిసిపోయి, పరభాష యను జ్ఞానమే నశించి, యెరువుమాటలకే ప్రచారమధికమై, తత్పూర్వ మా యర్థములో నున్న జాతీయపదములను వాడుకలోనుండి తప్పించివేయుటయుఁ గూడ జరుగును. అట్టి పదముల సంఖ్యాబాహుళ్యమును బట్టి భాషాసంబంధమును నిర్ణయించినచో నది తప్పుదారి పట్టును. ఆధునిక పరిషియ భాష, యథార్థమునకు లాటిన్, గ్రీకు, జెండవెస్టా, సంస్కృతము, ఇంగ్లీషు భాషలతోఁబాటు ఇండోయూరోపియన్ భాషా కుటుంబములోఁ జేరియుండినను, ప్రస్తుత మాభాషలోఁ గలిసిపోయిన ఆరబిక్ శబ్దజాలమును బట్టి యది హీబ్రూ, అరబిక్ మొ॥ భాషలవలె సెమిటిక్ భాషా కుటుంబమునకుఁ జేరినదిగాఁ గనఁబడును. ఇంగ్లీషుభాష యథార్థమునకు ఇండోయూరోపియన్ భాషాకుటుంబశాఖయైన ట్యూటానిక్ భాషలకుం జెందినదైనను, నది లాటిన్, ఫ్రెంచి శబ్దములను తనలో విశేషముగాఁ గలుపుకొనుటచే, నిఘంటువులందలి పదసమూహమును బట్టి స్థూలముగా నిర్ణయించినచో నది లాటిన్ భాషకు చెందినదని చెప్పవలసియుండును. కాని జర్మనుభాషకుఁ గాని ట్యూటానిక్ శాఖకుఁ గాని సన్నిహితసంబంధము గలదని చెప్పుటకు వీలుండదు. ఇందుచే యథార్థమైన వంశక్రమమునకు బదులుగా వేరొక విధముగ వంశక్రమము నీయవలసియుండును. సత్యమైన వంశక్రమ మీ విధముగ నుండును.



కాని, కేవలము నిఘంటువులపై నాధారపడి నిర్ణయించినచో పై వంశ వృక్షము నీ క్రిందిరీతి తప్పుగ నీయవలసి యుండును.




ఈ విషయమున, భాషలసంబంధము కొంచెము తప్పుదారిలో నిచ్చినను, సంబంధమున్నవానికే సంబంధమును గూర్చుచున్నాము. కాని పరిషియన్ భాషను అరబిక్ భాషతోఁ గలుపుటలో నే మాత్రమును సంబంధములేని దానితో సంబంధమును గలుపుదుము. ఇతరభాషా జన్యములైన పదజాలముతో సాంకర్యమును గల్పించుచున్నాము. ఇదియే భేదము.

ఇట్లే యాంధ్ర భాషావిషయమునఁ గూడ పొరబాటు జరిగినది. ఆంధ్రభాష, సంస్కృత ప్రాకృతములను ప్రథమ ద్వితీయ ప్రకృతుల నుండి పుట్టిన వికృతి యని 'ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే, యేషా తయో ర్భవే ద్వికృతిః, కేవల తయానుసర్త్యుభేద మేయం యథా తథా భాషా " (ఆం. శ. చిం.) 'జనని సంస్కృతంబు సర్వభాషల కును' (శ్రీనాథుఁడు) - క్రీడాభిరామము. ఇట్లాంధ్రశబ్దచింతామణ్యాది వ్యాకరణములందు ప్రతిపాదింపఁబడినది. ఇంతేకాక యీ చింతామణి యందే "తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి" యని తెలుపఁబడినది. ఇఁక నాంధ్రభాషాభూషణమున కేతన,

ఆ. తత్సమంబునాఁగఁ దద్భవంబన నచ్చ,
తెనుఁగునాఁగ మఱియు దేశ్యమనఁగ
గ్రామ్యభాష నాఁగ గల దైదు తెఱఁగులు,
వేఱవేఱ వాని వి స్తరింతు.

అని తెలిపినాఁడు. ఇట్లే కూచిమంచి తిమ్మకవియుఁ దన సర్వ లక్షణ సారసంగ్రహమున. 'తెల్లమగు నైదు తెఱఁగులఁ దెనుఁగు భాష' అని చెప్పినాడు. దీనిని పట్టి పై లక్షణకర్తల యభిప్రాయము భాష యనఁగా నందలి శబ్దములు మాత్రమే యని చెప్పవలయును. ఏలన,

క. మును సంస్కృత పదములపైఁ,
దెనుఁగు విభక్తులు ఘటించి తేటపడఁగఁ జె
ప్పిన నది తత్సమ మనఁ జను,
వనము ధనము పురుషుఁ డబల వసుమతి యనఁగన్.

కేతన - ఆంధ్ర భాషా భూషణము.

తే. ఆంధ్ర దేశ పురస్థాయులైన సకల,
జనములకును మఱుంగు దేశంబు లేక
తేట తెల్లమిగాఁ బల్కుమాట లెల్ల,
నవని శుద్ధాంధ్ర దేశ్యంబు లనఁగఁ బడును.

(అప్పకవీయము I-10 ప.)

కాని, భాష యనఁగా కేవలము శబ్దము మాత్రమే కాదు; అందలి వ్యాకరణము, ప్రత్యయములు, కారకము, మొదలైనవి కూడ విచారింపవలయును. మఱియు శబ్దములలో తత్సమ తద్భవములు గాక దేశ్యములు, నచ్చ తెలుగు పదములు, గ్రామ్యశబ్దములు గూడ కలిసి యే యాంధ్రభాష యనఁ బడినదని లాక్షణికు లంగీకరించినపుడు, ఆంధ్రభాష యంతయుఁ గలసి వికృతి యని భావించుట యుచితము గాదు కదా. వీనిలో తత్సమ తద్భవ పదములన్నియు నెఱువు దెచ్చి కొనిన శబ్దములే యనవలయును. ఆంధ్రశబ్ద రత్నాకరమును పట్టి తత్సమ పదములు 14,314 ను, తత్భవములు 2,000 లును దేశ్యశబ్దము

12,887 మాత్రమే కలవు. ఒకభాష మఱియొక భాషయందలి విశేష పదముల నెరువు దెచ్చుకొని వానిని తన సంప్రదానుగుణములైన మార్పులతోఁ దనలో మిళితము గావించు కొనవచ్చును. మఱియు నా భాషలనుండి యెరువు దెచ్చుకొనిన పదము

శబ్దజాలముకంటె వ్యాకరణ మెక్కువ ప్రబలమైనది.

లా భాషకు సహజములగు గొన్ని పదములను గూడ నిత్యవ్యవహారము నుండి పారఁద్రోలి తామే నిలిచి యుండవచ్చును. అయినప్పటికిఁ గూడ నా భాష యెరువు దెచ్చుకొనిన భాషకుఁ జెందదు. ఏలన తన వాక్యరచనా రీతులు, వ్యాకరణాంశములు, జాతీయములు మొదలగు స్వభాషాసంప్రదాయము లా భాషయొక్క వ్యక్తిత్వమును నిలుపును. కాన నే భాష యే భాషా కుటుంబమునకుఁ జెందిన దని నిర్ణయించుటలో నందలి పదములకంటె, వ్యాకరణాంశములే యెక్కువ బలవత్తరమగు ప్రమాణమగునని నిశ్చయింప వలసియున్నది. పరస్పర సంసర్గముచే నొకభాష మఱియొక భాషనుండి యెన్నియేని శబ్దముల నెరువుదెచ్చుకొన వచ్చును, కాని వ్యాకరణాంశములను మాత్ర మెరువుదెచ్చుకొనఁ జాలదు. ఇతరభాషా సంపర్కముచే వ్యాకణాంశములందు గొన్ని మార్పు లేమైనఁ స్వల్పముగ గలుగవచ్చును, లేక యనవసరములైన యంశము లేమైనఁ గొన్నిలోపింపఁ వచ్చును. ఉదా : ప్రాచీనయిండో యూరోపియన్ భాషయందలి విభక్తిరూపము లన్నియు గ్రీకు, లాటిన్ మొదలగు భాషలలో సంక్షిప్తములైనవి సంస్కృతభాషలో నేటికిఁ గూడ సప్తవిభక్తులుండగా, గ్రీకు మొదలగు భాషలలో నేడువిభక్తులు లేవు - మూఁడే విభక్తులు గలవు. నార్మన్ ఫ్రెంచిభాషల సంపర్కము నాంగ్లభాషలోని ట్యూటానిక్ ప్రత్యయములలో నిరుపయోగములైన వానిని తగ్గించుకొనినది. కాని వ్యాకరణము మాత్రము తమకుఁ గ్రొత్తది కాదు.

కాన పురస్కారపద్ధతిని వ్యాకరణసామ్యము భాషల మూలల సంబంధమును ఋజువుచేయుటలో, స్వేచ్ఛగా నెరువు తెచ్చుకొను స్వభావము గల శబ్దజాలముకంటె, నెక్కువ నమ్మతగిన సాక్ష్యమొనఁగును.

కాని తిరస్కారపద్ధతి నది యంత తేలిక విషయముగాదు. వ్యాకరణ సామ్యమును ఋజువు చేయుట కది జన్యజనక సంబంధము కలది కావల యునని సాధారణముగ చెప్పుదురు. కొలఁదికాలము క్రిందటనే విడివడిన భాషలలో, శబ్దజాల సాదృశ్యముతోఁబాటుగ వ్యాకరణసాదృశ్యము సిద్ధ ముగా దొరుకును. ఇటాలియన్, స్పానిష్, ఫ్రెంచిభాషలును, ఆంగ్లము డచ్చి, జర్మనుభాషలును, హీబ్రూ అరబిక్ భాషలును బోల్చఁబడినపుడు వ్యాకరణసామ్యములు కంటికి వెంటనే గోచరించును. దానికి శబ్దజాలము తోడైనపుడు ప్రతి భాషాసంబంధమును దృఢపడును. మఱియు, నే భాషయుఁగూడ, వ్యాకరణవిషయములోఁ గాని, శబ్దములు వాని యుచ్చారణలోఁగాని, స్థిరముగా నుండఁజాలవు. ప్రతివిషయము దాని శీఘ్రపరిణామము నొందుచునే యుండును. దూరసంబంధము గల భాషలు స్వల్ప వ్యాకరణ విషయములలో మాత్రమే సామ్యము గలిగి యుండునను విషయము తేలికగ తెలియనగును. అవి పైన వివ రించిన రీతిగ ప్రత్యేకమైన వ్యాకరణ సంబంధాత్మక జాతులుగ గాని, లేక నుపజాతులుగగాని విభజింపవలసియుండును. సంపూర్ణమైన సంశ్లే షాత్మక (synthetical) భాష కావచ్చును. స్వల్పసంశ్లేషాత్మకభాష కావచ్చును. స్వల్పవివరణాత్మక (analytical) భాష యొకటి ప్రధాన వివరణాత్మకభాషయై, తర్వాత సంపూర్ణ వివరణాత్మకభాషగ కాని, లేక స్థానదశ (positional stage) కు గాని చేరవచ్చును. ఆంగ్లభాషలో నింకను నిలిచిపోయిన ఇండోయూరోపియన్ క్లిష్ట వ్యాకరణలక్షణము లను గుర్తించుటకు ప్రసిద్ధ భాషాశాస్త్రజ్ఞుని నిశితదృష్టి కావలసి యుండును. ఈ గుణములు నిల్చియున్నంతవరకు, నవి యా భాషా సంబంధమును నిర్ణయించుటకు విలువైనవి యగును. కాని తదుపరి పరిణామములో నవికూడ నస్తమింపఁగలవని యూహింప వీలున్నది. కాన నొక మూలభాషలోనుండి పుట్టిన యొకభాష, తన వ్యాకరణ మును శబ్దజాలమునుగూడ నభివృద్ధి చేసికొనిన తర్వాత, మఱియొక భాషతో సంపర్కగలిగి, దానినుండి విశేషపదజాలము నెరవుదెచ్చుకొని, దాని సహజపరిణామమువలన తన వ్యాకరణమును గూడ గుర్తుపట్టి

రానంతగ మార్చివేయ వచ్చుననుట స్పష్టము. అట్టి పరిస్థితిలో, చరిత్ర హీనమైన యా భాషను పరిశీలించు భాషాశాస్త్రజ్ఞునకు దాని వ్రగము సంబంధమును నిర్ణయించుటకు, నా భాషయందలి స్థిరమైన శబ్దములనుండి నిర్ధారణ చేయుటకంటె వేరు ప్రమాణ మేమియు నుండదు. ఆ శబ్దములు సహజముగా నా సొంతభాషకే చెందగలవు. ఆ ప్రమాణము శాస్త్రీయ మార్గము కంటె కొంత తక్కువైన నిర్ణయాత్మకమే కావచ్చును. అయి నప్పటికి దానిమీఁద నాధారపడి చేసిన సిద్ధాంతము నిర్దోషము కాఁ గలదు. ఆ భాష యా మూలభాషనుండియే సాక్షాత్తుగ పుట్టి యుండును, కాని దాని వ్యాకరణసామ్యము లోపించియుండును.

చారిత్రకసామ్యము కాకుండ, శబ్దజాలసామ్యమును, వ్యాకరణ సామ్యము నను రెండుప్రమాణముల పరస్పర సమర్థనముమీఁదనే భాషల సంపూర్ణమును నిశ్చయాత్మకమునైన వంశానుక్రమ విభాగ మాధారపడియుండును. వ్యాకరణసామ్యము లేకుండ భాషలసంబంధము ఋజువుచేయఁబడదు. ఇతరభాషలనుండి నెరువు దెచ్చికొనుట తేలిక పద్ధతియు, సర్వసాధారణమైన యాచారము నగుటచే, తనకు సాధా రణపదములుకూడ సకృత్తుగానైన సోకును గాన భాషలసంబంధమును శబ్దజాలము నిర్దోషముగ ప్రదర్శింప లేదు. నిత్యవ్యవహారములో నుండు పదములు మఱియొక యితరభాషతో పోలికయు భేదముగూడ సమము గనే కలిగియున్నప్పుడు, వ్యాకరణప్రమాణమున్నచో నిర్ణయించు బాధ్యత దానిపై నుండును.

ఏక కుటుంబమునకుం జెందిన వివిధభాషలందలి శబ్దజాలములో సాజాత్యములైన వర్ణకములను గూర్చి ముఖ్యముగా నొక విషయము

ధాతువులు

చెప్పవలసియున్నది. అనఁగా నా యా భాషలలో సమానమైన ధాతువులు, పదములు, పద భాగములను గూర్చి తెలిసి కొనవలసియున్నది. సామాన్యముగా తత్సంబంధమే రెండుభాషలలో నైనను సమానశబ్దములును, ధాతువు లును సమానమైన రూపములలోను, ధ్వనులలో నెప్పుడును నుండుట సంభవింపదు. మూలభాషలో నొకపదము గాని, ధాతువు గాని తజ్జన్య

భాషలగు సోదరభాషలలోఁగూడ నదే రూపమున నుండునని యెప్పుడును తలఁపఁ గూడదు. ఏలన నొకచోటనే నివసించుచు నొకభాషనే మాట్లాడు ప్రజలలోనే కొంద ఱొకధ్వని నొకమాదిరిగను, మఱికొందఱు మఱియొక మాదిరిగ నుచ్చరించుట మనము చూచుచున్నాము కదా. ఈ భేదము వారివారి యభ్యాస విశేషముమీఁదను, నుచ్చారణ విషయమున వారికిఁ గల వికారములైన యలవాటులమీఁద నాధారపడును. ఈ భేదములు క్రమముగ నధికమై, ప్రజలలో నాటుకొనిపోయి యొక కాలమున నొకమాదిరిగ నుచ్చరింపఁబడిన పదములు, కొంతకాలము తర్వాత మరియొక మాదిరిగ నుచ్చరింపఁబడి వేరొక రూపమును పొందుట సహజము. అట్లే భిన్నప్రదేశములలో మాట్లాడిన మాటలలో భేదముండుటలో నాశ్చర్య ముండదు. కాన నొకమూల భాషనుండి పుట్టినవైనను, కాలక్రమమున భిన్నప్రదేశములలో మాట్లాడు నపుడు వారివారిలో ధ్వనులు సహజముగాఁ గొన్ని మార్పులను జెందు ననుటలో నెట్టి సందేహము లేదు. మఱియు, జన్యభాషలలోని పద మదే రూపమున నుండినచో, మనము గుర్తించిన స్థితిలో నున్న యా పదము మూలభాషనుండి పుట్టిన మరియొక సోదరభాష నుండి యెరువుగ తీసికొని వచ్చిన దనియో, లేక తా నితరభాష కెరువిచ్చిన దనియో, తప్పక యనుమానింపవలసి వచ్చును. ఒక భాషలో ననేకపదములందు పైనఁ దెల్పినటువంటి మార్పులు నియతముగ గోచరించుటచే నవి యా భాషను మాట్లాడువారి యుచ్చారణకు సహజమైన యొక వికారమని యంగీకరింపవలసినదే కాని వేరువిధమున దానిని వ్యాఖ్యానించుటకు వీలు లేదు. కాన ననేక శబ్దములను పరిశీలించి, యా యా భాషలం దట్టి విరూపములను గమనించి, యొకధ్వని యా యా భాషలం దా యా కాలములలో నా యా విరూపములను పొందుచున్నవని నిరూపించినచో, సోదరభాషలందుఁ గల సజాతీయ పదములలోఁగల యీషద్భేదములు సకారణముగనే గోచరించును. ఇటువంటి ధ్వనివిశేషములను వివరించు నవియే స్వరనియమసూత్రము (phonetic laws) లనఁబడును. ప్రతి భాషయు తన సొంతభాషా స్వరనియమములను ప్రదర్శించును. అవి

తన, భాషలోని ప్రతి జన్యభాగముపై ప్రభావమును జూపును. మూల భాషలోని ధాతువును గాని పదమును గాని యొక జన్యభాషలోని స్వర నియమము లొకరూపములో మలచుకొనిన, మరియొక జన్యభాషలోని తన స్వరనియమము లాధాతువును, పదమును మఱియొక రూపమునకు మలచుకొనును. అందుచే జన్యభాషలలోని పదముల సంబంధము బాహ్యరూపమున నొకటే విధముగ నుండవు ఉదా :- గ్రీకు శబ్దమగు 'బోస్'ను, సంస్కృత పదమగు 'గౌః'ను రూపమున నుచ్చారణము నను భేదముగలవియైనను సజాతీయములైనవే. ఆంగ్ల భాషలోని 'కౌ' యును, జర్మను భాషలోని 'కుః'యును 'గోస్' అను మూలపదము నకు సంబంధించియుండును. కనుక, 'బౌస్, గౌః, లేక కౌః' అను ప్రతి పదమును, మూలపదమగు 'గౌస్' నకు తన భాషలోని సరియైన యుచ్చారణ ప్రాతినిధ్యము నెఱపును. ఆ యా భాషలను మాట్లాడు వారి నోళ్లలో తరతరములుగా వ్యవహరింపఁబడినవు డా పదము సహజముగా పొందిన రూపము లవి. ఆంగ్లభాషలోఁగాని, జర్మనీభాషలోఁగాని, యా జంతునకు 'కౌ' లేక 'కుః'కు బదులుగా 'బౌ' లేక 'గౌ' అను పేరు వినఁబడినచో, ఆ యా భాషలలోని భాషానియమ సూత్రముల జ్ఞానముతో, మన మా రూపము గ్రీకుభాషలోని 'బౌ' నుండి కాని, లేక సంస్కృతభాషలోని 'గౌః' నుండి కాని యెరవు తెచ్చుకొనిన దని నిశ్చయింపఁగలము. అదే విధమున, 'పది'శబ్దమునకు, గ్రీకుభాషలో 'డెక' యనియు, లాటిన్ భాషలో 'డెసిమ్' అని సంస్కృతభాషలో 'దశ' యనియు, గోథిక్ భాషలో 'తైహున్' అనియు నగును.

అదే విధమున తమిళమున 'క' కారము గన్పడిడిన కొన్ని శబ్దములలోఁ దెలుఁగున 'చ' కారము గన్పడు చున్నది. ఉదా:

| | |
|---|---|
| తమి - తె | తమి - తె |
| కవి - చెవి | కొంబోక్ - చెంబు |
| కిళి - చిలుక | కైక్కాళి } - చంక |
| కెయి - చెయి | కంకుటి } |

ఇన్లే యితర ద్రావిడభాషలలో నున్న 'ప' కార మాధురిక కన్నడ భాషలో 'హ' కారముగ మారినది. ఉదా :- పొన్ను - హొన్ను ; పాలు-హాలు ; పసరు-హసరు ; పది-హది. మొ॥

ఈ రూపములలో నే యొక్కటియు మఱియొక దానితో సమానముగ లేదు. కాని యవి యన్నియు నొకటే మూలభాషనుండి ప్రత్యక్షముగా జనించిన వను సాక్ష్యము వానిమూలమున దృఢమగును. ఏలన, మూలశబ్దమగు 'డెక్' రూప మా యా భాషలలో నుచ్చరింపఁబడినపుడు యథార్థముగ నా రూపములే పొందును. ఆ పదము లొకటే విధముగ నున్నచో, లేదా, చాలవరకు సమానముగ నున్నచో, నవి యొకభాష నుండి మఱియొకటి యిటీవలనే యెరువు దెచ్చుకొనిన వని యనుమానించుటకు సర్వవిధములు కారణము గల్గించును. అందుచే నట్టి సారూప్యము గల శబ్దములు భాషల సాజాత్యమును నిరూపించుటకు వినియోగించుట యశాస్త్రీయమే యగును. ఇటాలియన్ భాషలోని 'పద్రి+మద్రి' అను పదములకు సమానముగా ఫ్రెంచిభాషలో 'పేరి–మేరి' అని యుండును. ఇవి లాటిన్ భాషలోని 'పత్రెమ్–మాత్రెమ్' అను రెండు పదములకు నా రెండుభాషలలో క్రమముగా సహజమైన యుచ్చారణ ప్రాతినిధ్యము నెఱపును. కాని ఫ్రెంచిభాషలో 'పద్రి–మద్రి' అను రూపములున్నచో, నా పదములు ఇటాలియన్ భాషనుండి సరాసరి గ్రహించినవనియు, ఫ్రెంచిభాషయందు ప్రత్యక్షముగా నిష్పన్నము కాలేదనియు మనము నిర్ణయించుటకు వెనుదీయము. కాన, వంశానుక్రమ వర్గీకరణమును నిర్ణయించుటకు గాను వివిధభాషలలోని పదజాలమును బోల్చుటలో వాని సంపూర్ణ స్వరూపసాదృశ్యము నాశింపక, నా యా భాషలలోని విశిష్టమైన స్వరనియమ సూత్రముల దృష్టిలో నూహింపఁ బడిన విశేష సాదృశ్యముపై నాధార పడవలయును.

కాన, భాషాశాస్త్రవేత్త సదృశ పదజాలము గోచరించు భాషా సముదాయముతో సంసర్గము గలిగినపుడు, మొట్టమొదట, వివిధ భాషలందు సుమారుగా సమానార్థము గల్గి, తగినంత సదృశరూపము

గల పదములను ప్రక్క ప్రక్క నుంచి పరిశీలించును. అట్టి కొన్ని పదముల పట్టికలవలన నా భాషల వంశసంబంధము విశేష సంభావ్యము గాను, సంతృప్తికరముగా నున్నట్లు గనఁబడిన తర్వాత రెండవ ప్రమాణ మగు వ్యాకరణసాదృశ్యమును సమన్వయింపఁ జూచును. ఈ పరీక్ష యా సిద్ధాంతమును స్థాపించి, దాని సంబంధమును దృఢపఱచినచో శబ్దముల ధాతువుల సాదృశ్యమును గూర్చి యతఁడు విశేషపరిశ్రమ చేసి, యా భాషలలోని స్వరనియమ సూత్రములను కనిపెట్టి, వాని మూలమున నా ధాతువులును శబ్దములును స్వీకరించు విశేషరూపములను నిర్ణయించును. ఈ స్వరసూత్రములు కనిపెట్టఁబడి, వాని వ్యాపారము స్పష్టపఱచఁబడిన వెంటనే (త్వరలో నట్లగును గాన) యితర స్వల్పసాదృశ్యము లనేకము బహిర్గతమై వెనుకటి నిర్ణయములను బలపఱచును. మఱియు నీ పరిశీలనలో సాదృశ్యము గలవిగాఁ గనఁబడు కొన్ని శబ్దములు సజాతీయము గానట్లుగా గూడ స్పష్టపడును. అట్టి వానిని, మఱియు శబ్దశాస్త్ర వేత్త, సాదృశ్యము లేనివిగాఁ గనఁబడు మఱికొన్ని శబ్దములందు పోలికలను గుర్తించి యా పట్టికలోఁ జేర్చికొనును. ఇట్లు శాస్త్ర యుక్తముగా నిర్ణయింపఁబడిన పద్ధతులమీఁదనే సదృశపదజాల మాధారపడియుండి, చారిత్రకమైన దూరసంబంధముగాని, దగ్గర సంబధముకాని నిర్ణయించు భాషల వర్గీకరణమునకుఁగల రెండు ప్రమాణములలో నది యొకటి యగుచున్నది.

జన్యజనకక్రమమున భాషలను వర్గీకరించుటలో నింకను కొంత చేయవలసిన పనియున్నది. సాధ్యమైనచో స్పష్టమైన వివిధభాషా కుటుంబములను నిర్ణయించి, ప్రతి భాషాకుటుంబమునందును గల వివిధ భాషలకుఁ గల దూర సన్నిహిత సంబంధములను వివరించుచు, భాషా వృక్షమున కుండు వివిధశాఖలను గూడఁ దెలుపుట యవసర మగును. సాధ్యమైనంతవరకు వివిధత్వమున నైక్యమును సాధించుటయే మానవ విజ్ఞానా దర్శము. కాని శాస్త్ర మీ కోరికను విశృంఖలముగా కొనసాగించుట కంగీకరించదు. భాషలన్నియు చివర కొకటే మూలభాషనుండి పుట్టిన వను సిద్ధాంతము నెంతమాత్రము భాషాశాస్త్ర మిప్పుడు సమర్థింపదు.

అది కొలఁది భాషాకుటుంబములను మాత్రమె ప్రతిపాదించుటకుఁగూడ నంగీకరింపదు. ప్రామాణికసాక్ష్యములను దాటిపోయి శాస్త్రము నిర్ణయములను చేయఁజాలదు. తులనాత్మక భాషాశాస్త్రమునందు భాషలందలి శబ్దజాలమును వ్యాకరణవిషయములను తీక్ష్ణముగా పోల్చు పద్ధతిని, భాషోత్పత్తిని గూర్చి యైక్య వివిధత్వ పాక్షికసిద్ధాంతములను మనస్సునం దుంచుకొని మలిన మొనర్పరాదు. ఈ పద్ధతిని ప్రపంచమందలి భాషలకు సమన్వయించినను గూడ వాని యైక్యమున కెంత మాత్రము తోడుపడదు. కొన్ని భాషా కుటుంబములును, మఱికొన్ని చిన్నవియు, పెద్దవియునగు భాషాసముదాయములు కనిపెట్టి వలసియున్నవి. ప్రపంచమున ప్రస్తుతమున్న భాషలన్నింటిని నెనుబది లేక తొంబది కంటె తక్కువ విభాగములుగ నెట్టి గొప్ప భాషాశాస్త్రజ్ఞుఁడు గూడ చేయలేదు. వాని కెట్టి జన్యజనకసంబంధమును శాస్త్రప్రమాణముతో నతఁడుఁ గూర్పలేదు. ఆఫ్రికా నీగ్రోలును, అమెరికా యిండియనులు వంటి మోటుజనులు మాట్లాడు ననేకభాషలఁ గూర్చిన విషయములు బహుస్వల్పముగను, దుర్గ్రాహ్యముగ నున్నవి. ఈ భాషలను పూర్తిగ పరిశీలించిన పిమ్మటనే పై భాషావిభాగముల సంఖ్య నెక్కువగ గాని, తక్కువగ గాని చేయవచ్చును. ప్రస్తుత పరిస్థితిని బట్టి మొత్తము మీఁద ఫ్రీడ్రిక్ ముల్లరు గణనప్రకారము ప్రత్యేకమైన భాషాకుటుంబములు సుమారు నూరువర కుండవచ్చు ననుట సరసముగనే యుండును.

భాషాకుటుంబములను నిర్ణయించుటలో వ్యాకరణవిషయము చాల ముఖ్యస్థానము వహించును. భాషలకు వ్యాకరణ మాత్మ వంటిది. శబ్దజాలము నితరభాషలనుండి యెంత యధికముగా నెరువుదెచ్చికొనుటకైనను సాధ్యమగును. కాని యితర భాషావ్యాకరణ విషయముల నొక భాష యెరువుదెచ్చుకొనుట కెంతమాత్రము సాధ్యము కాదు. ప్రతి భాషకు విశిష్టమైన వ్యాకరణవిశేషము లుండును. వాక్యనిర్మాణమందును, లింగ వచన విభక్తులందును, క్రియలు మొదలైన వాని యందును ప్రతిభాషకుఁ గొన్ని ప్రత్యేకలక్షణము లుండితీరును. ఉదా: సంస్కృతభాషనుండి విశేషశబ్దజాలమును తెలుఁగు తత్సమ,

తద్భవరూపమున నెరువు దెచ్చికొనుటచే నా రెండుభాషలలో శబ్ద జాల మధికసామ్యము గలిగియున్నను, వ్యాకరణవిషయములలో సంస్కృతాంధ్రముల కెంతమాత్రము పోలిక లేనే లేదు కదా. తెలుఁగు మాటలకు సంస్కృతప్రత్యయములు గలుపఁబడి చేయఁబడిన రచన మణిప్రవాళశైలి యనునది మలయాళభాషలో నున్నను దెలుఁగున దాని నెవ్వరు గౌరవింపలేదు. అట్లే తెలుఁగువారు ఇంగ్లీషు తురక పదముల నెన్నింటి నైనను వాడుచున్నారు. కాని వానిలోని ప్రత్య యములు, నుపసర్గలు నవ్యయములు మొదలైనవాని నెప్పుడు నెవ్వరు వాడరు కదా. మనము 'బల్ల 'కు బదులుగా 'బెంచి' అను నాంగ్ల పదమును వాడినను, 'బెంచీలు, బెంచిమీఁద, బెంచిక్రింద, బెంచితో ' అని తెలుఁగు ప్రత్యములను వానికిఁ గలుపుచున్నాము. కాని ' బెంచెస్ ', అనియు ' ఆంది బెంచి కూర్చో ' అని వాడుట లేదు కదా. అట్లే యితర భాషా పదములు గూడ. భాషాకుటుంబములను నిర్ణయించుటలో వ్యాకర ణము గీటురాయి యని చెప్పవచ్చును.

శబ్దములను బోల్చుట కే యే శబ్దములను గ్రహింపవలెనను విచ క్షణ తరువాత గావలయును. కాని వ్యాకరణవిషయములను బోల్చు సందర్భమున నీ చిక్కుండదు. ఏలన వ్యాకరణము నెరువుదెచ్చుకొను టకే భాషకును వీలులేదు కనుక. అయితే నిఁక పదములను బోల్చి శ్రమపడనేల యను ప్రశ్నకు సమాధాన మిది. మొట్టమొదట పద ములసామ్యమును బట్టియే భాషాసంబంధమును సూచించి, యను మానించుటకు స్థూలముగ నుపయోగించును. ఈ పదసామ్యసాహాయ్యము లేనిచో భాషలను బోల్చుటకు ప్రారంభమున దారియే దొరకదు. కాన నీ పద్ధతి ప్రాథమికావస్థలో నెక్కువగా నుపయోగించును. ఈ పదపరీక్షకు తట్టుకొనిన తర్వాత వ్యాకరణ సామ్యపరీక్ష చేసి భాషా సంబంధమును, తన్మూలమున భాషాకుటుంబ నిర్ణయమును చేయఁ గలము. కాన వ్యాకరణవిషయ సామ్యము భాషాకుటుంబ నిర్ణాయక నిశ్చయకత్వమునకుఁ గావలసి యుండును.

వివిధ భాషలలోఁ గల శబ్దములకు సాదృశ్య మున్నపుడు, వాని సాదృశ్యకారణములను, వాని సంబంధములను బరీక్షించిన పిమ్మట భాషా కుటుంబములు నిర్ణయింప నగును. వానిలో నొక భాష యింకొక భాషనుండి పుట్టినదా? లేక, యా రెండు భాషలును గూడ మఱియొక మూఁడవ భాషనుండి యుద్భవించి, సోదరభాషలైనవా? యని నిశ్చయింపవలయును.

భాషాకుటుంబ సంబంధ మును నిర్ణయించు నియమములు

భాషలసంబంధమును నిర్ణయించుటలో మొదట సామగ్రి, లేక, శబ్దజాలమును, తర్వాత రెండవది, పద్ధతి, లేక, యా భాషల వ్యాకరణాంశములును దోడ్పడును. భిన్న భాషలలో నేకార్థ బోధకములగు పదము లేక ధాతువునకుఁ జెందిన వగుచో నా రెండుభాషలకు సంబంధ మున్నదని చెప్పవచ్చును. భాషాసంబంధ మును నిర్ణయించు సందర్భమున నీ క్రింది విషయములను ముఖ్యముగా పాటించవలసి యుండును.

(1) పోల్చుటకు శబ్దములను గ్రహించుటలో నితర భాషలనుండి యెరువుదెచ్చికొనిన శబ్దములను పరిత్యజించుటను గూర్చి బహుజాగ్రత వహించవలయును. సామాన్యముగా నొకభాషను మాట్లాడు జను లితర భాషలను మాట్లాడు జనులతో, (1) వర్తక వ్యాపార నిమిత్తము పోయి నపుడు కాని, (2) వలసపోయినపుడు కాని, (3) దేశ దండయాత్రకై వెడలినపుడు కాని, (4) అన్యదేశపరిపాలన యపుడు కాని, సంపర్కము గల్గుట సహజము. అప్పుడు సౌకర్యమునకై యితర భాషాశబ్దములను జనులు గ్రహించుట సర్వసామాన్యముగా జరుగుచుండును. అట్టి యెరువు మాటలు భాషలో కలిసిపోవును. కాన నట్టి వాని నీ సందర్భమున పోల్చరాదు. కాన సామాన్యముగా నిత్య వ్యవహారములో నుండు పదము లను మాత్రమే యీ సందర్భమున నేరుకొనవలయును. అట్టి వేవనఁగా (1) శరీరావయవములను దెలుపు పదములు. ఉదా: నోరు, ముక్కు, చెవి, కన్ను, చెయ్యి, కాలు మొ॥ (2) బాంధవ్యమును దెలుపు మాటలు. ఉదా: తండ్రి, తల్లి, అక్క, అన్న; మొ॥ (3) సర్వ నామములు: ఉదా: వాఁడు, నేను, నీవు, ఆమె, అది, మొ॥ (4)

సంఖ్యావాచకములు : ఉదా : ఒకటి, రెండు, మూఁడు, నాలుగు మొ॥ (5) నిత్యపరిచయములైన జంతువులు, వస్తువుల పేర్లు : ఉదా : కాకి, పిల్లి, కుక్క, ఆవు, గేదె, గాడిద, గుఱ్ఱము. మొ॥ ఇల్లు, గోడ, దారి, మొ॥ ఇట్టి పదము లే భాషయందైనను స్వతస్సిద్ధముగా నుండ గలవు గాని, యితర భాషలనుండి యెరువు దెచ్చికొనవలసిన యవసర ముండదు. కావున నట్టి పదములనే పోల్చవలెను. సాధారణముగా శాస్త్రములందలి పారిభాషికపదము లితరభాషలనుండి యెరువు తెచ్చి కొనఁబడును. కాన వానిని బోల్చిచూచి లాభములేదు. అవి నిత్య వ్యవహారమున నుండవు కదా.

(2) భాషలోఁగల పదముల యధికసంఖ్యపై నాధారపడి భాషా కుటుంబమును నిర్ణయించుటగూడ తప్పు. ఎందుకన నొకభాషలో నధిక పదము లితరభాషల నుండి యెరువు దెచ్చుకొనినవే నిలిచిపోయి, జాతీయ శబ్దములు విస్మరింపఁబడి వ్యవహారచ్యుతములు గావచ్చును. ఉదా: తెలుఁగుభాషలో దేశీయపదములకంటె సంస్కృతపదముల సంఖ్యయే యధికము. ఆంధ్రశబ్దరత్నాకరమును బట్టి తెలుఁగున దేశీయపదములు 12337 మాత్రమే యుండఁగా, సంస్కృతసమములు 14814 లును. తద్భవములు 2000 ను గలవు. మఱియు నీ భాషలో నూటికి 4 వంతున తురకపదములును, 5 వంతున నాంగ్లపదములును గలవు. ఇంత మాత్రముచే తెలుఁగును సంస్కృతము నొక భాషాకుటుంబమునకుం జెందినవని నిర్ణ యింపరాదు. అట్లే యాంగ్లభాష గూడ. ఆంగ్లభాషాకోశమందు లెక్కింపఁబడిన 43566 పదములలో 29853 మాటలు లాటిన్ భాషకును, 13230 మాత్రమే ట్యూటానిక్ భాషకుఁ జెందినవి. తక్కినవి యితర భాషలనుండి వచ్చినవి. కాని నిత్యవ్యవహారమునకుం జెందిన మాట లును, వ్యాకరణవిషయములును ట్యూటానిక్ భాషకుఁ జెందిన వగుటచే నాంగ్లభాష ట్యూటానిక్ భాషా కుటుంబమునకుఁ జెందినదిగా నిర్ణయింపఁ బడినది. కాన నెరువుపదములను పోలికనుండి పరిహరించు విషయమున బహుజాగ్రత్తగ నుండవలయును.

(3) రెండుభాషలలోని పదములు సమానార్థకములైనను కేవలము బాహ్యాకార సాదృశ్యమును బట్టి యవి యొకటే భాషాకుటుంబమునకుఁ జేరినవని నిర్ణయింపరాదు. యాదృచ్ఛికముగ గూడ శబ్దములలో నట్టిపోలిక లుండవచ్చును. ఉదా: ఆంధ్రాంగ్ల భాషలలోఁగల నీ పదముల వలన నీ విషయము స్పష్టమగును. Mouth - మూతి; Pro -ప్రాపు; Neat - నీటు; Group గుంపు; Cheek - చెక్కు; Throw-త్రోయు; Attic - అటక; Eean - ఈను; Tell - తెలుపు; Pan - పెనము. మొ॥. కాన శబ్దముల బాహ్యాకారసాదృశ్యమువలన భ్రాంతి చెందరాదు. వీనిలో తెలుఁగుపదములు ద్రావిడ భాషాకుటుంబమునకుఁ జేరఁగ, నాంగ్లశబ్దములు ట్యుటానిక్ భాషాకుటుంబమునకుఁ జెందును కదా.

(4) భాషాకుటుంబములను నిర్ణయించుటలో పోల్చుపదముల మూలరూపములను ధాతువులను పరిశీలించి సామ్యమును గుదర్చవలయు నే కాని వాని భ్రిష్టరూపములను బోల్చి నిర్ణయింపరాదు. ఉదా: భవతి (సం) హవది, హోది (ప్రా); అవద్ది (తెలుగున భ్రిష్టరూపము, అగు ధాతువునుండి). తెలుఁగునందలి 'అగు' ధాతువునకు సంస్కృతమున 'భూ' ధాతువునకు నే విధమైన శబ్దసామ్యము లేదు.

(5) వివిధభాషలనుండి పదములను పరీక్షించునపుడు వాని ప్రకృతి ప్రత్యయ విభాగముచేసి, వాని ప్రాతిపదికలను మాత్రమే పోల్చి చూడవలయును గాని, ప్రకృతిప్రత్యయములు గలిసినపుడు గుణవృద్ధ్యాదులచే మార్పుపొందిన మైక్యరూపములను పోల్చి నిర్ణయింపరాదు.

(6) ప్రతిభాషయందును వర్ణములు గొన్ని స్వరనియమముల ననుసరించి మారుచుండును. ఆ మార్పు గొన్నినియమములకు పద్ధతులకు బద్ధమై సక్రమముగా నుండునే కాని, దారియు డొంకయు లేక నిరంకుశముగా నుండదు. కాన నా స్వరసూత్రములను వివరించి, సమన్వయించి యా మార్పు సక్రమమని ఋజువుచేసిన పిమ్మటనే కాని యా పదముల సామ్యము నంగీరింపరాదు. ఉదా: ఇతర ద్రావిడభాషలతోఁ బాటు తెలుగునందలి 'ప' కారము క్రొత్తకన్నడమున 'హ' కార

ముగ మారును. ఉదా: పాలు–హాలు; పొన్ను–హొన్ను; పసరు–హసరు; పది – హది మొ॥ మఱియు తమిళమున తాలవ్యాచ్చుతోఁగూడిన ' క ' కారము తెలుఁగున ' చ ' కారముగా మారును, గాని యితరాచ్చుతోఁగూడినచో మార్పురాదు. ఉదా: కివి – చెవి; కిళి – చిలుక; కెయి – కెయి – చెయి;

(7) ఏకకుటుంబమునకుఁ జెందిన భాషలలో తుల్యరూపము గల పదములు సమానార్థమున వాడఁబడక పోవచ్చును. అప్పుడు వాని ప్రాచీనరూపమును గాని దాని మూలార్థముగాని యితర పదములతోఁ గూడి సమసించినపుడా యర్థమున వాడఁబడినదేమో కూడ జాగ్రత్తగ పరిశీలింపవలయును. కల్లు (తమి) = రాయి. ఈ పద మీ యర్థమున తెలుఁగున స్వతంత్రప్రయోగము లేదు. కాని ' తిరుగలు ' (తిరుగు రాయి) పదములో ' గలు ' శబ్దము సమసించి వాడఁబడినది. ఇట్టి మాటలే. సన్నికలు (నూరు రాయి), వడగల్లు

పై నియమముల ననుసరించి ప్రపంచమునఁ గల భాషలలో నింతవరకు గుర్తింపఁబడిన భాషాకుటుంబములలో నీ క్రిందివి ముఖ్యమైనవి. (1) ఇండో – యూరోపియన్, లేక, ఇండో – జర్మానిక్ భాషాకుటుంబము. (2) సెమిటిక్ భాషాకుటుంబము. (3) ఊరల్ ఆల్టాయిక్ భాషాకుటుంబము. (4) మలయో పాలినేషియన్ భాషాకుటుంబము. (5) బంటు (దక్షిణాఫ్రికా) భాషాకుటుంబము. (6) ద్రావిడ భాషాకుటుంబము. (7) ముండాభాషలు. (8) సిథియన్ భాషా కుటుంబము. (9) ఫిన్నో - ఉగ్రియన్ భాషా కుటుంబము. (10) చీనా భాషలు. (11) పాపువన్ భాషలు. (12) సూడాగిని భాషలు. (13) కాకస్ భాషాకుటుంబము. (14) ఆస్ట్రేలియా దేశ భాషలు. (15) బుష్‌మెన్ హాట్టెన్ టాట్ భాషలు. మొదలైనవి.

## వివిధ భాషాకుటుంబముల వివరణములు

**I.** ఇండోయూరోపియన్ భాషా కుటుంబము :- ఈ భాషా కుటుంబమునకు ఇండోజర్మానిక్ భాషాకుటుంబమను పేరు కూడఁ గొంత

కాలము వ్యవహారములో నుండెను. ఈ కుటుంబమునకుఁ జేర్పఁ బడిన భాష లలో నేదియు తూర్పున హిందూ దేశమును దాటిపోయి గాని, పశ్చిమమున యూరోపు దేశమును దాటిపోయి గాని లేకుండుటచే చివరి సరిహద్దులను సూచించుటకుఁ గా నీ దేశ భాషలతోనిది పేర్కొనఁబడినది. ఇండో జర్మానిక్ భాషాకుటుంబమని పేర్కొనఁబడిన కాలమున పడమటి పొలి మేర జర్మనీ దేశముగా మాత్రమే గుర్తింపఁబడినది. కాని తర్వాత దాని కంటె పశ్చిమమున నున్న 'కెల్టిక్' భాషలుగూడ నీ కుటుంబ ముతోఁ జేర్పఁబడుటచే దాని పడమటి సరిహద్దును మార్పఁవలసి వచ్చి నది. ఐనను నీ భాషాకుటుంబ మెన్నడు 'ఇండోకెల్టిక్' భాషాకుటుంబ మని పిలువఁబడక, మొత్తముమీఁద 'ఇండో - యూరోపియన్' భాషా కుటుంబమనియేః పిలువఁబడుచు వచ్చినది. ఈ భాషాకుటుంబము బహు విశాలమైన దగుటచే, దీనిని గొన్ని శాఖలుగా భాషాశాస్త్రజ్ఞులు విభ జించిరి. 1. ఆర్యభాషలు, 2. ఆర్మీనియన్‌భాషలు, 3. ఆల్బేని యనుశాఖ, 4. బాల్టోస్లెవోనిక్ శాఖ, 5. ఇటాలిక్ శాఖ, 6. గ్రీక్ శాఖ, 7. కెల్టిక్ శాఖ, 8. జర్మానిక్ శాఖలు. వీనిలో మొదటి నాలుగుశాఖలును చేరి 'సెతం' భాషలనియు, చివర నాలుగుభాష లకుఁగలిపి 'కెంటుం' భాషలనియు సంకేతము గలదు.

(1) ఆర్యభాషాశాఖ : ఈ శాఖలో 1. సంస్కృతము, 2. పర్షియాదేశపు ఐరేనియన్‌భాషలు గలవు. చివరిది ప్రాచీన కాలమున 'అవెస్తా' యనియు, ప్రాచీనపర్షియా యనియు రెండు విధములు. పారశీకుల మతగ్రంథమగు 'అవెస్తా' యందలి భాష యగుటచే దాని కాపేరు గలిగినది. ఆఫఘన్, బెలూచి, భాషలు ప్రస్తు తపు ఐరేనియనుభాషలు. వీనితో 'అవెస్తా' భాషకు బహు సన్ని హిత సంబంధమున్నది. బహుస్వల్పపు మార్పుతో నొక దానిని రెండవ దానిగ మార్పవచ్చును, 3. బౌద్ధమత గ్రంథములలోఁగల 'పాళీ' భాష, 4 ప్రాకృతభాషలు, 5. హిందీ, బెంగాలీ మొ॥ నవీన హిందుస్థానభాషలు నీ శాఖలోఁ జేరును.

(2) ఆర్మీనియను శాఖ: ఈ శాఖయందలి భాషలు గ్రీకునకు నార్యభాషలకు మధ్యగా నుండును. దీనిని మాట్లాడువారు మొదట ఆర్మీనియా దేశవాసులైన ప్రస్తుతము టర్కీ, రషియా దేశములలో గూడఁ గలరు.

(3) ఆల్బేనియనుభాష: ఇది గ్రీసు దేశోత్తరపు 'ఎపిరసు' ప్రాంత పర్వతములందును, మాంటిసీ గ్రోకు దక్షిణమునను, ఏడ్రియాటికునకుఁ దూర్పున మాట్లాడఁబడుచున్నది.

(4) స్లవోనిక్ భాషలు: ఈ భాషలను మాట్లాడువారు ఐరోపా ఖండ పూర్వభాగమునను, ఆసియా ఖండోత్తరభాగమునను వ్యాపించి యున్నారు. ఈ భాషలలో రషియా భాషా భేదములు, జెకోస్లోవేకియా, హంగేరీ, బొహీమియా మొదలగు దేశభాషలును, బాల్టిక్ భాషలు, లిథూనియన్, ప్రాచీనపరిషియన్ మొదలగునవి చేరును.

(5) ఇటలీశాఖ: 'లాటిన్' భాషయు దానికిఁ సంబంధించిన భాషలును.

(6) గ్రీకుశాఖ: గ్రీకుభాషయు దానికిం జెందిన మాండలికము ములును, డోరిక్, ఆటిక్ భాషలును.

(7) కెల్టిక్ భాషలు: వెల్షు, ఐర్లండు, స్కాట్లెండు దేశ భాషలు.

(8) జర్మానిక్ భాషలు: గాథిక్, నార్సు, జర్మనీ, హాలండు, బెల్జియం దేశభాషలును, ఇంగ్లీషు మొ॥నవి యీ శాఖలోఁ జేరును.

II. సెమిటిక్ భాషా కుటుంబము: అరేబియా, పర్షియా, పర్షియన్ గల్ఫు, ఎఱ్ఱసముద్రప్రాంత దేశములను, ఈజిప్టు మొదలగు ప్రదేశములందు వసించు జనులు సెమైటు లందురు. వారు మాట్లాడు భాషలు సెమిటిక్ భాషలు. ఇది నాలుగుదిక్కులను బట్టి భేదముగ నున్నది. తూర్పు సెమిటికుభాష బాబిలోనియా, ఎస్సీరియా దేశము లందును, పడమట సెమిటిక్ భాష, సిరియా, పాలస్టీను దేశములందును మాట్లాడఁబడును. దీనిలో ఫినీషయన్, హీబ్రూ మొ॥నవి చేరినవి.

దక్షిణపు సెమిటికు భాషలో ప్రాచీనపు టరబ్బీ భాష చేరును. ఉత్తరపు సెమిటిక్ భాషలో ఆర్మేయిక్ భాష చేరును.

III. ఫిన్నో - ఉగ్రీయన్ భాషాకుటుంబము: ఈ కుటుంబ భాషలకు నిండోయూరోపియన్ కుటుంబభాషలతో దూరసంబంధ మున్నది. ఈ భాషలను మాట్లాడువారు 'యూరల్' పర్వతోభయ పార్శ్వములందును, బాల్టిక్ పర్వతప్రాక్తీరమునను గలరు వీరు దేశ ద్రిమ్మరులు. 'ఫిన్' పదము ఫెన్ లెండు - రష్యాదేశజనులను సూచించును. ఎస్టోనియను గుంపులు, లాప్పులు, చెరిమిస్సులు, మార్ద్వినులు, పెర్మియనులు మొ॥ వారీ ఫిన్నుజాతికిం జెందినవారు. ఊరల్ పర్వత ప్రాంతదేశమునకు 'ఉగ్ర' యని పేరుండుటచే వీరు 'ఉగ్రి' యనుబడిరి. ఫిన్నో ఉగ్రియనులు సమష్టినామముతో వ్యవహరింపఁబడుదురు. ఈ భాషాకుటుంబమునందలి 'లాప్ భాష'ను మాట్లాడువారు నార్వే స్వీడను, ఫిన్లండు దేశోత్తరభాగములను, కోలాద్వీపకల్పమందును నివసింతురు. 2. బాల్టిక్ ఫిన్నిష్ భాషలు, 3. చెరిమిన్ భాష, 4. పెర్మియన్ భాష, 5. హంగేలియన్ భాష లిందులో చేరినవి.

IV. కాకిస్ భాషాకుటుంబము: ఇందలి భాషలు పర్వత ప్రాంతములందు వాడఁబడుచున్నవి. వీనిలో జార్జియన్, మింగ్రీలియన్, సర్కేసియన్, మొదలగు భాషలు చేరినవి.

V. చీనాభాషా కుటుంబము: ఇందు చీనాదేశ భాషలతోఁ పాటు బర్మా, సయాము, టిబెట్టు దేశభాషలు చేరినవి. ఇవి ప్రత్యయ రహితభాషలను మొదలైన విషయములు వెనుకనే తెలుపఁబడినవి.

VI. ముండాభాషలు: ఈ భాషలు చోటానాగపురపు వీర భూములందును, తత్ప్రాంతపు మద్రాసురాష్ట్ర, మధ్యపరగణాలభాగములందును, మహాదేవుకొండలందును కొలదిమందిచే మాత్రమే వాడఁబడును. ఖెర్వారీ, కొరవ, కూర్గుభాష లీకుటుంబములో చేరినవివి. సవర, గదబభాషలుగూడ వీనికిఁ జెందినవే. వీనిలోఁ జేరిన భాషలన్నియు సుమారు పర్వతములందే వాడఁబడుచున్నది.

**VII.** మలయో పొలినీషియాభాషా కుటుంబము : ఇందలి భాషలు మెడగాస్కరు నుండి 'ఈస్టరైలండు' వరకు వ్యాపించియున్నవి. వీనిలో నాల్గు శాఖలు గలవు. 1. ఇండోనేషియన్ తెగ. ఫిలిప్పైనులు, సెలబస్, మెడగాస్కరు, సుమత్రా, జావా దేశములలో వాడఁబడు భాషలు, 2. మెలనేషియన్ శాఖ : ఇవి ఫిజిదీవులలో విశేషముగా వాడఁబడుచున్నవి. 3 మైక్రోనేషియన్ శాఖ : ఇవి గిల్బరు, మార్షల్ కారొలైను, సూరియాన్సి, యూప్ ద్వీపములలో వాడఁబడును. 4. పోలినీషియన్ శాఖ : సొసైటీ, టోంగా, ఈస్టరు దీవులు, న్యూజిలాండు లోని మావోరిలో నీ శాఖా భాషలు వ్యవహరింపఁబడుచున్నవి.

**VIII.** ద్రావిడభాషా కుటుంబము : వీనిలో తమిళము, తెలుఁగు మలయాళము, కన్నడము, తుళు మొదలగు భాషలే కాక మరికొన్ని యనాగరిక భాషలు గూడఁ జేరినవి. ఇవి హిందూదేశమున వింధ్య పర్వతములకు దక్షిణమునందలి ద్వీపకల్పమున మాట్లాడఁబడుచుండి, యార్యభాషల కంటె భిన్నముగ నున్నవి.

**IX.** పాపువన్ భాషాకుటుంబము : న్యూగినీయందును, దాని సమీపస్థ ద్వీపములందును వాడఁబడు భాషలు.

**X.** ఆస్ట్రేలియా దేశభాషలు :- వీనికిని ముండాభాషలకును సంబంధము గలదట.

**XI.** సూడానిగనీ దేశభాషలు : ఆఫ్రికాలో నుత్తరమున నీగ్రోలచే వాడఁబడు హౌసాభాష.

**XII.** బంటుభాషా కుటుంబము: ఇవి దక్షిణ ఆఫ్రికాలో నైజీరియా నుండి కేప్ ఆఫ్ గుడ్‌హోప్ వరకున్న జనులచే మాట్లాడఁబడుచున్నవి.

**XIII.** బుష్మెన్, హాట్టెన్‌టాట్ భాషలు : దక్షిణాఫ్రికాలో బుష్మెన్ భాషలును, నైఋతి యాఫ్రికాలో హాట్టెన్‌టాట్ భాషలును వాడఁబడుచున్నవి.

**XIV.** అమెరికా యందలి ప్రాచీనాదిమవాసుల భాషలు.

# నాల్గవ ప్రకరణము

## భాషాపరివర్తనము

ప్రతిమానవునకు వలె ప్రతిభాషకుఁగూడ పుట్టుక, యభివృద్ధి, మార్పు, క్షీణము, క్షయము ననునవి కలవు. కాని మానవుని యాయుః కాలముకంటె భాషయొక్క యాయుఃకాల మత్యధికమగుటచే దాని వృద్ధి పరిణామక్షయములు సూక్ష్మపరిశీలన లేక కనపడవు. కాన మానవునకు వలె భాషకుఁ గూడ జీవితచరిత్ర గలదు.

మానవులు దమ మనోగత భావముల నితరులకుఁ దెలియునటులు వాగ్రూపమున వ్యక్తీకరింపఁబడిన గుర్తులే భాషయనఁబడును. 'ఆవు' అని పలికినపుడు నాలుగుకాళ్లు, రెండుచెవులు, కొమ్ములు మొదలైనవి గలిగిన యొక యాకారముగల జంతువును మనస్సున నేర్పరుచుకొని, యా జంతువునకు గుర్తుగా తోడిమానవునకు స్పష్టముగాఁ దెలియుటకు చేయు వాగ్రూపమైన గుర్తు. ఆ శబ్దమునకు లక్ష్యము మఱి యే యితరరాకారముగల వస్తువును కారాదు. ఈ శబ్దము లుచ్చరించునపుడు మనోగత భావమును, కంఠము, జిహ్వ, తాలువు, దంతములు మొదలైన శరీరావయవములు నుపయోగపడును. కాన భాషోచ్చారణమందు మానసికచర్యలును, శరీరావయవ వ్యాపారమును కలసిమెలసి వ్యవహరించుచున్న వనుమాట స్పష్టము. ఈ రెంటిలో దేని సహకారము లేక పోయినను భాష యేర్పడదు. శరీరావయవ చేష్టలు లేని భావవ్యక్తీకరణ ముండదు. అవి మూగవాని ధ్వనులగును. ఇఁక మానసిక వ్యాపారము లేని భావశూన్యములైన మాటలు పిచ్చివాని మాటలగును. కాన భాషకు మానసిక శరీరావయవ చేష్టా పరస్పర సాహాయ్యము ముఖ్యముగా నుండి తీరవలయును.

అనేక కారణములచేత నిత్యవ్యవహారమున నున్న ప్రతి జీవద్భాషయు మారుచుండును. మార్పునొందుట భాషలకు స్వభావము.

మార్పును వృద్ధియు, మానవునియందువలె, భాషయందు నుండును. ఈ మార్పు లా భాషను మాట్లాడినవారికిఁ గూడఁ దెలియవు. ప్రాచీన నవీన భాషల మధ్యకాల మధికమైన కొలఁది యీ మార్పు స్పష్టముగా గోచరించును. మార్పును, వృద్ధియు భాషకు ప్రాణము వంటివి. నిత్య వ్యవహారములోనుండి, మార్పుచెందక ప్రపంచమున యే భాషయు నుండజాలదు. 'నిత్యా ప్రవహినీ దేశ్యా'. దేశభాష నదీప్రవాహమువలె నిత్యము నుండునదియు, నిత్యము ప్రాతనీరును త్రోసివేసి క్రొత్తనీరును దెచ్చునదై యుండును. మనుష్యులభావములు నిత్యము మారుచుండుటచే, తద్భావవ్యక్తీకరణమే యగు భాషగూడ తప్పక మారుచుండును. వాఙ్మయకోశమునందు కొన్ని ధాతువులు కాలక్రమమున నూతనచైతన్యమును సంపాదించుకొనుచుండును. మఱికొన్ని ధాతువులు దుర్బలములగుచుండును. ఈ మార్పులచే శరీరములోని వాఙ్మయకోశము తారుమారగుచుండును. అందుచే భాషలలోఁగూడ మార్పేర్పడుచుండును. జీవద్భాషలోఁ గొన్ని ప్రాచీనశబ్దములు నిత్యవ్యవహారము నుండి తొలఁగిపోవుచుండును, కొన్ని క్రొత్తవి చేరుచుండును. తొలఁగిపోయిన వానికి ఉదా:-నావుడు, అనవుడు మొ॥ క్రొత్తగా చేరిన వానికి ఉదా:- అన్యభాషాపదములు మొ॥. సంస్కృతభాషలో యాస్కుఁడు, శాకటాయనుఁడు, శాకల్యుఁడు మొదలైన వైయాకరణులు సంస్కరించిన శబ్దములలోఁ గొన్ని వేలశబ్దములను, తర్వాత వచ్చిన పాణిన్యాచార్యులవారు తొలఁగించి, కొన్ని నూత్నశబ్దముల సాధుత్వమును నిరూపించిరి. పాణినికి తర్వాత కాత్యాయనుఁడు, పాణిని యష్టాధ్యాయికి వార్తికము వ్రాయుచు, నొకవేయిశబ్దములు ప్రాచీనములని కొట్టివేసి నూత్నశబ్దములను జేర్చినాఁడు ఇట్లే తర్వాత వచ్చిన పతంజలిమహర్షి తన వ్యాకరణభాష్యమందును జేసినాఁడు. మఱియు వేదసంహితలో నున్న సంస్కృతభాషకు, బ్రాహ్మణములలోను బురాణములలోను నాటక కావ్యాదులలో నున్న భాషకును పరస్పరము ఛాలభేద మున్నది. నన్నయకాలమునాఁటి తెలుఁగునకును, తిక్కనకాలమునాఁటి తెనుఁగునకు చాలభేదము గనఁబడుచున్నది. నన్నయ 'చేసినవాఁడ'ని ప్రయో

గింపఁగా, తిక్కన 'చేసినాఁడ'ని వాఁడెను. తర్వాత నది 'చేశాఁడు'అని వ్యావహారిక భాషలో మారినది. నన్నయ 'చేసినయది'యని వాడఁగా, తిక్కన 'చేసినది'అని వాడెను. తర్వాత నది 'చేసింది'అని వ్యావహారిక భాషలో మార్పు చెందినది. నన్నయ 'ఏమి యంటివ'ని యుపయోగింపగా, తిక్కన 'ఏమంటి'వనెను. ఇందుచే భాష యెప్పుడును మారుచుండు ననుట స్పష్టము.

పసిపాపలు మాటలు నేర్చుకొనునపు డా యింటిలో తల్లి, దండ్రి, యన్నలు మొదలైన పెద్దవాళ్లు మాట్లాడిన మాటలను వినియే ధ్వనుల ననుకరించుదురు. ఆ ధ్వను లా పసివాని మనస్సులో ముద్రితమై యొక ధ్వనిచిత్రము (Sound-picture)వలె నేర్పడును. ఎంత యధికముగా నా ధ్వని వినిన నంతయధికముగా నా ధ్వనిచిత్ర మా పసివాని మనస్సుపైఁ బడి, గాఢమై, స్థిరపడును కాని యా శబ్ద మెవరో యొక్కరే మాత్ర ముచ్చరించుచుండిన నొకేవిధమైన ధ్వనిచిత్ర మా పసిపాప మనస్సున ముద్రితమగును. కాని యా యింటిలో పలువురు పెద్ద లా పదము నుచ్చరించునపుడు పాప వినుటచే, ధ్వనిచిత్రములో మార్పులు గలిగి వైవిధ్యముతో ముద్రితమై కలతపాఱును. కాని యుచ్చారణలలోని సగటుచ్చారణము (average articulation) మాత్రమే యా పసివాఁడు గ్రహించి యనుకరింప మొదలుపెట్టును. ఆ యనుకరణములో కలతపాటిన ధ్వనిచిత్రమునుండి వివిధరూపముల నాతఁ డుచ్చరించును. ఉదా : చిత్రములో 'తాతా' యనుటకు 'ఆతా, డాడా, దాదా' మొదలైన రీతిగ పలుకును. ఇక్కడ యుచ్చారణలోను, వ్యక్తీకరణమునను మార్పున్నను ముద్రితధ్వనిలో మార్పు లేదు. ఇక్క డే స్వరపరివర్తనము (phonetic change) ప్రారంభమగును. దీనికిఁ గారణము లివి. 1. పసివాని మనోగత ధ్వనిచిత్రములో వైవిధ్య మేర్పడుట 2. అతని వాగింద్రియము బాగుగా పరిపక్వమునకు రాకపోవుట, 3. అతని శ్రవణేంద్రియము యథాతథముగా గ్రహించు శక్తిలేక సుకుమారముగ నుండుట. పసివాఁడు క్రమముగా పెరిగి పెద్దవాఁడైన పిదప నాతని వాక్ శ్రవణేంద్రియములు పుష్టిగా నభివృద్ధి చెందుటచే తప్పు లేకుండ శబ్దముల

ననుకరింప సమర్థుఁడగును. కాని యే యిద్దరుమనుష్యుల యుచ్చారణము నైన నొకటే విధముగ నుండదు అన్నదమ్ముల యుచ్చారణమునఁగూడ గొంతభేద ముండక పోదు. ఇందుచే వివిధకులముల వారిలోను, స్త్రీ పురుషులలోను,విదేశీయులలో నుచ్చారణ భేదముండుటలో నాశ్చర్య ముండదు.

జనులలో భేదోచ్చారణము ప్రాచీనసంఘములో గ్రామములలో నున్నపుడు గ్రామపెద్దలచే నది వెక్కిరింపఁబడి దద్దబడి చాలవరకు యరికట్టఁబడును. కాని మహాసంఘములో వాని నరికట్టుట సాధ్యము గాదు. అందుచే నొక క్రొత్తయుచ్చారణ యొకప్పుడు సంఘనాయకుని లేదా మహాకవి ప్రభావముచే ప్రచారమొంది పూర్ణగ్రామము, మండలమును వ్యాపించును అందుచే భాషాధ్వనిపరివర్తన మంటువ్యాధివలె శీఘ్రముగా వ్యాపించి ప్రచార మొందును. ఇట్లు నూతనధ్వని ప్రజలను వశ్యము చేసికొనును.

అయితే భాషాపరివర్తనమునకు ముఖ్యకారణము లేవి యను ప్రశ్న తర్వాతిది. భాషాభ్యాస మనుకరణ మూలమున జరుగునని వెనుక గ్రహించితిమి కదా. ఆ యనుకరణలోని దోషములు. 1. శ్రవణేంద్రియ దోషము చేత భాషాభ్యాసకులు తప్పుగా విని దుష్టముగా నుచ్చరింప వచ్చును. 2. లేదా, వాగింద్రియ దోషముచేత తప్పు గానుచ్చరింప వచ్చును. ఇది బ్రాహ్మణ, వైశ్య, శూద్ర పంచముల యుచ్చారణలందు స్పష్టముగా గాన నగును. 3. అన్యభాషలతోడి సంపర్కము వలన నితర భాషోచ్చారణక్రమము సంక్రమించును. ద్రావిడుల మూర్ధన్య తాలవ్యవర్ణోచ్చారణముల నార్యులు గ్రహించిరి. అక్షర సమామ్నాయ ముభయులకును వేరువేరుగా నున్నవి. ద్రావిడులు పద మధ్యమున పరుషముల నుచ్చరించుటగాని, పదాదిని సరళములను వాడుట గాని చేయరు. అందుచే వారు సంస్కృతపదమైన 'దంతము'ను 'తందము'గా నుచ్చరింతురు. 4. ఒకభాష మాట్లాడువా రితరదేశములకు వలసపోయినపుడు, తమ పూర్వులతో నిత్యవ్యవహార ముండమిచే రెండుసంఘములవార భాషలును సంకరముగ మారి యొకరి భాషా పదముల నింకొక రెరువు తీసికొని, యే భాష కా భాష గుర్తుపట్టులే

నంతగా మార్పుచెందును ఈ వలన దేశములు నదీపర్వతములచే వేరు చేయఁబడిన యెడల నవి క్రమముగా నిత్యవ్యవహారమునుండి తగ్గిపోయి భిన్న భాషలుగా పరిణమించును. ఉదా :- ప్రాకృతభాషలు. ఆర్య ద్రావిడ జాతిభాషల సంపర్కఫలితముగా నేర్పడిన మిశ్రభాష లివి. వానిలో భేదములు వివిధమండలములలో క్రమముగా పరిణమించి వృద్ధి పొందినవి. అవియే మహారాష్ట్రి, శౌరసేని, మాగధీత్యాదులు. 5. భాషలమార్పునకు దేశముయొక్క శీతోష్ణస్థితికూడ కారణమగు చున్నది. మిక్కిలి శీతలదేశవాసులు నోరును విశాలముగా తెఱచి యుచ్చరింపలేరు. ఇందుచే జర్మానిక్ భాషలయందు 'ఆ' కారమునకు 'ఓ' కార ముపయోగింపఁబడును. (Introduction to the Natural History of languages by T G. Tucker. pp 296-297) 6 ఉనికి (accent) వలన సర్వములో మార్పుగలిగి తన్మూలమున భాష మారును. ఒకానొక పదములో నొక వర్ణముపై నూనిక పెట్టుటచే నితరవర్ణములు తేల్చి పలుకఁబడును. తత్ఫలితముగా తత్పూర్వవర్ణము బలహీన మగుటయు తత్పరవర్ణము లోపించుటయు జరుగును. ఉదా: Verner's law. 7. శబ్దసాదృశ్యముచే (analogy) మార్పులు భాషలందు ప్రవేశించును. 'ద్వాదశ' శబ్దసాదృశ్యమున 'ఏకాదశి' పదమును, వర్షాకాల శబ్దమును బట్టి 'వానాకాలము, ఎండాకాలము' అని దీర్ఘముగా నుచ్చరించుటయు సాదృశ్యజనితదోషము. (8) సామాన్యముగా మానవుఁడలసత చేత, నుచ్చారణసౌలభ్యముకొఱకు కొన్ని కఠినవర్ణముల స్థానమున సరళవర్ణముల చేర్చి మార్పుల భాషలో ప్రవేశింపఁజేయును. అప్పుడు పదములలో వర్ణాగమ, వర్ణలోప, వర్ణవిపర్యయములు గలుగును. ఉదా :- 'ఇంతవరకు' అనుటకు 'ఇందనుక' యనియు, 'ప్రాఁత 'యనుటకు 'ప్రా' యనియు వాడుట మొదలైనవి. 9. ఇట్టి మార్పులు చెందిన పదములు రానురాను రూపాంతరములుగ పరిణమించుచున్నవి. కాని దూరదేశములతో వార్తాపత్రికలు, వర్తకము, ప్రయాణము మొదలైన రూపమున నిత్యవ్యవహారము ందున్నట్లయిన భాషలు త్వరగా మారవు.

భాష వ్యవహారమందు మాత్రమే యుండి, లిఖితరూపము దాల్ప నపు డది త్వరగా మార్పులు చెందుచుండును. లిఖితస్థితిలోఁ గూడ మార్పుచెందుటే భాషా ముఖ్యలక్షణము. సాహితీగౌరవమును పొందిన తర్వాతఁ గూడ భాష మారుచునే యుండును కాని యప్పు డది వ్యవహారములో మాత్రమే యున్నపుడు మారినంత త్వరితముగా మారదు. కాన భాష యెప్పుడును మారుచుండు ననుట తథ్యము. ఏ భాషలోనైనను గొన్ని వ్యక్తిగత విలక్షణోచ్చారణములు, నిరుద్ధ శక్తులచే గాని, లేక యా సంఘములోఁ దగినంత మంది గ్రహింపలేక పోవుటచేత గాని, కొంతకాలమునకు మాయ మగును. అట్లే కొన్ని విపరీతకారణములచేఁ గొన్ని విలక్షణోచ్చారణములు బహుళప్రభావ మొంది సంఘములో నాటుకొని పోవును. కాని యొకానొక యుచ్చా రణపద్ధతి ప్రచారములోనికి బాగుగ వచ్చినపు డది యా సంఘము నంతయు వ్యాపించును. కొంతకాలమున కది యా మాండలిక విశేష ముగ పరిణమించును. ఒక మాటలో, ఏ భాషలోని మార్పు లొక నియమబద్ధములుగ నుండునని విశ్వసింపఁ బడుచున్నది. ఆ నియమములు శాస్త్రదృష్టితో ధర్మము (laws) లని పిలుపఁబడును. ఒక భాషలోని ధర్మము లితరభాషలలోఁ గూడఁ గానుపించినచో నా ధర్మము లు విశ్వ సమన్వయము గలవిగా భావింపఁబడును. ఇందుచే భాష కొక శాస్త్రము గలదని నిర్ధారణ యగుచున్నది.

ఉచ్చారణధ్వనులందలి మార్పులలో నంతర్వ్యాపినిగా నుండు నియమధర్మము లన్నిభాషలందు నన్నికాలములందుఁ గూడ సమా నమే. కాని వాని సమన్వయములలో నొకభాషకు వేరొక భాషకుఁ గొంత తారతమ్యముండ వచ్చును గాని, లక్షణములో మాత్రము భేద ముండదు.

సామాన్యముగ భాష నాలుగు మార్గములలో మారుచుండును. అందులో 1. శబ్దమందలి ధ్వనులలో మార్పు గలుగుట. ఇందర్థమున నేమాత్రము మార్పురాదు. దీనినే (phonetic change) అందురు. ఇది శబ్దధ్వని పరివర్తనము 2. శబ్దస్వరూపమున, ప్రత్యయములలో చెందు

మార్పు. దీనిని (formatic change) అందురు. ఇది శబ్దస్వరూప పరివర్తనము. 3. శబ్దస్వరూప మెుక్కటే యైనను, నర్థమున మార్పు చెందుట. దీనినే (Semantics) అందురు. ఇది శబ్దార్థపరివర్తనము. 4. కారకములో మార్పు చెందుట. (Change in Syntax)

I. స్వరపరివర్తనము (phonetic change) —ఇంక ధ్వని పరివర్తనములోఁ గూడ రెండువిధములు గలవు. ఒకటి నియమరహిత పరివర్తనము (unconditional change), రెండవది నియమసహిత పరివర్తనము (Conditional change).

1. నియమరహిత పరివర్తనములో పరిసర వర్ణప్రభావము లేక స్వతంత్రముగానే మార్పు జరుగును. ఉదా: (a) పాలు-హాలు (కన్న);

(b) బాల - వాల (బ, వల యభేదత్వము ; వీర - బీర.

cff "లళయో ర్లడయో స్తద్వత్, జయయో ర్వబయో స్తదా,

రలయోర్న ణయోశ్చాంతే సవిసర్గావిసర్గయోః॥

సబిందుకాబిందుకయోః స్యా దభేదేన కల్పనం॥

(Refer to నంజ ... క్తక ... by ఘ ... ర్థి కవిచక్రవర్తి of Mysore.)

(c) సంస్కృతమందలి 'అ' కార మితర ఇండోజర్మానిక్ భాషలలో 'ఇ, ఎ' కారము లగును. ఉదా :- భరామి (సం) - భెరో (లాటిన్) ; అహం (సం) - ఇగో (లాటిన్) ; అస్తి (సం) - ఎస్టి (లాటి)

(d) ఇంక ద్రావిడభాషలలో తమిళభాషలో పదాంత 'ఐ'కారము తెలుఁగున 'అ' కారముగను, కన్నడమున 'ఎ' కారముగను మారును.

| తమిళము | మలయాళము | తెలుఁగు | కన్నడము | తుళు |
|---|---|---|---|---|
| తలై | తల | తల | తలె | తలె |
| మలై | మల | మల | మలె | మలె |
| వలై | వల | వల | బలె | బలె |

2. నియమసహిత పరివర్తనము శబ్దమందలి పరిసరవర్ణప్రభావమువలనఁ గలుగును.

నియమసహిత పరివర్తనమున (Conditional phonetic change) అనేకవిధము లున్నవి. అవి వర్ణాగమ, వర్ణలోప, వర్ణవ్యత్యయముల వలనఁ గలుగును.

ఈ క్రింది లక్షణము లేభాషలో మార్పులనైనను సామాన్యముగా ప్రతిపాదించును.

1. వర్ణ సామీప్యాకరణము (Assimilation) :- రెండు భిన్నవర్ణములు చేరినపుడు మొదటివర్ణము రెండవ వర్ణమును గాని, లేక, రెండవ వర్ణము మొదటి దానిని గాని తన బలముచేత నావర్ణములోనికిఁ గాని, దానికి సమానమగు వర్ణములోనికిఁ గాని మార్చును. రెండు భిన్న వర్ణముల నుచ్చరించుటకంటె సమానవర్ణముల నుచ్చరించుట సులభమగును కాన, నీ మార్పు సుఖాకాంక్షకై గలుగుచున్నది. (i) వీనిలో పూర్వవర్ణ ముత్తరవర్ణమును మార్చుట పురోగమన వర్ణసామీప్యాకరణ (progressive assimilation) మనఁబడును. ఉదా :- అగ్ని = అగ్గి; అమ్బు - అమ్ము; మొగర = మొగ్గ, కొడవలి = కొడ్వలి = గొడ్డలి; తృనోతి = తృణోతి, (రషాభ్యాం నోణః సమానపదే); వజ్ర = వజ్జ; వలన = వల్న = వల్ల మొ.

(ii) ఇఁక నుత్తరవర్ణము తన యాకర్షణబలముచే పూర్వవర్ణమును మార్చినచో తిర్యగ్గమన వర్ణసామీప్యాకరణ (regressive assimilation) మనఁబడును. ఉదా :-కొలది = కొల్ది = కొద్ది; వలదు= వల్దు = వద్దు; కలదు = కల్దు = కద్దు; వర్చు = వచ్చు; చొర్ + చు = చొచ్చు; పెండిలి = పెండ్లి = పెల్లి; వెడలు = వెళ్లు; నగవు= నవ్వు. సంస్కృతభాషా సంధికార్యములు చాలవర కీ మార్పులోనివై యుండును. ఉదా :- అద్ + న = అన్న; భిద్ + న = భిన్న; విద్యుత్ +జిహ్వా=విద్యుజ్జిహ్వా (ప్రాకృతభాషలలో నిట్టివర్ణ విపరిణామము విశేషముగా జరుగుచుండును. ఆ భాషలలో సంయుక్తాక్షరములు నిలువవు గాన వానిలో మొదటిది కాని, రెండవది కాని మిగిలిన దాని లోనికి మారి దిత్వమేర్పడును. ఉదా :-

| | | |
|---|---|---|
| సం. — | చక్ర — | సార్థ |
| ప్రా. — | చక్క — | సత్థ |

2. వర్ణవిభేదము (Dissimilation) :- వర్ణసామీప్యాకరణమునకు వ్యతిరేకముగ రెండు సమానవర్ణములు సమీపించినపుడు వానిలో నొకటి (యుచ్చారణ సౌకర్యార్థము) వేరొక వర్ణములోనికి మారును. ఉదా :- (సం.) పురుష - (ప్రా.) పురిస ; చూచు + ఇంచు = చూపించు ; బాలులు=బాలురు ; (Lat) Cerebrum = Celebrum ; (సం.) స్థా=తస్థా= తిష్ఠతి ద్విర్భావము (reduplication of conjuncts) న నిది వచ్చును.

3. వర్ణవ్యత్యయము, లేక, విపర్యయము (Metathesis) :- ఉచ్చరించుటలో గాని, వ్రాతలోఁ గాని, పదములో పూర్వవర్ణమును గాని, స్వరమును గాని తర్వాతను, తర్వాత దానిని ముందుగను మార్పు చేయుట త్వరితము వలన సామాన్యముగ జరుగును. ఉదా :- వారణాసి = వాణారసి ; నవ్వులాట = నవ్వుటాల ; పారువము = పావురము; మరకతము=మకరతము ; అవన్=వాఁడు ; ఉల్=లో ; ఉరల్=రోలు ; ఎలనగవు = లేనగవు ; ఎరక - రెక్క ; కొప్పాల్ (తమి) = పొక్కిలి (తెలుఁగు) = పొక్కుల్ (కన్నడ).

4. వర్ణలోపము (Hoplology) :- రెండుమాటలు కలసినపుడు మొదటిమాట చివరి యక్షరమును, రెండవమాట మొదటివర్ణము నొకటే యైనచో నందొక వర్ణము లోపించుట. ఇది కూడ త్వరితమువలననే జరుగును ఉదా :- ఆక + కట్టు = ఆకట్టు ; కన్ను + నీరు = కన్నీరు; చొప్పు + పరచు = చొప్పరచు ; చిక్కు + కోల = చిక్కోల ; నిప్పు+పెట్టె=నిప్పెట్టె ; కంచు+ చెంబు +కంచెంబు ; పెద్ద + తండ్రి = పెత్తండ్రి; పేవ + బెత్తము=పేబెత్తము; పూవు + విల్కాడు=పూవిల్కాడు; పెద్ద + తనము = పెత్తనము ; శేవ వృధః = శేవృధః ; శష్పపింజరః= శష్పింజరః ; జహీహి = జహి; కోప + పడు = కోప్పడు ; విసుకు కొను = విసుక్కొను ; అరవ + వాళ్లు = అరవాళ్లు ; వీలు + లేదు వీల్లేదు ; ఇట్టివి వ్యావహారిక భాషలో విశేషముగ గనఁబడును.

5. అజ్లోపము (Syncopation) : పదమధ్యగతమైన అచ్చు లోపించుట. ఇది స్వరభక్తి (Anaptyzis) కి వ్యతిరేకము. ఉదా :

అదురుచు=అద్రుచు ; కొలది=కొల్ది ; అలుక=అల్క ; చిలుక=చల్క ; మొలక=మొల్క. ఈ అజ్లోప మొకప్పుడు వర్ణసామ్యీకరణమునకు తీయును. ఉదా: కొలది=కొల్ది=కొద్ది ; మొలక=మొల్క=మొక్క.

(6) స్వరభక్తి లేక విప్రకర్షము (Anptyxis): సంయుక్తాక్షరము మధ్యనొక యచ్చుచేరుట. ఇది యుచ్చారణ సౌలభ్యమునకు వీలగును. ఇది సామాన్యముగా రేఫ ల కారములకు గాని, యనునాసికాక్షరము లకుఁ గాని తర్వాత వచ్చుచుండును. సంయుక్తాక్షరము లుచ్చరించుట కష్టము గాన వానిమధ్య నొక యచ్చును జేర్చి, వానిని విడదీసి యుచ్చరించుట సులభముగ నుండును, ఉదా: ఇంద్ర=ఇందిర ; యజ్ఞ=యజన ; స్వర్ణ=సువర్ణ ; పృథ్వీ=పృథివి, పుడమి, (ప్రా)పుడవి ; దర్శన=దరశన ; కూర్పు=కూరుపు ; సాంబ్రాణి=సాంబరాణి ; చేద్గు=చెయిది మొ॥ ఇది ప్రాకృతభాషలలోను, తమిళభాషలోను విశేషముగా వ్యాప్తిచెందినది. సంస్కృతపదములను ప్రాకృత తమిళభాషలలోనికిఁ దెచ్చుకొను నపు డిది చాల యుపయోగపడును. ఉదా: రత్నం=అరతనం.

(7) ప్రారంభ స్వరాగమము (prothesis): ర, ల, స వర్ణము లతో ప్రారంభించిన పదముల నుచ్చరించుటకుఁ బూర్వమం దొక యచ్చు చేర్పఁబడును. ఇదికూడ నుచ్చారణ సౌలభ్యమునకుఁగాను కలుపఁబడును. ఉదా: స్కూలు=ఇస్కూలు ; ర, ల, ల తో ప్రారంభించు శబ్దములు తమిళభాషలో నుండవుగాన, నట్టి పదముల నితరభాషలనుండి యెరువు దెచ్చుకొను నప్పుడు దీని ప్రయోగము విశేషముగ నుండును. ఉదా: రాజన్ (సం)=ఇరాయన్ (త) ; అరసన్(క)=ఱేడు(తె) ; లోకం (సం)= ఉలగం (తం); రత్న (సం)=అరతనం (త); రక్త (సం)=అరత్తం; రవ (సం) =అరవము ; రేయి (తె)=ఈర (త) ; రెండు (తె)=ఇరండు (త) ; రోలు (తె)=ఉరల్ (త) ; లావు (తె)=అలవు (త) ; లేత (తె)=ఇళం (త) ; రెక్క (తె)=ఇరెక్కై (త). ఇవి వర్ణవ్యత్యయము (metathesis) క్రింద కూడఁ జేరును.

(8) ప్రారంభాజ్లోపము (Aphesis) : పదములోని ప్రారంభాచ్చు లోపించుట. ఉదా : ఒరపిడి=రాపిడి ;

(9) ప్రారంభవర్ణలోపము Aphaeresis) : హల్లుపోవుటకు ఉదా : చిగురు=ఇగురు ; పంపెను=అంపెను ; పూను=ఊను ; పి త్తడి (తమి)= ఇత్తడి(తె) ; కురియు=ఉరియు ; (పంపు-పంపకము=అంపు-అంపకము) ; పొందు=ఒందు ; పొందిక=ఒద్దిక ; పంపుము=అంపుము ; హితవు=ఇతవు పగులు=అగులు. 'ప' కారముతో ప్రారంభించు పదములలో నిది విశేష ముగ గానవగును. మఱియు సంయుక్త రకారము ప్రారంభమందున్న పదములలో, వర్ణవ్యత్యయము (Metathesis) మూలమున, ప్రారంభ సంయుక్త ర కారమందలి 'ర' కారము లోపించును. ఉదా : ప్రాత= పాత ; క్రొత్త=కొత్త ; ప్రాత=పార్త; పాత; క్రొత్త=కొర్త్త-కొత్త

| | | | |
|---|---|---|---|
| మ్రాను=మాను | (త) మరం | త్రొక్కు=తొక్కు | క్రొవ్వు=కొవ్వు |
| వ్రేలు=వేలు | ,, విరల్ | గ్రుద్దు=గుద్దు | ప్రత్తి=పత్తి |
| క్రింద=కింద | | క్రుంగు=కుంగు | ప్రుచ్చు=పుచ్చు |
| మ్రోగు=మోగు | | క్రుళ్లు=కుళ్లు | మ్రింగు=మింగు |
| బ్రతుకు=బతుకు | | ప్రేలు=పేలు | ప్రొద్దు=పొద్దు |
| ప్రేము=పేము | | వ్రాలు=వాలు | త్రవ్వు=తవ్వు |

(10) పరిహారదీర్ఘము (compensatary lengthening) : ఒక పద ములో నొక వర్ణము లోపింపఁగా, దాని పూర్వవర్ణము దీర్ఘమగును. ఉదా : మొగము=మోము ; గుఱ్ఱములు=గుఱ్ఱాలు ; చందమున= చందాన ; దనుక=దాక ; ఉబుసు=ఊసు ; కుబుసము=కూసము ; అక్కడ=ఆడ ; ఇయ్యకొను=ఈకొను ; సగము=సాము ; చుట్టములు= చుట్టాలు=చుట్టలు ; (భార-శల్య) ; మీసములు=మీసాలు=మీసలు (భాగ) ; (దీర్ఘము హ్రస్వమగును).

(11) అనుచిత పదవిభాగము (Helophrasis) : పదప్రత్యయ విభా గమును తప్పుగా చేయుటవలన నా పదములలో మార్పుగల్గును. ఉదా:

| | ఒప్పు | తప్పు |
|---|---|---|
| ఈగలు | ఈ+గలు | ఈగ+లు |
| ఏనుగలు | ఏను+గలు | ఏనుగ+లు |
| చిలుకలు | చిలి+కలు | చిలుక+లు |
| ఎలికలు | ఎలి+కలు | ఎలిక+లు |

తమిళ కన్నడ భాషలలో బహువచన ప్రత్యయము 'గళు'. 'ప్రాతిపదికకు' గళ్ గలిపిన రూపమునకు 'లు' మాత్రమె బహువచన ప్రత్యయమని తెలుగువారు. తప్పుగా భావించుటచే, ననుచిత విభాగముచేసి, ప్రాతిపదికలో'గ' కారమును గూడఁ జేర్పవలసిన వారైరి.

(12) అచ్చుల పరస్పరాకర్షణము (Harmonic sequence of Vowels): ఒకే పదములోని యొకవర్ణముమీఁది యచ్చు తరువాత వర్ణముమీఁది యచ్చు నాకర్షించి, దానితో సామరస్యము నొందుట. ఉదా: పడికిలి+లు=పిడికిళులు; తొమిది+లు=తొమ్మిదులు; తొలి కారు=తొలికరి=తొలకరి; ఎలి+కల్=ఎలికలు=ఎలకలు (బహు), ఎలిక=ఎలక (ఏ); నిల్=నిలుచు=నిలిచి=నిలవ; కలు+ఇంచు=కలుగించు= కలిగించు; రామునకు=రామునికి.

(13) సంప్రసారణము (Ablout or vowel gradation): అజ్ఝ్ పరిణామము: పదములో 'య' వర్ణము 'ఇ' కారముగను, 'వ' వర్ణము 'ఉ' వర్ణముగామారుట. మఱియు 'అయ'='ఎ'గను, 'అవ'='ఒ'గను మారుట ఉదా: తిర్యక్షి=త్రియక్షి=తిరిచ్చ (ప్రాకృ); త్వరిత=తొరిద; కథయతు=కథేసు(ప్రా); అవతార=ఓతార(ప్రా); నవమాలికా=ణోమా లియ (ప్రా); లవణ=లోణ (ప్రా); భవతి=భోది(ప్రా); వద్ద=ఒద్ద; వయ్యారము=ఒయ్యారము; వడ్డాణము=ఒడ్డాణము మఱియు గుణ వృద్ధులుగూడ నిందుచేరును. ఉదా: ఇ-ఎ-ఐ; ఉ-ఓ-ఔ.

(14) (Epenthesis): పదములోని 'అరియ, అర్య' వర్ణములు 'రెయ'గ మారును. ఉదా: పర్యంత=పెరెంత (ప్రా); ఆశ్చర్య=

అచ్చరియ (ప్రా)=అచ్చెర ; కన్య=కన్నియ=కన్నె ; కళ్యము=కళ్లియము=కళ్లెము ; గొళ్యము=గొల్లియము=గొల్లెము.

(15) అనునాసిక్యము (Nasalisation) : చుకారాంతధాతువులును, 'ల్లు' అంతమందు కల ధాతువులు నొకప్పుడు నాసిక్యముచెంది 'ంచు' రూపము నొందును. ఉదా : చొప్పరచు=చొప్పరించు ; సవరుచు=సవరించు ; తత్తడిల్లు=తత్తడించు ; వర్తిల్లు=వర్తించు ; వినుచు=వినిచెను=వినుపించు వినిపించెను. మొ.

మఱియు హ్రస్వపూర్వక సిద్ధార్థానుస్వారము గల పదము వైకల్పికముగా పూర్ణానుస్వార మగును. ఉదా అఁట=అంట ; ఇఁక=ఇంక ; మరికొన్ని పదములలో : బెడకు=బెణకు , అడగు=అణగు ; వనబు=వనము వనంబు.

(16) శ్వాసత - నాదత (Unvoicing & voicing) : పరుషములకు సరళములు వచ్చుట : ద్రుతముమీదను, ప్రథమాంతకళలపైన, ద్వంద్వసమాసమున పరుషములకు సరళములు వచ్చును. ఉదా : పూచెన్+కలువలు=పూచెఁగలువలు ; వాడు+కనియె=వాడుగనియె ; అన్న+తమ్ములు=అన్నదములు. మఱియు తమిళభాషలో పరుషసరళములకు ప్రత్యేక వర్ణములులేవు. పదాదిని, పదమధ్య ద్విత్వమునకు పరుషోచ్చారణమును, పదమధ్యమున సరళోచ్చారణము మాత్రమే యుండును.

## స్వరధర్మములు (PHONETIC LAWS)

శబ్దములోఁగలుగు మార్పులకుఁ గారణములు వెనుక విచారింపఁబడినది. ఏ దేశమందు, నే జాతియందు, నే కాలమందును నొకేవిధమైన సక్రమోచ్చారణ మా భాషాధ్వనులలో మండదనుట స్పష్టము. కాని యే దేనొ కానొక కాలమున నొక ప్రామాణికోచ్చారణము నిఘంటువులలో నిర్దేశింపఁబడిన ప్రకార మున్నదని మన మంగీకరింపవచ్చును.అయినను నొకతరములోని ప్రామాణికభాష, యింకొక తరములో ప్రామాణికత్వ

యుండుట లేదు. ధ్వనిపరివర్తన మొకప్పుడు నశించిపోవచ్చు. మరి యొకప్పు డొకమండలము గాని, లేక భాషనంతయు గాని వ్యాపించి, జయముపొందవచ్చును. కాన నా ధ్వనిపరివర్తన మా మండలమునకుఁ గాని, లేక, భాషకంతకుఁ గాని 'నియమసూత్రే'మగును. ఇఁక నీ మార్పుల కేమైన క్రమము, నియమము గలదా యని తర్వాత విచారణ. ఈ విషయమును స్పష్టపఱచుట కొక యుదాహరణను గ్రహింతము. ప్రథమ (సం.)- (first) ఫర్స్టు-పహిలా (మరాటి), అను మూఁడుపదములందును ప్రథమవర్ణములు సన్నిహితముగా నున్నవి కదా. యథార్థమున కే భాషయందును పదములకు వాని యర్థములకు నెట్టి యవినాభావ సంబంధము నుండదు. 'ప్రథమ' యను శబ్దములో 'మొదటిది 'ను భావమును గూర్చు శక్తి యా ధ్వనిలో లేదు. సంస్కృతభాషా జ్ఞానము లేని వానికి 'ప్రథమ' శబ్దధ్వని యే యభిప్రాయమును ద్యోతకము చేయదు. అయినప్పటికి పై మూఁడుపదములలో ప్రతివిషయమునను సన్నిహిత సంబంధము గనఁబడుచున్నది. పై యుదాహరణములవలనఁ దేలిన దేమనఁగా నా యా భాషలకు పరస్పరసంబంధము గలదని. భాషాభివృద్ధిలో మఱియొక లక్షణ మేమనగా, సక్రమత. ఒకానొక 'ధ్వని' యొకమార్పును పొందినచో, నా ధ్వని తత్సదృశమైన పరిస్థితులలో నదేవిధమైన మార్పును పొందును. (ఈ సామాన్యధర్మమున కపవాదము లుండవచ్చును.) కాన నొకానొక ధ్వనివిశేషముగల భాషయు సదృశ ధ్వనివిశేషముగల మరియొక భాషయు నొకే భాషాకుటుంబమునకుఁ జేరునని నిర్ణయింప నగును. ఒకే భాషాకుటుంబమునకుఁ జేరిన రెండుభాషలలో సదృశమైన ధ్వనివిశేషములు గనుపించును. ఈ ప్రతిపాదన మే 'స్వరసూత్రము' (phonetic laws) లందురు. ఈ సూత్రములు భాషాపరిణామములోఁగల క్రమమును ప్రతిపాదించును. కాని యివి యనివార్యములు, నిత్యములగు నిబంధనములు మాత్రము గావు. ఇవి పూర్వ పరిశీలనమువలనఁ దేల్చిన విషయములే కాని, భవిష్యత్తుకు మార్గదర్శకములు గావు ఇంతవరకు నా నియమములు పాటింపఁబడుటచే నవి స్వరసూత్రములైనవి కాని, వాని ననివార్యముగ, నిత్యముగ

పాటించి తీరవలయునని కాదు. కాన వానిని భాషాపరివర్తన పద్ధతులనుట మేలు. ఆ యా ధ్వనుల నుచ్చరించు పరిస్థితులలోఁ గల మార్పులే, స్వరపరివర్తనము (phonetic change) నకుఁ గలకారణము. భాషాభివృద్ధికి పారంపర్యము ధర్మముగాని, స్థిరత్వముకాదు కావలసినది. ఈ స్వరసూత్రములు నిర్బంధములు గాకపోవుటచే, నవి నిర్బాధకముగ తిరస్కరింపఁబడుచుండును.

ఒక భాషలోని 'ధ్వనిసూత్ర' మనగా, "ఒకభాషలో నొకానొక కాలమునం, దొకానొక పరిసరముల కూర్పునం, దొకానొక ధ్వనిగాని, ధ్వనిసముదాయము గాని, క్రమస్వభావముచే పొందు పరిణామ నిర్దేశము." అది కేవలము పరిశీలించినపుడున్న స్థితిమాత్ర మే. అది యొకకాలమునకు మాత్ర మే చెల్లును. దరిమిలా మరియొక కాలమున నా నియమము మారవచ్చు. ఆ పరిస్థితియు నొకానొక సన్నివేశమున మాత్రమే చెల్లును. అయి తే యా కాలములో, నా ధ్వనుల పరిణామములో నపవాదలు (exceptions) లేవా యనఁగా, నుండవచ్చును. కాని యా శబ్దము లెరువుతెచ్చికొనినవి కాని, మాండలికములు గాని, ప్రాతపడిన రూపములు గాని, లేక, సామ్యము (analogy) ప్రభావము వలనఁగాని, యన్య దేశ భాషాపదములుగాని యైనపుడీ ధ్వనిసూత్రములు సమన్వయింపవు. అట్లు గానిచో సర్వసామాన్యముగా, సక్రమముగా సమన్వయింపఁగలవు. మానవుఁడు యంత్రమువంటివాఁడు గాఁడు. పరిసర పరివర్తనమునకు గాని, మానసిక పరిణామమునకు గాని యతఁడు లోఁబడును. ఆ యా జనులు దమ భాషాసంప్రదాయపు టలవాటులను బట్టి యెరువుదెచ్చుకొనిన మాటలనుగూడ, దమ యలవాటు ప్రకారము మార్చుకొందురు. ఉదా: తెలుగులో: 'అజంతరూపములు' table (టేబిల్)=టేబిలు, bench (బెంచ్)=బెంచి - హలంతములను అజంతములుగా మార్చుట. తమళములో: దంతం=తందం - పదాదిని పరుషమును, పదమధ్యమున సరళమును నియతముగా వాడుట ribbon= రిప్పన్. దీని సమర్థన మేమనగా - అనాలోచితముగా నట్లే చేయుటయే కాని, వేరుకారణమును చెప్పరు.

స్వరసూత్రాన్వయ మొకప్పుడు ఉపసూత్రములను (sub-laws) గూడఁ గోరును. వీని సమన్వయ మొకప్పుడు ప్రత్యక్షముగ నుండును. ఒకప్పుడు సూక్ష్మపరిశీలనఁ గోరును.

వివిధ భాషాకుటుంబములలో వివిధ స్వరధర్మములు లేదా సూత్రములు ద్యోతకమగును. ప్రతి భాషకు తన ప్రత్యేక స్వరనియమ సూత్రము లుండును. ఇండోయూరోపియన్ భాషాకుటుంబములో,

1. గ్రిమ్ము స్వరసూత్రము (Grim's law): జర్మనీ దేశపండితు డగు 'జేకబు గ్రిమ్' లాటిన్ గ్రీకు సంస్కృతము మొ॥ ఇతర యిండో యూరోపియన్ భాషలలోని, 'ప, త, క' అను ధ్వనులు జర్మానిక్ భాషలలో 'ఫ, థ, హ' అని క్రమముగా మారునని నిరూపించెను. కాన నీ స్వరనియమ మతని పేర వ్యవహరింపఁబడినది. ఉదా:

| | | | | |
|---|---|---|---|---|
| (సం.) పితా-(లా) | పేటేర్ | (గాథిక్ భాషలో) faeodor | (ఇంగ్లీ) | father |
| ,, త్రయ | త్రెస్ (tres) | ధ్రియిస్ (treis) | ,, | త్రి |
| ,, భ్రాతా | ఫ్రాటేర్ | broter | ,, | brother |
| ,, పాదం | | ఫోతు | . | foot |
| ,, కః | | hwas | | |
| ,, శిఞ్క్తి | | leihwa | | |
| ,, నపాన్ | Nepos | Neffe | | Nephew |

2. వెర్నర్ సూత్రము (Verner's law): గ్రిమ్ స్వరసూత్రము నిత్యముగాఁ గనఁబడినను యథార్థము కది నిత్యము కాదు. కొన్ని యుదాహరణలలో నీ నియమము భేదించినది. సం. 'పితా' శబ్దము గోథిక్ భాషలో fadar (ఫాడర్) అయినది కాని, fatar (పాథర్) అని గ్రిమ్ సూత్రము ప్రకారము కాలేదు. స్వరసూత్రములు గొన్ని పరిస్థితుల లోనే సమన్వయింపఁబడఁగలవు. గ్రిమ్‌సూత్రములో పండితు డొక పరిస్థితిని విస్మరించినాఁడు. అదేదన, నతని యుదాహరణ లన్నియు మహాప్రాణములుగాని పరుషాక్షరములు (unvoiced unaspirates). ప్రారంభమునఁ గాని, లేక, ఉదాత్త (accent) యుపధ (inmedianely preceded)గా నుండుట గాని, కల్గి యుండును. ఈ ప్రత్యేక పరిస్థితిని వెర్నర్ పండితుఁడు

గుర్తించుటచే నాతని పేర నీ సూత్రము వ్యవహరింపఁబడినది. గ్రిమ్ సూత్ర మా ప్రత్యేక పరిస్థితిలో మాత్రమే చెల్లును. ఇతర సందర్భము లలో సంస్కృత 'క, త, ప' ధ్వనులు 'గ, డ, బ' వర్ణములుగా గాథిక్ భాషలలో మారును.

ఉదా : (సం.) జంతుః — (గోథిక్) 'కున్డ్'
సప్త సిబన్
అంకః హాల్సగ్గ
కేతుః హైడస్
పితా పాడర్

3. ఫార్చునేటవ్ సూత్రము (Fortunatov's law) : ఇండో జర్మానిక్ కుటుంబభాషలలో మూర్ధన్యము (cerebrals) లొక్క సంస్కృతభాషయందు మాత్రమే కనుపించును కాని యితరభాషలలోఁ గనుపింపవు. వీని యుత్పత్తికి సంస్కృతభాషలోనే యొక కారణము తెలుపఁబడినది. ఒకే పదములో ఋ, ర, ష వర్ణముల తర్వాత వచ్చిన దంత్య 'న' కారము మూర్ధన్య 'ణ' కార మగునని. ఉదా : ఋణ, కీర్ణ, ఉష్ణ మొ॥ పాణిని సూత్రము_'రషాభ్యాం నో ణ స్సమాన పదే'. లేక, దంతోష్మమైన 'స' వర్ణము పూర్వమందు ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఏ, ఓ లుండినచో మూర్ధనోష్మమైన 'ష' కార ముగా మారును. ఉదా : మాతృషు, కరోషి మొ॥ సూ - "అప దాంతస్య మూర్ధన్యః ఇణ్ కోః" (పాణిని). దీని సహాయమున దంత్యములు మూర్ధన్యములైనవని పండితులు స్పష్టపరుపఁ గల్గినారు. ఉదా : కృత=కృట ; ఋద్=అదయ ; పృథతి=పరతి; మృద్=ముండ మొ॥

ఈ విషయమునే 'ఫార్చినేటివ్'అను పండితు డిట్లు భిన్నముగా ప్రతి పాదించినాఁడు. మూలభాషలో ల,ఌ కారములకు దంత్యము పరమైనచో, దంత్యము మూర్ధన్యముగా మారి ల,ఌ కారములు లోపించును. మరియు ఋ, ర కారముల తర్వాత వచ్చిన దంత్యముమారదు. ఉదా :
1. (Lith) Vąltis =వటః (సం.) ; O H. G. Spaltan=సట ; (Lith) Balsas=భాషతే (సం.) ; (Lat) Caltus=కిర (సం.)

2. కర్తామి - (Lith) Kertu ; మర్దామి - (Lat) Mardeo

| తమిళము | తెలుఁగు |
|---|---|
| తేంగాయ్ | టెంకాయ |
| తేక్కు | టేకు |
| తక్కరి | టక్కరి |

eff ద్రావిడభాషలలో ప్రారంభదంత్యము మూర్ధన్యముగా మారును. ఉదా : (తెలుఁగులో) దొర్లు - డొర్లు, దొప్ప - డొప్ప, దిగు - డిగు ; దప్పి - డప్పి ; దాగు - డాగు.

(4) గ్రాస్‌మన్ సూత్రము (Grassman's law) లేక, మహాప్రాణ సూత్రము (law of Aspiration) : ఇండోజర్మానిక్ భాషలలో నొక స్వరము చివర మహాప్రాణ మున్నప్పుడు కాని, రెండవ స్వరము మొదట మహాప్రాణ మున్నప్పుడు గాని, మొదటి స్వరప్రారంభమున మహా ప్రాణమునిలచును. ఇది భూతకాలధాతువులలోను, కొన్ని వర్తమానకాల క్రియలలోను ప్రారంభమహాప్రాణము దానికి సంబంధించిన పరుషముగ గాని, సరళముగ గాని మారును. ఉదా : ధా=దధాన ; భూ=బభూవ ; హాన్=జఘాన ; ఖాద్=చఖాద ; I. G. బోధ్=బోధతే ; దైఘ్=I. G. దహా.

స్వరాంతవ్యంజనము యొక్క మహాప్రాణత్వము లోపించినచో, పరీహారముగ ప్రారంభవ్యంజనమే మహాప్రాణమగును. ఉదా : భోత్స్యతే ; ధత్సే ; దగ్ధః.

(5) తాలవ్యీకరణము (Law of palatalisation) : 'అ' కారము నకును 'క' వర్గవర్ణములకు కంఠము స్థానమగుటచేతను, 'ఇ' కార, 'య' కార 'చ' వర్గవర్ణములకు తాలువు స్థానమగుటచేతను, నీ రెండు స్థానములు ప్రక్కప్రక్కనే యుండుటచేతను, ఇండోయూరోపియన్ భాషా కుటుంబములోఁ గల పాశ్చాత్యభాషలలో రెండు స్థానములకునుగూఁడ కంఠ్యములే వాడఁబడుటయు, ప్రాచ్యభాషలలో (ముఖ్యముగ సంస్కృ

తమున) మాత్రము తాలవ్య (ఊష్మ)ము వాడఁబడుటయు జరుగుచున్నది. ఇందులకు ముఖ్యకారణము కంఠ్యవర్గాక్షరముపై తాలవ్యాచ్చు పరమగుటయే యని నిర్ణయింపఁబడినది. ఉదా: కెంటుం=(సం) శతం. ఇందుచే పాశ్చాత్య ఇండోయూరోపియాభాషలు 'కెంటుం' భాషలనియు, ప్రాచ్య ఇండోయూరోపియన్ భాషలు 'శతం' భాషలనియు విభాగము చెందినవి.

| | | | |
|---|---|---|---|
| (సం) | పంచ | (లాటిన్) | పెంక్వే |
| ,, | చత్వార్ | ,, | క్వెటోర్వ్ |
| ,, | ఓజస్ | ,, | ఔగెఒ |
| ,, | జనః | ,, | గెనోస్ |
| ,, | జజాన | ,, | గెగ్నో |
| ,, | చరుః | (గ్రీకు) | కెర్నోస్ |
| ,, | జరర | (గాథిక్) | కిల్థై |

తాలవ్యీకరణమైన యీ మార్పు ఇండోయూరోపియన్ భాషలందే కాక ద్రావిడభాషలందుఁగూడ జరుగుచుండును. ద్రావిడభాషలలో సజాతీయపదములందలి తొలి 'క' కారము, దానిపైఁగల 'ఇ, ఏ' లను తాలవ్యాచ్చుప్రభావముచే 'చ' కారముగా మార్చుచున్నది. ఉదా:

| తమిళము | కన్నడము | తెలుఁగు |
|---|---|---|
| కిచ్చు | కిచ్చు | చిచ్చు=నిప్పు |
| 1) కెట్ట కెడు | కెట్ట, కిడు, కెడు | చెడ్డ, చెడు |
| చిఱు | కిఱు | చిఱు=చిన్న |
| కళింబు | కిలుబు | చిలుము |
| చెవి | కివి | చెవి |
| చెవిడి | కివుడు | చెవుడు |
| కిళి | కిళి | చిలుక |
| కెఱె | చెఱై | చెఱువు |

| తమిళము | కన్నడము | తెలుగు |
|---|---|---|
| చెం | కెం | చెం |
| గిడ | చెడి | చెట్టు |
| 2) చెయ్ | కెయ్ | చేయు=(క్రియ) |
| 1) కెడు | కెడు, కిడు | చెడు |
| 2) కెయ్ | కెయ్ | కయి, చెయ్యి (నామవాచకము) |

తాలవ్యాచ్చు పరముకానిచో కంఠ్యవర్గాక్షరములు తాలవ్యములుగా మారక కంఠ్యములుగానే నిలిచియున్నవి. ఉదా:

| | | |
|---|---|---|
| | కక్కు | కక్కు |
| కణ్ | కణ్ | కన్ను |
| కడ | కడ | కడ |
| కడల్ | కడల్ | కడలి |

(6) పరుష సరళ పరివర్తన నియమము (Law of the Convertability of S'urds and sonants) : ఈ సూత్రము ద్రావిడభాషలకు, నందులో నతిముఖ్యముగా తమిళభాషకుఁ జెందినది. తమిళభాషాలిపిలో వర్గప్రథమాంత్యాక్షరములకు మాత్రమే లేఖనసంజ్ఞలు గలవు. కాని ద్వితీయ తృతీయ చతుర్థాక్షరములకు గుర్తులు లేవు. ముఖ్యముగా వర్గతృతీయాక్షరముకె గుర్తులు లేక పోవుట యొక గొప్పలోపమే. ఐనను తమిళులు శబ్దోచ్చారణములో మాత్ర మొక విధముగ పరుషసరళ భేదమును పాటించుచునే యున్నారు. ఇది తెలుఁగునందువలె సార్వత్రిక

N B. (1) 'క'కారము ,తాలవ్యాచ్చుతోఁ గూడి (+) మూర్ధన్య 'ట' కారము పరమైనపుడు తమిళ, మలయాళ, కన్నడ, తుళు భాషలలో 'క' నిలుచును తెలుగున 'చ' అగును. ఉదా : త : కెటు , మ : కెటుక ; క : కెడు,కిడు(కెట్ట్) ; తు : కెడుగుని ; తె : చెడు. (2) మూర్ధన్య వర్ణపరకముగాని తాలవ్యాచ్చు పరమైనపుడు, త, మ, భాషలలో 'చ' కారమును, క, తు భాషలలో 'క'కారమును, తెలుగున 'చ'కారము నగును. ఉదా : త : చెయ్ , మ : చెయ్, క ; గెమ్, కెయ్; తు : గెయ్పుని ; తె : చేయు. (3) తాలవ్యేతరాచ్చు పరమైనచో, త, మ, క, తు, తె, భాషలలో 'క' నిలుచును. ఉదా : కణ్, కణ్ణు ; తు : కణ్ణు , తె : కన్ను.

మును, స్వతంత్రమును గాక, కొన్ని నియమములతో నీ భేదము పాటింపఁ బడినది. తమిళభాషలో లేఖనమున పరుషసరళమున కొక్కటే యక్షరము సర్వత్రా వాడఁబడినను, నుచ్చారణమున నీభేదనియమము గలదు. ఇవి శబ్దప్రారంభమునను, ద్విత్వముగా వాడఁబడినపుడును పరుషముగా నుచ్చరింపఁబడును. పదమధ్యమందు (ద్విత్వరహితముగా వాడఁబడినపుడు) సరళముగా నుచ్చరింపఁబడును. కాన తమిళమున సరళాక్షరముతో శబ్దమును ప్రారంభింపరాదు. పరుషములు పదమధ్యమున (ద్విత్వముగా నుపయోగింపఁబడినపుడు తప్ప) నుచ్చరింపఁబడవు. ఈ నియమము తమిళమున నెంతపట్టుదలతో కాపాడఁబడిన దనఁగా సంస్కృతాంగ్లశబ్దముల నుపయోగించునపుడు గూడ నిట్లే యుచ్చరింపఁబడును. ఉదా: (సం) దంతం-(తమి) తందం. (ఆంగ్ల) రిబ్బన్-(తమి) రిప్పన్. తెనుఁగున ద్వంద్వసమాసమున పరమైన పరుషాక్షరము సరళాక్షరముగా మారుటయు, ఉదా:- అన్న+తమ్ములు=అన్నదమ్ములు, ద్రుతముపై పరుషములు సరళము లగుటయు నీ స్వరసూత్రము ననుసరించియే యని యెఱుఁగునది.

## ఊఁత, లేక, స్వరము (ACCENT)

ఇది ఊఁత (Stress) లేక, స్వరము (pitch) నని రెండు విధములు.

స్వరము (pitch accent) (గానస్వరము) వేదములందును ప్రాచీన గ్రీకుభాషలోను నుండును. ఊఁత (Stress accent) యాంగ్లభాషలో సామాన్యముగ గోచరించును. ఒకధ్వని నుచ్చరించునపు డూపిరితిత్తులనుండి గాలిని శక్తివంతముగా వదులుటమీఁద నూఁత యాధారపడియుండును. ఒకకాలములో నాదతంత్రులు చేయు కంపనముల యాధిక్యముపై స్వర మాధారపడియుండును. ఈ రెండింటి ఫలితము భిన్నముగా నుండును. ప్రతిధ్వనికి దాని స్వభావసిద్ధమైన స్వరముండి, కొంచెము హెచ్చు తగ్గులుగా నుండును. ఒక పదములోని యొకానొక వర్ణముపై బలమైన స్వరమున్నప్పు డా వర్ణముయొక్క యుచ్చధ్వనివలన మరియొక పరిసర

వర్ణమును తేల్చి పలుకుచే నది భంగపడును. అనఁగా నూతగల వర్ణమున కెక్కువ శక్తి యుపయోగింపఁబడును, నూతలేని ప్రక్కవర్ణమునకు తక్కువ శక్తి యీయఁబడును. ఊతలేని వర్ణములు దాటివేయఁబడి యుచ్చారణములో క్రమముగా నష్టమగుటయుగూడఁ గలదు. కాన వర్ణలోపమున కూతనష్టము కారణ మగుచున్నది.

ఈ యూతస్వరములు రెండును ప్రాచీన ఇండోయూరోపియన్ భాషలలో గుర్తింపవచ్చును. కాని యవి రెండును మూల మాతృభాషలో నుండెడి వని యూహింప గలము. కాని జన్య భాషలలో నేదేని యొకటి మాత్రమే ప్రాముఖ్యము వహించును. వీని రెండింటిలో మూఁడు దశలు గుర్తింపఁబడును. 1 ప్రధానయూత, 2. అప్రధానయూత 3. ఊతరాహిత్యము. అప్రధానయూత గల వర్ణమునకు, ప్రధానయూతగల వర్ణమునకు మధ్య నధమపక్ష మొక యూతలేని వర్ణమైన నుండును.

ఉచ్చనీచస్వరములు గల యచ్చులు పరస్పరము మారి, వర్ణములు లోపించుట

ఇండోయూరోపియన్ భాష లన్నియు గొంతయూతయు గొంత స్వరము గలవి. కాని ప్రతిభాషలో నేదో యొకటి మాత్రమే ప్రాముఖ్యము వహించును. గ్రీకు, వేదభాషలలో స్వరమాధిక్యము వహించును. కెల్టిక్, జర్మానిక్ భాషలలో నూత ప్రాధాన్యము చెందును. గ్రీకు వేదభాషలలో స్వరహీనమైన యచ్చులుగూడ నిలిచియుండుటయు, కెల్టిక్, జర్మానిక్ భాషలలో నచ్చులు దుర్బలమై యస్తమించుటయు, నీ స్వరయూతపద్ధతుల పర్యవసాన భేదములుగ గుర్తింపనగును. ప్రాచీన మాతృ ఇండోయూరోపియన్ భాషలో స్వరముకంటె నూతయే యెక్కువ ప్రాధాన్యము వహించి యుండవలెను. ఎలన, నీ యూహ వలననే మాత్రాకృతిఁజ్యపరిణామో (quantitative ablout) త్పత్తి తత్త్వముల కవకాశము గల్గుచున్నది. ఈ స్వరము గ్రీకు, వేదభాషలలో నిలుపఁబడినవి కాని, యితరభాషలలో మాత్రము ప్రాచీనకాలముననే యూత యాధిక్యము చెందెను. క్రీస్తు శకారంభమునకు గ్రీకుభాషలోఁ

గూడ నీయూత ప్రాధాన్యము వహించెను. వేదభాషలోనున్న స్వర మర్వాచీనసంస్కృతభాషలో గతించినది. కాని దాని స్థానమున, సంస్కృతము మాట్లాడు దినములలో నూత ప్రవేశించినదో లేదో నిశ్చయముగా తెలియుటకుఁ దగిన ప్రమాణము దొరకలేదు.

ఇండోజర్మానిక్ స్వరలక్షణ విధానము రెండు విధములుగ నున్నది. (1) ఉదాత్తము (acute) (2) స్వరితము (circemflex). వీనిలో మొదటిది యుచ్చస్థాయికి లేచునది; (rising) రెండవది లేచుచు - జారిపోవునది (rising - falling). కాని వేదభాషలో నిది మూఁడు విధ

వర్ణస్వరము (syllable accent)

ములని తెలుపఁబడినది. అవి యుదాత్తానుదాత్త స్వరితములు. వాని విధానము, "ఉచ్చై రుదాత్తః, నీచైరనదాత్తః, సమాహార స్వరితః" అని పాణిని నిర్వచించినాఁడు. ఇందుదాత్తము కానిది, లేక స్వరము లేనిది (unaccented) యనుదాత్త (grave) మని గ్రహింపనగును. ఉదాత్తస్వరముగల దీర్ఘాచ్చు లుచ్చరించుటకు రెండుమాత్రల కాలమును, స్వరితముగల దానికి మూఁడుమాత్రల కాలమును పట్టును. దీర్ఘాచ్చులన్నియు నుదాత్తస్వరము గలవి. స్వరితము మూలమున లేదు. అది ప్రాచీన ఇండోయూరోపియన్ భాషలలో నీ విధముగ బయలుదేరినది. (1) ప్రథమాబహువచనము లందలి 'అ, ఒ' యచ్చులను సంకుచితపరచుట చేత. ఉదా: ఆస్=అ+ఏస్; ఆస్+ఓ=ఏస్. (2) దీర్ఘాచ్చు తర్వాత హ్రస్వాచ్చు లోపించినపుడును. ఉదా: రథానాం నయేఽశః.

దీర్ఘాచ్చుపై యనునాసికగాని, ర, ల, లుగాని లోపించినపుడు ఉదాత్తము స్వరితముగ మారును. ఉదా: రాజా(న్); పితా(ర్). గ్రీకు, వేదములలోను, ప్రాచీనయిండోజర్మానిక్ కాలములందు నీ విధమైన స్వరితము వర్ణాంతములందు నిలిచియే యున్నది.

మాతృ ఇండోయూరోపియన్ భాషలో పదస్వరము స్వేచ్ఛగ నుండి, చలనముతో నొప్పెడిది. అనఁగా పదములోఁగల వర్ణసముదా

యముచేగాని, దీర్ఘత్వముచేగాని, దాని స్థానము నిర్ణయింపఁజాలకుండెను. పదమందలి ప్రధానస్వరమున స్వేచ్ఛను ఇతర ఇండో జర్మానిక్ భాషలలో కంటె వేదభాషలో బాగుగ నిలుపఁ బడినది. సంహిత-పదపాఠములందొకటే పదమున స్వరస్థానము మారుటను బట్టి యిది స్పష్టమగును. రెండుపాఠములందు కూడ స్వరము జాగ్రత్తగ రక్షింపఁబడినది. మఱియు ప్రాచీన జర్మానీ భాషలో స్వరస్వేచ్ఛ గలదని వెర్నర్ స్వరసూత్రమువలన విశదమగుచున్నది. దానివలన నాదరహితములైన యూష్మములు, వాని పూర్వపుటచ్చు ప్రధానస్వరముగలది కాకపోయినచో, నాదవంతము లగును.

శబ్దస్వరము

వాక్యమునఁగల వివిధపదములకు స్వరగత సంబంధము నిది తెలుపును. వాక్యములో నే పదముగాని, యే భాషాభాగము గాని, స్థానమునందును నిత్యముగా స్వరముతోఁ గూడి యుండదు. ప్రాచీనభాషలలో నే పదమైనను కొన్నిసందర్భములలో, తన స్వతంత్రస్వరమును గోలుపోయి స్వరహీనమగుట తటస్థించును. ప్రత్యేక ఇండోజర్మానిక్ భాషల కాలమున, స్వరయుతమైన సర్వనామములకు, స్వరహీనమైన సర్వనామములకు ప్రాతిపదికలలోఁ గల భేదము నిలుపఁబడినది. చాలవర కా భాషలలో నా భేదము ప్రస్తుతకాలము వరకు రక్షింపఁబడినది. సంబోధనము ప్రారంభమునఁ గొన్నింటివరకు స్వరయుతమై యుండుటయు, కొన్నిస్థలములలో స్వరయుతము గాకుండుటయుఁ గలదు. వేదభాషలో వాక్యప్రారంభమున నే సంబోధనము స్వరయుత మయ్యెడిది. కాని గ్రీకుభాషలో సంబోధనమునకును ప్రథమావిభక్తికి సమానమైన స్వర మీయఁబడినది. జర్మానిక్ భాషలలో ప్రధానక్రియారూపములు గొన్ని స్వరయుతముగను, కొన్ని స్వరరహితముగ నుండెడివి. కాని యవి యెప్పుడు స్వరముతో నుండెనో, యెక్కడ స్వరము లేక యుండెనో మాత్రము నిర్ణయించుట కష్టము. ఏలన, నా భాషలలో క్రియలలో స్వరముగల ప్రాచీనపద్ధతి చారిత్రక కాలమువరకు నే భాషలోఁ గూడ. రక్షింపఁబడి

వాక్యస్వరము

యుండలేదు. వేదభాషలో మాత్రము స్వరము పాటింపఁబడినది. వానిలో నాధారవాక్యములందు (subordinate clauses) ప్రధానక్రియకు నిత్యముగను, ఆధార్యవాక్యము (Principal clauses) లలో ప్రారంభము నను స్వరముండి, తదితరస్థలములలో స్వరరహితముగనే యుండెను. వేద స్వరము ముఖ్యముగా పదస్వరవిధానమునందే యున్నది. వాక్యస్వర విధానమునకు మాత్రము సంబోధనలందును, ప్రధానక్రియలందును గాంచ నగును.

వేదములందు స్వరభేదము ననుసరించి యర్థభేదమును, వ్యాకరణ విషయభేదమును గలుగును. 'మంత్రహీనః స్వరతో వర్ణతో వా మిథ్యా ప్రయుక్తేన తమర్థమాహ, స వాగ్వజ్రో యజమానః హిన స్తి. యథేంద్ర శత్రుః స్వరతోపరాధాత్'. 'ఇంద్రశత్రుః' అను సమాస మొకస్వర మున బహువ్రీహియర్థమును, మరియొక స్వరమున తత్పురుషార్థమును గలుగును. అపస్వరముచే యజమాని యపరాధము చేసినవాడై దండింపఁబడెను. స్వరభేదముచేత వేదభాషలోనే యర్థభేదము గలుగుట కాక, సాధారణ సంస్కృతపదములలోఁ గూడ నర్థభేదము గలుగును. ఉదా: బ్రాహ్మణ=కృతి : ఐతరేణబ్రాహ్మణ, శతపథ బ్రాహ్మణాదులు ; బ్రాహ్మణ=పురోహితుఁడు. ఊత మొదటివర్ణపై యున్నప్పుడు కృతి యనియు, ద్వితీయవర్ణముపైకి వచ్చినపుడు పురోహితుడనియు నర్థము మారినది. ఇట్లే గ్రీకుభాషయందుగూఁడ గోచరించును. ఉదా : Thea - spectacle , దృశ్యము, దీనిలో స్వరము 'ఇ e' మీఁద నున్నది; Thea=goddess దేవత. స్వర మిక్కడ 'ఆ' మీఁదకు మారి యర్థ భేదము వచ్చినది. ఇట్లే యాంగ్లభాషలోఁగూడ నూత మారి యర్థభేదము గల్గించుచున్నది. ఉదా : Human=మానవుఁడు. ఇందూత మొదటి వర్ణముపైఁగలదు. Humane=శాస్త్రేతరములు. ఇందూత రెండవ వర్ణముపైకి మారి యర్థభేదము గల్గినది ; Project=కార్యవిధానము ; Project=పొడిగించు ; ఇట్లే frequent, refuse గూడ ; Permit - *n*—1 Permit - *v*—2,

ఊత భాగుగాఁగల వర్ణములు నాదము గల్గి నిలుచును. ఊత లేని వర్ణములు కాలక్రమమున బలహీనములై, మార్పులు చెంది, చివరకు నశించిపోవుట కూడ గలదు. సామాన్యముగ పదమున ప్రథమాక్షరముపై యూత యుండును. కాని సమాసమందు మాత్రము మొదటిపదముపై యూత ప్రధానముగను, రెండవపదముపై యప్రధానమైన యూతయు నుండును. ఊతభేదముచే తెలుఁగున నర్థభేదము గలుగు విధ మిట్లుండును. ఉదా: రెండెడ్ల బండ్లు తీసికొని రమ్ము. ఇందు మొదటిపదమగు 'రెండు'పై యూనిక యున్నచో 'రెండేసి యెడ్లు' గల బండ్లను తీసికొని రమ్మని యర్థమగును. ఊనిక రెండవ పదమగు 'ఎడ్ల'పై నున్నచో, 'ఎడ్లబండ్ల'ను రెంటిని తీసికొని రమ్మని యర్థమగును. సామాన్యముగ తెలుఁగున యూత స్పష్టముగ గోచరింపదు.

ఉదా : దానిమాటకేమి, దీనిమాట చెప్పు; దీనివల్ల ప్రయోజనం లేదు, ముప్పు కూడాను అక్కడయిందా ? ఇక్కడ చూడు.

స్వరమునకు : ఉదాహరణము :

1. ఆఁ=సరే; 2. ఆఁ=ఆలాగా ? 3. ఆఁ=ఏమి చెప్పావు; 4. ఆఁ=నీవు చెప్పింది నమ్మతగినదిగా లేదు. 5. ఆఁ=భద్రము ! జాగ్రత్త. 6. ఆఁ=(ఆయాసమును తెలుపును) 7. ఆఁ=చాలులే చాలా చెప్పావు. 8. ఆఁ=అట్లాగేమి. 9. ఆఁ=వింటున్నాను చెప్పు. అని యీ రీతిగా ఎన్నో వికారాలను, ప్రశ్న, ఆశ్చర్య, సందేహ, సంతాపాది విషయాలన్నియు భాషలో నీ స్వరభేదమువల్లనే వ్యక్తమగును. వ్యాకరణమున నీ భేదములను తెల్పుటకు వీలులేదు.

నాటకాలలో నిట్టిది స్పష్టముగా నుచ్చారణమున కనఁబడును. ఉదా : వేణీసంహారనాటకములో "తరువాత - తరువాత" అనుమాట వివిధభావాలతో, స్వరాలతో నుచ్చరింపఁబడును.

వ్యవధానముతోడ, విరామములతోడ, భేదము పొడగట్టుచున్నది. ఉదా: వాడు తెలిసీతెలీనట్లు మాట్లాడాడు - (అవ్యవహితముగా).

వాడు తెలిసి, తెలీనట్లు మాట్లాడాడు - (వ్యవధానముతో)

ఉదా: (2) "ఆ అమ్మాయి పాట్, నాకు రాదు" (వ్యవధానముతో)

ఆ అమ్మాయి పాట్ నాకు (పాట్నాకు రాదు) (అవ్యవహితముగా)

ఆ అమ్మాయి పాట, నాకు రాదు (వ్యవధానముతో)

ఊతలేని పదము లెట్లు నశించునో చూతము. ఉదా: 'పదము' ఇందు 'ప' వర్ణముపై యూతయుండును. 'ము' వర్ణముపై యూతయుండదు. (అసలది 'పదమ్' అని. దానికి చివర 'ఉ' కారము కలుపుటచేతనే 'పదము' అని యైనది). ఈ పదమునకు బహువచన రూపము 'పదములు'. ఇది 'పదాలు' అని రూపాంతరమును పొందినపుడు, 'ము' వర్ణమూతలేక పోవుటచేతనే నశించి తత్పూర్వవర్ణమగు 'ద' కారము దీర్ఘమై, నూత 'ప' కారము నుండి దాని మీదికి మారినది. అపుడు 'పదాలు' అని పలుకుదుము. ఊతచే వర్ణములు నశించి మారురూపములు పొందిన పదము లిట్లుండును. ఉదా: వలదు=వల్దు వద్దు; కలదు=కల్దు=కద్దు; పదములలో నచ్లోపము (syncopation) వలన గల్గు మార్పు లిట్టివే. ఊతమూలమున నచ్లోపము గలిగి, తర్వాత వర్ణసామ్యాకరణము (assimilation) వలన నా రూపము సిద్ధించును. ఉదా:

| గాంధిక భాష | వ్యావహారిక భాష | |
|---|---|---|
| మాని వేసినచో | మాని వేస్తేనో | మానేస్తేనో |
| వెళ్లివచ్చెదను | వెళ్లి వస్తాను | వెళ్లొస్తాను |
| రామావరము పాడు | రామావరంపాడు | రామారప్పాడు |
| అంగవస్త్రము | | అంగోస్త్రము |
| దీపావళి | | దీపాళి |
| ఒకతే | | ఒకే |

ఈ విధముగ నూతవలన పదములో ధ్వనిపరివర్తనము (phonetic change) తోఁబాటొకప్పుడు శబ్దరూప పరివర్తనము (morphological change) ను, నింకొకప్పు డర్థవిపరిణామము (semantic change) గూడ జరుగును. స్ఫుటముగా నర్థమును ద్యోతకము

చేయుటకొఱకే, రోకటిపోటుగా కాక, యూనితో, స్వరవైవిధ్యము (intonation) తో, భావమును ద్యోతకము చేయుచు మాట్లాడువారి యుపన్యాసాదులు హృదయంగమముగా నుండి, స్వరవైవిధ్యము లేక మాట్లాడువారి పలుకులు వినుకు గొలుపుట జరుగును.

## II శబ్దస్వరూప పరివర్తనము (FORMATIVE CHANGE)

సంపర్క ప్రభావము : మనము ఎలువారు వినునట్టియు, మాట్లాడునట్టియు మాటలు మన మనస్సులమీద ముద్రలుగా ఏర్పడి యుంచి, నూతనశబ్దములను నూత్న శబ్దస్వరూపములను సృష్టించుటకు సాయపడును. ఇదే సంపర్క ప్రభావ (association) మనబడును. ఇది సామ్యము (analogy) నకు మూలకారణము. ఇదియే స్వరపరివర్తనము నకు ముఖ్యసాధనము. మానసికశాస్త్రము ప్రయోగసాధనముగా పరిగణింపబడక పూర్వము, ధ్వనిపరివర్తనమునందలి యక్రమరూపములు లపవాదములు (exceptions) గా నెంచబడినవి. వానికి తగిన కారణములు దొరకలేదు. కాని బ్రగ్ మన్ (Brugmon) (ఆస్థాఫ్) Osthoft మొదలైనవారు ఆయక్రమరూపములకు కారణమును సామ్యముమీద నాధారపఱచిరి. స్వరము ,స్వరూపము, నర్థము, కారకములలోఁగల యనేక వికారములకు సామ్యమే కారణమని గ్రహింపబడినది. సంపర్కప్రభావము లేనిదే వికారములు జరుగుట యసంభవము. ఇది సామ్యము నస్మృతిసామ్యము నని రెండురీతుల వ్యవహరింపబడును. 'మానసిక విషయములు కొన్ని యంతఃకరణమునుండి జారిపోవు, తర్వాత కొంతకాలమునకు మానసిక తత్త్వమువలన నవి తిరిగి యంతఃకరణమును జేరుట సంపర్కప్రభావ' మని ఆర్టెల్ (Oertel) వివరించినాడు. ఈ సంపర్కము మూడు విధములు. 1. ధ్వనిసంపర్కము : ఇది స్వర, స్వరూప, కారకముల సామ్యవికారము (disturbances) లకు మూలకారణము. 2. అర్థసంపర్కము : ఇది శబ్దార్థ పరిణామమునకు హేతువు. 3. వ్యవహార సంపర్కము : ఇది యితర సామ్యవికారములకు దారితీయును. ఉదా : 'S' in adverbs-sometimes, always, sideways etc. ధ్వనిపరివర్తనమువలె సామ్యపరివర్తన

ముచ్చారణమున సమూలకముగ బోధింపదు. అది శబ్దస్వరూపమును, ప్రత్యయములను, కారకమును, శబ్దార్థమును, శబ్దజాలమును బోధించును. ఏదైన నొకక్రొత్త వస్తువుగాని, విషయముగాని గోచరించినపుడు, దానికి తాను పూర్వమెఱిఁగిన సదృశవస్తువు, సదృశవిషయము యొక్క పేరుతో వ్యవహరించుట మానవస్వభావము. దీనినే సామ్య (analogy) మందురు. ఉదా: మిరియమువలె కారముగా నుండుకాయ 'మిరపకాయ' యైనది. ఇట్లేపదములందు కూడ జరుగును. ఒక శబ్దముయొక్క రూపముగాని, యర్థముగాని మఱియొక శబ్దముయొక్క రూపముతోఁగాని, యర్థముతోఁ గాని సరిపోవునట్లు మారుట జరుగును. ఒకజాతి పదములు విశేషముగా వాడఁబడుటచే వానికి సదృశముగా నితరజాతి పదములను కూడ వాడుట జరుగును. ఇందుచేఁ గొన్నిశబ్దములకు నూతనరూపములు వ్యవహారములోనికి వచ్చును.

ఆంగ్లభాషలో బహువచనమునకుఁ గలుపఁబడు 's' అను ప్రత్యయ మవ్యయములకుఁగూడ జేర్పఁబడుట. ఉదా: పైనఁజూపినట్లు sometimes,

**1. శబ్దనిర్మాణమున సామ్యగత పరివర్తనము analogical formation of words**

always sideways మొ॥. మఱియు నామవాచకములకు సాధారణముగ గలుపఁబడు సి 'S' ప్రత్యయమును తెలియని పామరులు child man మొ॥ వానికిఁగూడఁ గలిపి childs, mans అని బహువచనములో వాడుట. ఇట్లే సంస్కృతభాషలో 'ద్వి' ద్వివచనమున='ద్వా'గా మారి, ద్వా+దశ='ద్వాదశ'యను రూపమును పొందుట సక్రమము. ఇందలి 'ద్వా' కార దీర్ఘసామ్యమున 'ఏక+దశ' కూడ 'ఏకాదశ'గా వాడుట యక్రమము. కాని యాభావము పోయి దీర్ఘ అకారము 'ఏకాదశ'కుఁగూడ సంక్రమించినది. ఇది సంపర్కప్రభావము. ఇట్లే 'అగ్నిమరుతౌ' కాక, 'అగ్నీమరుతౌ' అనుటకు బదులుగా, 'అగ్నామరుతౌ' అని వాడుట. ఇది 'ఇంద్రామరుతౌ, ఇంద్రాగ్నీ', ల సామ్యమున చేయఁబడినది. 'దాక్షిణాత్య' పదసాదృశ్యమున మరాటిభాషలో 'పాశ్చాత్య' యనుటకు, 'పాశ్చిమాత్య' యనఁబడినది. ఇట్లే 'అంకురారోపణము' 'అంకురార్పణ' మైనది.

i. నామప్రత్యయములలో: సంస్కృతమున అదంతేతర పదములలో నెల్ల తృతీయాబహువచనమున 'భిస్' అను ప్రత్యయము గోచరించుటచే, వేదమున అదంతశబ్దమునకుఁ గూడ నీ ప్రత్యయమునే చేర్చి, 'కర్మైః' అను రూపములకు బదులుగా 'కర్మభిః' అని వాడుట ఇట్లే 'న' కారాంత శబ్దముల సామ్యముచే అకారాంత శబ్దముల షష్ఠీబహువచనరూపములలోను, నపుంసక ప్రథమా బహువచనరూపములలోను 'న' కారము ప్రవేశించినది. ఉదా. నామాని, సద్మాని, మనసాదృశ్యమున 'ప్రియాణి, దినాని' అని వాడఁబడుట ఇట్లే అకారాంతశబ్దముల సంస్కృతమున 'అ' కారాంతశబ్దముల తృతీయా, షష్ఠీ ఏకవచనములలో క్రమముగా 'ఏన' 'స్య' ప్రత్యయములు వచ్చినవి; తేన, అనేన = రామేణ.

2. నామక్రియాప్రత్యయములలో సామ్యగతమైన యొడుదుడుకులు
**Logical disturbances in inflection and cojugation**

ii. ధాతుప్రత్యయములలో. 'అస్, అద్' మొదలగు ధాతువుల సామ్యమున 'భూ' మొదలైన ధాతువులకుఁ గూడ వర్తమానోత్తమ పురుషైకవచనమున 'అ' అను ప్రత్యయమునకు బదులుగా 'మి' అను ప్రత్యయము గ్రహింపఁబడినది. ఉదా: అస్మి; గచ్ఛామి. మొ॥ 'ఆ' కారాంత ధాతువులైన 'అంజ్, అర్చ్, అర్హ్' ధాతువులు భూత (Perfect కాలములో, "ఆనంజే, ఆనర్చ, ఆనర్హ" యగును. వీని సామ్యమున 'అ' కారాంత ధాతువులగు "ఋచ్, ఋశ్" ధాతువులు భూతకాలములో (Perfect) ద్విత్వము వచ్చి, 'అ' కారము దీర్ఘమై 'న' కారము చేర్పఁబడి "ఆనృచుః, ఆనశే" అను రూపములను పొందినవి.

iii. తబ్బిబ్బులు (Contamination): సంస్కారభావమువలన గలుగు మార్పిది. కించిద్భేదరూపములు సదృశభావమును ప్రతిపాదించు రెండు శబ్దములలోఁగాని, వాక్యములలోఁగాని, కొన్ని భాగములు వ్యత్యస్తమొనర్పఁబడి, తికమక పెట్టును ఉదా: ఒకడు మరియొకని గాంచి యతని క్షేమసమాచారమడుగుచు, 'అట్లా యున్నావేమని?' ప్రశ్నింపగా నతడు 'నా Circumference బాగుండలేదన్నాడు.'

అతని మనసులోని భావము Circumstences అని. కాన మాట్లాడు వాని మనసులోఁగల వాక్యభావములతో పరిచయముండినఁగాని యీ కలత పాటున కర్థము కుదరదు.

## III. అర్థవిపరిణామము (SEMANTICS)

అర్థవిపరిణామ మనగాఁ శబ్దస్వరూపము మారక, యర్థమునందు మాత్రము మార్పు చెందుట. స్వరవిషయము లధిక సాధనములచే నాకర్షించుటచేతను, నధికాభిరుచి గల్గించుటచేతను, శబ్దార్థ విపరిణామ విషయమును గూర్చి ప్రారంభమున కొలఁదిమంది మాత్రమే శ్రద్ధ వహించిరి. ఒక శబ్దము యొక్క ప్రాచీనార్థమును, దానికి ప్రస్తుతార్థముతోఁ గల సంబంధమును గ్రహించుట బహు కష్టమైనది. ముఖ్యముగా వేదశబ్దము లంగీకృతములై యున్నది. 'అయన, వేవస్,' శబ్దముల యర్థభేదమును, 'నవ, లోప' పదముల యర్థమును నిర్ణయింపఁబడలేదు. ఫ్రాంసు దేశీయులగు 'పాల్, బ్రిల్' అను వారీ విషయమున ప్రత్యేక పరిశోధనలు సల్పిరి. బ్రిలు తన గ్రంథ ప్రథమ భాగమున మూడు ధర్మములని విషయమున ప్రతిపాదించెను. (1) ప్రత్యేకత. (2) భిన్నత్వము (3) నిర్మూలనము ననునవి.

(1) ప్రత్యేకత: తర తమభావములకు ప్రాచీన సంస్కృతమున క్రమముగ "రః, మః" అని వాడఁబడెను. ఉదా: రః - ఉపరః, అధరః, అంతరః; మః - ఉపమః, అధమః, అంతిమః. అర్వాచీనకాలమున నీ పద్ధతిపోయి యన్నింటికి మొత్తమున 'అధిక' పదము వాడఁబడుచున్నది.

(2) భిన్నత్వము: సమానార్థముగల పదములు కాలక్రమమున భిన్నార్థమును పొంది, యభేదముగా వాడఁబడకపోవును. ఉదా: మాతా లేక ఆయీ. ఈ రెంటికి తల్లియనే యర్థమైనను, వీనిలో మొదటిది గౌరవార్థమును, రెండవది ప్రేమార్థమును దెలుపును. అట్లే 'కార్య లేక కజ' వీనిలో నొకటి శుభకార్యాదులును, రెండవది కారణమును.

దెలుపును. 'మనస్, మనుష్, మతి, మనన, మన్యు' పదములన్నియు 'మన్' ధాతువునుండియే పుట్టినవి, దాని యర్థము 'ఆలోచించు' అనియైనను, వీనిలో చివరిదానికి కోపము భావమును, మొదటి మాటికి 'ఆలోచించుట' అనియు, నాల్గోదానికి మనస్ అనగా మనస్సని, మతి=ఆలోచన, బుద్ధి అనియు, మననము=పర్యాలోచనము అనియు నర్థములగును.

(3) నిర్మూలనము: ఇది పాత ప్రత్యయములకు సమన్వయించును. ఉదా: 'చ' కారాంత ప్రయోగము సంస్కృతమున కార్యారంభమును దెలుపును. ఉదా: గచ్ఛతి, ఇక్కడ ప్రత్యయము సక్రమముగ వాడఁబడినది. కాని, ఋచ్ఛతి, యచ్ఛతి, పృచ్ఛతి, అను క్రియలలో ప్రారంభార్థము లేదు. ఇందలి ప్రత్యయము వేరుచేయఁబడి యక్రమముగ నితర క్రియలకు వాడఁబడినది.

కొన్ని శబ్దములు వాడుకలో లేకపోవును. ఏలన నా పదములు సూచించు వస్తువులు, భావములు వాడుక వ్యవహారమునుండి తొలఁగిపోవుటయే యిందులకుఁ గారణము. మరియొకటి, నా భావములకు వస్తువులకు నూతనపదములు వ్యవహారములోనికి వచ్చుటచే ప్రాతమాటలు మాయమగును. కాని కొంతకాలము మాత్రము ప్రాత క్రొత్తమాటలు రెండును వాడుకలో నుండక తప్పదు. కానిచో క్రొత్తమాట లర్థముగాక, యవే నశించిపోవును.

1. కొన్ని భావములకు వస్తువులకుఁగల ప్రాతమాటలు మాయమగుట: యజ్ఞయాగాదులకు సంబంధించిన యనేకశబ్దములు తర్వాతతరమువారి వ్యవహారమునుండి జారిపోయినవి. ఏలన నా భావములు, వస్తువులుగూడ తర్వాత కాలమున లోపించినది. ఉదా: వేదీ, దర్వీ, ఆనందీ, హోతా, పురోడాశము మొ॥

2. విప్లవము, సంస్కారము, నూతనదేశములను గనుగొనుట, పరిశోధనములు, మొదలైన వాని ఫలితముగ ననేక నూత్నపదములు

పుట్టును. ఇవి ప్రాచీన శబ్దసామగ్రినుండియే నిర్మింపఁబడవచ్చును. ఉదా: Commonwealth, Franchise మొ॥ నూతన భాషాసంపర్కము, (దేశ విజయముల ప్రభావము) వలన ననేక నూత్నపదము లుద్భవించును. ఇవే యన్యదేశీయములనఁ బడును. మహమ్మదీయరాజ్యకాలమున, రోజు, దరవాజ, ఫసలీ, ఫైళిణీ, మొ॥ పదములును, నాంగ్లేయులరాజ్య కాలమున, పోస్టాఫీసు, స్టాంపు, కాలేజీ మొ॥ వియు వాడుకలోనికి వచ్చినవి. ఇవి దేశభాషా స్వరవిధానమున కనుగుణముగా కొంచెము మార్పునొందును.

అతివ్యాప్తి, అవ్యాప్తి : ప్రారంభమున నొకానొక యర్థమిచ్చు పదముల అర్థము (1) విశాల వ్యాప్తి చెందుటవలనను, (2) అవ్యాప్తి చెందుటవలనను, ( ) చలనమగుట చేత నర్థమున మార్పు చెందును. ఉదా : (1) గంగ=గంగానది. కాని యిది ప్రతినదికినిగూఁడ ప్రవిత్ర నది యను నర్థమున కృష్ణా, గోదావరినదులకుఁ గూఁడ వాడఁబడును. అంతే కాక తీర్థము, జలమను నర్థమునకూడ వ్యవహరింపఁబడును. గంగ త్రాగి యన, జలము త్రాగి యని యర్థము. ఇది యతివ్యాప్తిగతము. (2) కంపు ప్రాచీనార్థము వాసన యని (మంచిగూడ), కాని యిపుడు చెడువాసనకు మాత్రమే కంపని యర్థము. (3) చీర : వస్త్రము ప్రాచీనార్థము. ప్రస్తుతార్థమున స్త్రీలు ధరించు వస్త్రము మాత్రమే. (4) కుడుచు=తిను, ప్రాచీనార్థము; ప్రస్తుతార్థమున ఒక తిట్టు. (5) విందు: అతిథి = ప్రాచీనార్థము. విందుభోజనము=ప్రస్తుతార్థము.

ప్రచ్ఛన్నార్థము : ఇందు నీచార్థములకు గౌరవశబ్దములను వాడుట. ఉదా : శౌచము. దీనికి మూలార్థము శుచి సంబంధమైన దని. కాని శౌచము వచ్చిన దనగా మైల వచ్చినది భావము. పూజ్యము = పూజింపఁదగినదని మూలార్థము. కాని శూన్యమని సూచన. నిండు కొనెను = పూర్ణముగ నుండెనని మూలార్థము. లేదని సూచన.

సంపర్కమువలన నర్థవ్యాప్తి : పత్రము = ఆకు ; తర్వాత లేఖ, (ఆకు మీఁద వ్రాయుదురు కాన), కాయితము (మీద వ్రాయఁబడునది కాన) : పాదము = కాలిపాదము, నాల్గవవంతు (జంతువునకు

నాల్గుపాదములుండును కాన) ; మషీ = మసి (దానితో చేయునది, కాని తర్వాత సీరా అని యర్థము) ; ఆమ్ర = మామిడిచెట్టు, తర్వాత దాని ఫలమునకును. కమ్మ = తాటియాకు. ప్రాచీనులు తాటియాకును మడచి చెవి కాభరణముగా పెట్టుకొనెడివారు గాన కర్ణాభరణములు కమ్మలయినవి. తాటియాకుమీఁద వ్రాసెడు వారు గాన ‘ఉత్తరము’ లేఖ యని తర్వాత యర్థమైనది. అవధ్యులు = (మూలార్థము) చంపఁ దగనివారు ; (తర్వాత) వికలాంగులని ప్రస్తుతార్థము.

సందర్భమును పట్టి స్వతంత్రముగనే వేరర్థము గలుగును : (i) ప్రతి (తిరుగు మాట) లేదు ; ప్రతి (మరియొక) రఘువీరుడొకడు (కలఁడె); ఈ పుస్తకమునకు మున్నూరు ప్రతులు (నకలు) లచ్చయినవి : యతికి ప్రతి. (వ్యతిరేకము) ; ఎవ్వారు నీ ప్రతి (సాటి) లేరీ భువనత్రయంబున (పారి. వం. 10 ఆ) ; ఏను నీ ప్రతిగ (మారుగ) నర్చన చేసెదఁగాని శాంభవిన్ (జై. భా. 7.) వీనిలో నర్థభేదము గుర్తింపఁ దగినది మూలమున ‘ప్రతి’ శబ్దము విశేషణము. పై వానిలో నది విశేష్యముగ వాడఁబడినది. (ii) మాట = రా ; (అని); వేయిమాట లేల, ఒక్క-మాటలో చెప్పుతాను. (సాటి, పలుకు అని) ; మాటలప్రోగు = అధికప్రసంగి ; మాటకారి = చమత్కార భాషి , గుమాస్తా మూలమున మా వారికి మాట (అప్రతిష్ట) వచ్చినది ; రాజు మాట కద్దులేదు (ఆజ్ఞ) ; నా మాట (సలహా) వింటావా ? ; వాడిమాట (ఉద్దేశము) సాగటం లేదు ; ఆ పని చేస్తానని మాట (వాగ్దానం) యిచ్చినాను ; వాడికి నాకు మాటలు లేవు. (శత్రుత్వము) ; మూగపిల్లమాట (గూర్చి) యేమి చెప్పినావు ; ఆమె లేదన్న మాట (కబురు) నిజము. వాఁడొకమాటలో (శీఘ్రముగ) వచ్చాడు ; అయ్యో ! అదేమి మాట ! (రీతి) ; ఏమి సంగతి, ఉండే మాటా, పోయే మాటా (అభిప్రాయము), వేగమే చెప్పు ; మా అబ్బాయి కిప్పుడే మాటలు వస్తున్నవి. (మాట్లాడ ప్రారంభించుచున్నాడు).

భాషలలోని పదములు సామాన్యముగా కాలక్రమమున గొన్ని విశాలార్థమును, మఱికొన్ని సంకుచితార్థమును పొందుటయు, నింకకొన్ని

యనార్థగత మగుటయు జరుగును. సోదరభాషలలోఁగల సమాన పదములు గొంతకాలమున కర్థమున మారిపోయి యొక సోదరభాష మాట్లాడు వారికి రెండవ సోదరభాషాపదము లర్థము కాని స్థితిలోనికి వచ్చును. ధ్వనిమార్పులో మనస్సున కేమియు ప్రాధాన్యము లేదు, కాని యర్థపరివర్తనములో మనస్సునకే ప్రాముఖ్యముండును. ధ్వని పరివర్తనములోఁ గల శరీరావయవ చేష్టలను గుర్తింప వచ్చును. కాని యర్థపరిణామములోఁగల క్లిష్టమానసిక చేష్టలను గుర్తించుట సాధ్యము గాదు. కొన్ని పదములు విశాలార్థమునను, కొన్ని సంకుచితార్థమును నింకకొన్ని యర్థచలనమును పొందెనని మాత్రము చెప్పవచ్చును. ఇట్టి సందర్భము తటస్థించుటకుఁగల కారణమగు భావసంపర్కములను గుర్తింపఁ గలుగుదుమే కాని, యే పదములు విశాలార్థమును సంకుచితార్థమును పొందగలవో నిర్ణయించుట మాత్రము సాధ్యము గాదు. ఇది జనుల పరిసర ప్రభావముమీఁదను, మానసిక తత్త్వముపై నాధార పడి యుండును.

భాషలలో సరళార్థమును బోధించు నిత్యవ్యావహారిక శబ్దము లర్థమున మార్పు చెందఁజాలవు. ఉదా: చెట్టు, ఎద్దు, తల్లి, తండ్రి, నేను, నీవు, ఒకటి, రెండు మొ. కాని యాలంకారికములై రూపకార్థమున వాడఁబడిన పదము లర్థమున విశాలమగుటకుఁ గాని, సంకుచిత మగుటకుఁ గాని యవకాశ ముండును. మఱియు, జాతివాచకపదములు గొన్ని క్రమముగ నొక భాగమునకు మాత్రము సంకుచితార్థమునఁ వాడఁబడ వచ్చును. జాతివాచకమగు మృగశబ్దము సర్వజంతువులకు సమన్వయము కాగా, లేడికి మాత్రమే యర్థమగుట యిట్టిది. మానవులు నూతన పరిసరములలోను, నూతన సంఘమునను వ్యవహరించునపుడు సామాన్యమును సరళమునైన పదములకుఁ గూడ నూతనార్థము చెందును. ఉదా: సోదరుఁడనగా అన్నగాని తమ్ముడుగాని యగును. కాని సంఘమున సోదరభావమును దెల్పుటకు సోదరశబ్దము విశాలార్థమున ప్రయుక్త మగును. ఇట్లే సర్వనామములలో నుత్తమ మధ్యమపురుషైక వచనము లగు నేను నీవు పదములకు బహువచన రూపములు మేము-మీరు.

అవి గౌరవార్థమున నేకవచనమునఁగూడ వాడఁబడి యర్థపరివర్తనము చెందుచున్నవి. ఇట్లు సరళమైన పదములే యర్థమున మార్పుచెందు నపుడింక, భావార్థకములగు (abstract) పదము లర్థమున మారుటలో విశేషముండదు. గుణవాచకశబ్దముల నిశ్చితార్థమును నిర్ణయించుటలో మాట్లాడువారికిని, వినెడువారికిని మధ్య తారతమ్యభేద ముండవచ్చును. ఇది వ్యక్తితత్త్వముపై నాధారపడి యుండును. ఇట్టి స్థితిలో సగటున నొప్పు నర్థమే గ్రహింపఁబడినను, నుచ్చారణభేదములవలె, నర్థమునఁ గూడ నీష ద్భేదముండక తప్పదు. ఈ యర్థభేదము వారివారి విజ్ఞానము, నభిరుచి, సంస్కారము, నాగరకత, వాతావరణము, సంపర్కము మొదలైన వాని నాశ్రయించి యుండును. పై విజ్ఞానాదుల వలన విశాల భావములు గలుగును. ఈ భావవైవిధ్యము ఫలముగా శబ్దజాల మధికమగును. కాని భావవైశాల్యముతో సమానముగ భాషావైశాల్య ముండజాలక వెనుకపడుచునే యుండును. ఇట్టి స్థితి ప్రాచీన కాలమునకంటె నవీనకాలమున మేలుగ నుండును. అస్పష్టభావార్థము లాలంకారికభాషలో వస్తుప్రపంచముతోఁ బోల్చి వ్యక్తీకరింపఁబడును. అప్పుడా భావముల పరిపూర్ణార్థము ద్యోతకము గాక, కొంతభాగము మాత్రమే వ్యక్తమగుచుండును. కాన భావార్థకపదములలో నర్థభేదమునకు, నభిప్రాయభేదమునకు నవకాశ ముండక తప్పదు. ఇట్టి యభిప్రాయభేదము లుప్పతిల్లు నపుడు, భాషాభివృద్ధి జరుగుచుండగా, సగటున గలుగు నర్థమును నిర్ణయించుట సాధ్యము గాదు. భావద్యోతకములగు మాటల విషయ మట్లుంచి, ప్రారంభమున స్పష్టార్థముకల పదములలోఁ గూఁడ నన్వయమున విశాలము, సంకుచితము, నన్యగతము నగు స్వభావము గనఁబడుచుండును. ఈ మూఁటిలో విశాలార్థము నొందుట యరుదు. ఏలన భాషాలక్ష్యము భావమున కెక్కువ సూటిగను, సన్నిహితముగను భాష వ్యక్తీకరింపవలెనని. కాన, భాష సందిగ్ధ పదములతో భావములను వ్యక్తీకరింప చూడదు. ఇందుచే సర్వసాధారణముగ విశాలార్థ మర్థచలనమువలననే జరుగును.

పై విచారణవలన నర్థవిపరిణామము సామాన్యముగ మూఁడు విధములుగా జరుగునని తెలియుచున్నది. అవి. (1) సంకుచితార్థమున (2) విశాలార్థమున, (3) అర్థచలనమున (shifting). ఈ మూర్పులకు ముఖ్యకారణము లివి.

(i) విశాలార్థముగల పదమును వివిధార్థములలో వాడుట.

(ii) సామాన్యవాచి యగు పదమును విశేషవాచిగ వాడుట.

(iii) అనుద్దిష్టముగ సంపర్కప్రభావమున నొక పదమున కప్రధానార్థమునుగూఁడ కలిపి, క్రమముగ దానికే ప్రాధాన్య మొసఁగి, యర్థచలనమును (shift) గలిగించుట, లేక యర్థమును విశాలపఱచుట.

(iv) ప్రాముఖ్యముకొఱకు గాని, స్పష్టతకొఱకుఁగాని యొక పదము నాలంకారికముగ వాడి, దాని యర్థమును విశాలపఱచుట.

(v) ఉద్రేకపూరితముగ పదమును వాడి, దాని యర్థమును విశాలపఱచుటకు గాని, సంకుచితపఱచుటకు గాని దుర్వినియోగము చేయుట.

(vi) ఒక పదమును నిష్ఠూరార్థమునఁ గాని, యసభ్యతను పరిహరించుటకు గాని వాడి నూతనార్థమును కల్పించుట.

(vii) అజ్ఞానమువలన గాని, దుర్బోధకత్వమువలనఁ గాని పదము నితరార్థము లందువాఁడుట. ఉదా: శకారుని మాటలు (మృచ్ఛకటికమున)

గుణవాచకములైన పదముల యర్థపరిమితి యనిశ్చితముగా నుండుటచే నవి వివిధార్థములకు దారితీయు ననుట స్పష్టము.

1. ఒక వస్తువును పేర్కొనపుడు కాని, యాలోచించినపుడు కాని, యా వస్తువు మనస్సుపై ముద్రితమగును. ఆ ముద్రయందుఁ గొన్ని గుణములు, లక్షణములు మిగిలినవానికంటె నధికముగ ద్యోతకమై యాకర్షణీయముగ నుండును. ఈ విశేషలక్షణములు శ్రోతలయొక్కయు మాట్లాడువారి యొక్కయు దృష్టిపథముపైన, ననుభవములపైన నాధార పడియుండును. అందుచే జాతిపరమైన యాపద ముపజాతి పరముగా

మాత్రమే ప్రతిపాదింపఁబడును. ఉదా: మృగపదము సామాన్యజంతుపరమై తర్వాత లేడికి మాత్ర ముపయుక్తమైనది. తమిళభాషలో 'మగన్' అనఁగా కుమారుఁడను యర్థము. అది తెలుఁగున 'మగఁడు' కాఁగా భర్తయని యర్థమైనది. నూతన పదము వాడుకలోనికి రావలసి యుండగా. కొంతకాలము ప్రాచీనపదము రెండర్థములనుగూడ ప్రతిపాదించుచుండవలెను. కానిచో ప్రాచీనపదమునకు **నూతనార్థము** వ్యాప్తికి రాక త్వరలో నశించును. ఇటివి యాంగ్లభాషలోఁ గూడఁ గొన్ని కలవు. ఉదా:

| | ప్రాచీనము | నవీనము |
|---|---|---|
| Voyage | ప్రయాణము (journey) | నౌకాయానము (journey by sea) |
| Purchase | సంపాదించు (procure) | కొను (procure by money) |
| Meat | ఆహారము (food) | మాంసాహారము (flesh food) |
| Starve | చావు (die) | ఆకలిచే చావు (die of hunger) |

ఇట్లనేకము గలవు. ఈ యర్థవిపరిణామము స్వరవిపరిణామము (phonetic change) వలెనే యొకప్పుడొక మండలమునకు, భాగమునకు మాత్రమే వ్యాపింపవచ్చును. ఒకప్పుడా జాతిభాష నంతకు వ్యాప్తి చెందవచ్చును. లేదా భిన్నతత్త్వములచే నణగిపోవచ్చును. ఉదా: మాండలికార్థములు. 'దారము'నకు మధ్యాంధ్రదేశమున వస్త్రములు కుట్టుకొను నూలుదారమని యర్థమగును. ఆ పదమే రాయలసీమలో లావైన త్రాడున కర్థమగును. 'నూయి' అనఁగా మధ్యాంధ్రదేశమున బావి యని యర్థము. ఈ పదము రాయలసీమలో నర్థమే కాదు. బావికి దిగుడుబావి (పెద్దది) యని యర్థము. ఇట్లనేక పదములు.

**2.** ఒక పదమునకు ప్రధానార్థ మొకటి యుండగా, మాట్లాడు వారికిని వినువారికిఁగూడ సంపర్క ప్రభావమున (influence of analogy) మఱియొక యప్రధానార్థము స్ఫురించి, క్రమముగా నది బలపడి వ్యాప్తి చెంది, ప్రధానార్థమును త్రోసివుచ్చి నూతనార్థమే రూఢి యగుట. ఉదా: సంభావన=గౌరవము = పెండ్లిలో నిచ్చు దక్షిణయను నర్థమున పరిణమించినది. (2) సంతర్పణ = తృప్తిపరచు = అన్నదానము;

(3) రాచకార్యము = రాజ్యాంగవిషయ ప్రసంగము ; = కబురులు చెప్పు కొనుట (4) పెండ్లినడకలు=పెండ్లియూరేగింపులలో మెల్లగ నడుచుదురు, కాన మెల్లగా నడచినపుడు పెండ్లినడకలని సార్థకమైనది. ఇది యర్థ చలనము. (shifting) (5) (చంద్ర)మా=చంద్రుడు. తర్వాత మాసమని దీని మీఁద వ్యాపించినది. month-menses మొ॥ అక్లే, నెల=చంద్రుడు (నెలబాలుడు) = మాసము ; (చంద్రమా నుండి చందమామ యైనది) ; (6) ఆంగ్లభాషలో బోర్డు (Board) అనఁగా బల్లయని యర్థము. ఇది క్రమముగా Cobboard తిండిపదార్థములు పెట్టుకొను బల్లయై, తర్వాత Board of revenue Board of studies అని కొన్ని సంస్థలకు కూడ పేరు వహించినది.

(3) కొన్నిపదము లొకప్పుడు నిందాగర్భితములుగా (ironically) వాడఁబడి యన్యార్థద్యోతకము లగును. ఉదా : గ్రంథకర్త. నీవు కూడా గ్రంథకర్తవైనావా ' అనుటలో గ్రంథకర్తపదమునకు సామాన్యార్థమైన పుస్తకరచయిత యని కాక, గ్రంథసాంగుఁ డనగా కృత్రిము డని భావము గలుగును.

(4) కొన్ని సరళపదములుకూడ నసభ్యములై శోచనీయార్థము నిచ్చును. ఉదా : అశుద్ధము. శుద్ధము, శుభ్రము గానిదని పదమున కర్థము. కాని యీ పద మమేధ్యమునకు రూఢియైనది.

ఇట్టి యర్థవిపరిణామము ధ్వని పరిణామమువలె, వ్యక్తులనుండి మొదట ప్రారంభమై క్రమముగా గొన్ని ప్రదేశములు, మండలములు వ్యాపించి యీ భాషాజాతి నంతయు వశ్యము చేసికొనును. కొన్ని పదముల యర్థములు వివిధకాలములలో మారును. ఒకప్పు డేకకాలమున నే వివిధమండలములలో నొకటేపదము వివిధార్థముల గ్రహింపఁబడ వచ్చును. ఉదా : విందు శబ్దము నల్లసాని పెద్దన, శ్రీనాథుడు నతిథియను నర్థములో వాఁడుటకు వారి కాలమున నా పదమున కాయర్థ ముండెను. ప్రస్తుతకాలమున నా పదమునకు పుష్కలమైన భోజన మని యర్థము.

నన్నయ 'బ్రాహ్మణార్థము 'ను పదము నాహారతృప్తియను నర్థమున వాడినాఁడు. ప్రస్తుతకాలమున దానికి శ్రాద్ధకర్మయని యర్థ

మగుచున్నది. ఇట్టివే, తర్పణము, అభిప్రాయము, రచించు, వరియించు ఉపదేశము మొదలైనవి.

కుడుచు=భుజించు=నేటికాలమున దురర్థముకలదు.

(1) గీర్వాణము : గీర్వాణులు=దేవతలు: బాణమువంటి మాటలు (శాపములు) గలవారని యర్థము-నవీనార్థము-గర్వము, పొగరుపోతు తనము నని.

(2) అనుమానము : పరోక్షనిశ్చయ మని మూలార్థము. 2. సంశయమని ప్రస్తుతార్థము (ఉత్త రా. 8-33 భార-ఉద్యో-II-160.)

(3) ఫలహారము : ఫలముల యాహారము-అల్పాహారమని యిప్పుడు.

(4) ప్రారబ్ధము : ఆరంభించినది. 2. పూర్వజన్మమున చేసిన పాపకర్మ.

(5) దాహము : కాలుట, 2. దప్పి.

(6) ఉచితము : తగినది, 2. (free,) ప్రతిఫలము లేకనే యిచ్చుట.

(7) గగనము : శూన్యము - అసాధ్యము.

(8) జిజ్ఞాస : తెలిసికొనవలయునను కోరిక 2. వ్యాసపు పాట.

(9) దక్షత : సామర్థ్యము 2. పెద్దవాళ్లు.

(10) కైంకర్యము : కింకరస్యభావః-సేవ ; 2. దొంగిలించుట.

(11) ఛాందసుడు : వేదపండితుడు శ్రోత్రియుడు ; 2. లోకజ్ఞాన శూన్యుడు.

(12) ముష్టి : పిడికిలి 2. బిచ్చము

(13) దండము : కఱ్ఱ 2. నమస్కారము.

(14) చిత్తము : మనస్సు 2. సరియే, అట్లే అని.

(15) స్వయంపాకము : స్వంతముగా వండుకొనుట 2. వండుకొనుట కిచ్చు సామగ్రి.

(16) ప్రియము : ఇష్టమైనది. 2. హెచ్చువిలువ

(17) స్వస్తి : (సు+అస్తి) మంగళము, 2. 'మానివేయు' అని.

(18) అన్యోన్యము : పరస్పరము, 2. ప్రేమ.

(19) అవసరము : సమయము. 2. ఆవశ్యకము. 3. తొందరపడుట.

(20) ఆగ్రహము : పట్టుదల, 2. కోపము.

(21) కుశలము : నేర్పు, కౌశల్యము, 2. క్షేమము.

(22) పథ్యము : హితము, 2. రోగికిచ్చు నాహారము.

(23) తద్దినము : ఆ దినము, 2. ఆబ్దికము.

(24) మంగళ సూత్రము : త్రాడు, 2. పుస్తెలు.

(25) మధుపర్కము : తేనె, నెయ్యి, పెరుగు, చక్కెర, నీరు కలిపి యతిథి కిచ్చునది, 2. అల్లున కిచ్చు నూతనవస్త్రములు.

(26) అయోమయము : ఇనుపది, 2. దుర్బోధము, తెలియ రానిది.

(27) దేవతార్చనము : పూజ, 2. భోజనము.

(28) భద్రము : శుభము, జాగ్రత.

(29) గ్రహచారము : గ్రహముల సంచారము, 2. దురదృష్టము.

(30) గాడుపు : గాలి, వేడిగాలి.

(31) పెండ్లికొడుకు: వడక పెండ్లికొడుకు, గర్భాదాన పెండ్లికొడుకు.

(32) సన్యాసి : సన్యాసాశ్రమము పుచ్చుకొన్న వాడు, 2. శుంఠ ; పనికి మాలినవాడు.

(33) అవస్థ : స్థితి ; 2. దుస్థితి.

(34) వర్తమానము : ప్రస్తుతకాలము. 2. కబురు.

(35) సదుపాయము : మంచి యుపాయము. 2. వీలు చేయుట.

(36) దురంతము : చెడు అంతము. 2. క్రౌర్యము, దౌర్జన్యము.

(37) అభిజాత్యము : పుట్టుక. 2. కులము.

(38) ఉద్యోగము : ప్రయత్నము. 2. వృత్తి.

(39) తీర్థము : జలము. 2. క్షేత్రము (పుణ్య.)

(40) వాచకము : మాట్లాడుట, (Reader).; చదువు పుస్తకము.

# ఐదవ ప్రకరణము

## మాండలికములు - సోదరభాషలు

## (DIALECTS & COGNATES)

మానవులు దమ భావములను, యోజనలను పరస్పరము వాగ్రూపమున స్పష్టముగాఁ దెలియఁబఱచుకొను సాధనమే భాష యనఁబడును. ప్రతివ్యక్తియు దీనిని బాల్యమునుండియుఁ దాను పుట్టి పెరిగిన సంఘమునుండియే యనుకరణ రూపమున నలవరచుకొనును. శ్రవణోచ్చారణ శక్తులపై ముఖ్యముగా నాధారపడి, యనుకరణపూర్వకమైన పునరుచ్చారణ క్రమమైనదే భాష గనుక, నిది సర్వత్రా యేకముగా నుండజాలక, కొన్ని స్వరములును ధ్వనులును మార్పులు చెందుచుండుట సహజమే. ప్రతి మనుష్యుఁడు నుచ్చారణమున నితరవ్యక్తి కంటె కొంచెమైనను భేదము గలిగియే యుండును. భాషోచ్చారణమున నీ విధమైన వ్యక్తిగత విలక్షణములకు హేతువులు బాహ్యములు నాంతరములని రెండు విధములుగా నుండును. నిర్లక్ష్యముగా వినుట, వాగింద్రియగత దోషమున దష్టోచ్చారణము, వ్యక్తిధోరణి, కొన్ని స్వరములు నొకానొక ధోరణిలో నుచ్చరించవలెనను నభిరుచి, పరిశీలన సామర్థ్యము మొదలైనవి యాంతర కారణములు. ఇఁక, దుష్టపద విభాగము, సాదృశ్యము, వర్ణాగమము, వర్ణసమాకర్షణము (Harmonic squence) మొదలైనవి యన్నియు ప్రపంచమందలి సకలభాషలందుఁ గాననగు స్వరనియమములను మితిని పాటించి బాహ్యకారణములగు చున్నవి శీతోష్ణస్థితులుగూడఁ మానవుల వాగింద్రియములపైఁ గొంత ప్రభావము చూపును. ఇట్లు వివిధవ్యక్తులలో శబ్దశ్రవణ గ్రహణోచ్చారణ శక్తులు వేరువేరు విధములుగా నుండుటచే నందరిలో నీ యుచ్చారణ పద్ధతి సమానముగా నుండునని యెంచుటకు వీలులేదు. గ్రహణశక్తిలోఁ గాని, శ్రవణోచ్చారణేంద్రియములందుఁగాని యున్న లోపములచే ప్రతివ్యక్తియుఁ దన సంఘమందలి భాషను నేర్చుకొన ప్రయత్నించుచు, నా భాషాధ్వనులను

యథాతథముగ నుచ్చరింప లేక, యీ సంఘముపైఁ దన ప్రభావమును జూపుట కూడఁ గలుగును. భాషలోని పదము లెట్లు మార్పు చెందునో వెనుక ప్రకరణములో పరిశీలించితిమి.

మాండలికములు.

కాన ప్రతిభాషయు నిత్యపరివర్తన స్థితిలో నుండునని యెంచఁబడినది. పై కారణములను బట్టి పరిశీలించినపు డొక మండలములో భాషించు వారెంద ఱుందురో యన్ని విధములైన భాషాభేదములున్నవని యెంచుటయు గూడ నసంభావ్యము గాదు. ఎట్లన, మన మొకానొకనిఁ జూడకుండగనే గేశియో మొదలైనచోట్ల, నాతని పరిచిత కంఠస్వరమును బట్టి యాతనిని గుర్తింపఁ గల్గుచున్నాము. ఈతీరు మానవులందే కాక, పశుపక్ష్యాదు లందుఁ గూడ గోచరించుచున్నది. పశుపక్ష్యాదులు దూరమునుండి తమ యజమానుని పిలుపును నాతని కంఠస్వరమును బట్టి గుర్తింపఁ గలుగును. ఆ పిలుపు తమ యజమానుని కంఠస్వరము గాక యితరులదైనచో నవి సమాధానము నొసఁగవు. ఇదే భేదము. ఉచ్చారితశబ్ద మేకమే యైనను వివిధవ్యక్తులలో నా యుచ్చారణ స్వరవైఖరి భిన్నముగా నుండునని దీని వలన స్పష్టము. కాని సామాన్యముగా నీ యుచ్చారణ భేదములు మాట్లాడు వానిని సంఘ మర్థము చేసికొనుట కడ్డము రానంత సూక్ష్మముగా మాత్రమే యుండును. కాన నవి సాధారణముగ సహింపఁబడి నిర్లక్ష్యము చేయఁబడును. అర్థము గానంతగా మితిమీరి పోవుచున్నపుడా యుచ్చారణ విలక్షణములు నిరోధింపఁబడును. తన భావముల నితరులకుఁ దెలుపుట కేదే నొకభాష నుపయోగించు ప్రతిమానవుడు నీ విధముగనే చేయును. అతఁ డెప్పుడును సాధారణమైన మాధ్యమిక స్థితిలో మాట్లాడుటకు జాగ్రత వహించును, కాని యితరులు తన్నర్థము చేసికొనజాలనంతగా వ్యతిక్రమించి పోఁడు. ఇట్లు పరస్పర గ్రహణ మెల్లప్పుడును ప్రమాణముగా నిర్ణయింపఁబడి, యీ పరిమితిలో మాత్రమె ప్రతివ్యక్తియుఁ దన విలక్షణములతో నుండి, యెవడును మితిమీరుటకు సాహసింపఁడు. ఈ విలక్షణముల నితరులు పాటింప నంతవఱకు నా పరిసరములందలి భాషలో నవి యెట్టి మార్పును గలుగఁ జేయవు. ఏ

భాషలో నైన నీ విలక్షణము లితరులచే గుర్తింపఁబడి వ్యాపించినపుడే మాండలికముల యుత్పత్తికి దారితీయును. కొంతకాలమునకు భాషా విలక్షణము లాయాప్రదేశములలో స్థిరపడిపోవుటకు మొదలిడి, యందలి జనసమూహమందు సామాన్యలక్షణములుగ పరిణమించును. ఇట్లు వివిధమండలములలో వివిధమైన భాషోచ్చారణ విలక్షణములు స్థిరపడి మాండలికములుగా విలసిల్లును. ఇట్లేర్పడిన వివిధమాండలికములలో నొకటి యితరముకంటె కొన్నివిధముల భిన్నముగా నుండినను, ఆ యితర మాండలికములను మాట్లాడు వారికి బొత్తిగా నర్థము గానట్లుగా మాత్ర ముండదు.

మాండలిక భేదములు

ఒక చిన్నగ్రామములో నివసించు జనులు మాట్లాడు భాషోచ్చారణము సర్వసమానమ్ముగా నుండును. వీరిని నందలి జనులందరు పరస్పర మెప్పుడును నన్యోన్య సంభాషణము చేయుచుందురు. కాని యా భాష యొక గ్రామమును గాని, జిల్లాను గాని దాటిపోయి యొక రాష్ట్రమునకుఁ గాని యనేక జిల్లాలకుఁ గాని వ్యాపించి వ్యవహారములో నున్నచో, ఆ రాష్ట్రమందలి ప్రజలందరిలో నుండు భాషావ్యవహారము సమానముగను, నేకముగాను నుండఁజాలదు. వారిలో సన్నిహిత సంబంధము, సమానాభిరుచి, సామీప్యము మొదలైన కారణములచే ప్రత్యేకసంఘములుగ నేర్పడును. కాన నా భాషలో సమానోచ్చారణము కాంచఁజాలము. ఒక సంఘమందలి యుచ్చారణము మఱియొక సంఘమందలి యుచ్చారణకంటె భిన్నముగా నుండును. ఆ భాషయొక్క యీ వ్యావహారిక రూపములు మాండలికములని పిలువఁబడును.

మఱియు సంఘమునఁగల మత, కుల, సాంఘిక, రాజకీయార్థిక వ్యవస్థలు భాషలో గుణపరిమాణ పూర్వకములగు నూత్న విలక్షణములను పెంపొందింపఁ జేయును. ఇట్లే వయసు ననుసరించి యొకేవ్యక్తికి బాల్య యౌవన వార్ధక్యదశలలో భాషోచ్చారణ మారుచుండును. తెలుఁగు భాషలో, నుదాహరణకు, (1) సముద్రప్రాంతపు జిల్లాలు, (2) గంజాము,

(3) హైదరాబాదు, (4) రాయలసీమ, (5) నెల్లూరు, మద్రాసుమండల మండలివి పరస్పరము భేదముగ నుండును. వానిలోఁ గూడ, వివిధకులము వారి భాషలకును, భేదము గలదు. అయినను, నొక మండలమువారి తెలుఁగుభాష యింకొక మండలము వారి కర్థముగాదని చెప్పలేము. మాండలికభాషల ముఖ్యలక్షణము లేవనఁగా, (1) అది ప్రధానభాషలో నొకభాగము మాత్రమే యగును (2) అది యెప్పుడు నొకానొక మండలము, లేక జిల్లాలోని, జనసంఘమునకు మాత్రమే పరిమితమై యుండును. (3) అది స్వాతంత్ర్యముగా భాషాసారస్వత సంప్రదాయములను నిర్మించుకొనఁజాలదు ఈ పని ప్రత్యేక స్వతంత్రభాషలకు మాత్రమే సాధ్యమగును.

ఆంధ్రప్రదేశమున నొక మండలమందలి భాష యింకొక మండలమండలి భాషకంటె నెట్లు విభిన్నముగా నుండునో తెలుపుట కనేకోదాహరణము లున్నవి. Linguistic Survey of India Vol. IV లో Grierson గారీక్రింది మాండలిక భేదోదాహరణములను తెలుఁగున కొసంగిరి.

(1) కోంటావు. ఇది చందాలో వాడఁబడుచున్నది. 1901 సం. జనాభా లెక్కల ప్రకారము కేవల 220 జనులు మాట్లాడుచున్నట్లు తెలుపఁబడెను. ఉదా: "ఒక మనిషికి యిద్దరు పిల్లగాండ్రు వుండిరి. — తన సంపత్తు పాడుగొట్టినాడు — వాని అంతా వొడ్సినంక ఆ దేశములో లావు కరవుబడెది. అందుకు వానికి కతనము బడెన."

(2) కామాఠీ: దీనిని బొంబాయిలో నిటుక కాల్చువారు మాట్లాడుదురు. ఉదా: "వక్కమనిషికి ఇద్దరు కొడుకులు ఉండుండ్రి —తోడ్యం (కొన్ని) దినాల్లు కాలే ఇంతట్లా చిన్నకొడుకు తనది అంత హిస్సా (వంతు) జమచేసి దూరదేశంకు యెల్లిపోయిండు."

(3) బేరడీ: దీనిని బెల్గాములో నున్న యనాగరక జాతివారు మాట్లాడుదురు. ఉదా: "ఒకని కొక్కసిక(ఒకానొక) గిరెస్తనక్ (గేస్తునికి) ఉద్రు (ఇద్దరు) పటి (మగ) బిడ్డు ఉడ్రి వర్దానాక్ (వారిలో) సణ్ణకొడక్ తన్ అయ్ కే అండె (అనెను). రంగ అంత్ (రంగడను) హుడిగేడ్

(బాలుడు) గోవిందనక్ సెప్తాడ్ 'మీా యక్స్ ఎంక్ పోడాయి (మీా తల్లి యెక్కడికి పోయింది)'

(4) వడరీభాష : ఇది బొంబాయి రాజధానిలో రాష్ట్రప్రవృ పాటకప్రజలు మాట్లాడునది. ఉదా. "అనాఁ (అనెను) ఆయిండ లేదు (అయియుండలేదు) కుడ్స్పిస్సి (కూడ నేను పోసిన). తిన బదకు (తన యాస్తి). సప్పకిహ్యా (సహాయము) ఎంగాలు మీప స్యాంకి (మేపుటకు) సేనకు (చేనికి) అంస్య (అనియెను)।

ఇవి విద్యావిహీనులైన యనాగరికులచేఁ బుట్టు తెలుఁగు మాండలికములు. ఇందు సాంస్కృతము, వ్యాకరణము లేని పోవుటచే నివి భ్రష్టములుగా మారును. ఇఁక నాగరికులు, విద్యావంతులునైన వివిధ మండలములవారి తెలుఁగుభాష యెట్లుండును? (1) మధ్యాంధ్ర దేశ, (2) తెలంగాణా, (3) రాయలసీమ, (4) విశాఖజిల్లా, (5) నెల్లూరుజిల్లా లందు మాట్లాడు తెలుఁగును పరిశీలించిన స్పష్టమగును.

1. మధ్యాంధ్ర దేశ భాష : "వాడిట్లా వచ్చాడు, పిడల్లా పోయాడు ; వాడు వస్తాడా, రాడా ? ; పోతే పోయాడు, వస్తే వచ్చాడు. పోని ; రానూ రాడు, పోనూ పోడు. ఎల్లా చేస్తాడో, పోతే పోతాడు, వస్తే వస్తాడు. వస్తానట్రా, ఏమిటి చెప్పూ ! అంతా బాగుంటే, ఏమైంది, పోయావా, లేదా వండడము, తినడము, చేయుడము మొదలగునవి."

2. నెల్లూరు మాండలికము : "అదేందిరా ; తెలుగువాడుదా ; నీ కెందుకులే. అబ్బో, నేరుగా (సూటిగా) పో, ఇప్పుడేంటి ప్రమాణం ; ఏలా గోంది అబ్బా ; రాలా"

3. రాయలసీమ తెలుఁగు : 'అన్నమాచార్యుల కీర్తనల' నుండి

పల్లవి॥ "పిల్లగ్రోవి వట్టు మంటాఁ బెరరేఁచీసి మా
గొల్లవారి పిల్లఁగోవి కోరో చల్లా॥
చ॥ "చేరినన్ను నాడు మంటాఁ జెకుఁ రొక్కని తా"
"కిన్నెర మీాటు మంటాఁ గెలసీని తన్నుఁ." పుట 76

"తెలుపు జలములలోన తెప్పవలెఁ దేలీనే" పుట 16

"దిట్టవై పరిమళానఁ దిరిగేవు" (తిరిగెదవు). పుట 11

"జాణతనా లాదేవేలే జంపు గోల్లెతా వోరి" పుట 78

"నూ యింటె చల్లేల నీకు మనసయ్యేరా"(నయ్యేరా) పుట 78

మఱియు వస్తుడు. (వచ్చును - వస్తాడు); ఇచ్చేది లేదు (ఇవ్వను - ఈయను). ఇస్తువా (ఇస్తావా); అవసరపడు (తొందరపడు); గమ్మనుండు (నిశ్శబ్దముగా నుండు); నిండా (చాలా), లావుగా (అధికముగా); ఆడ, అక్కడ అనుటకు; ఈడ, ఇక్కడ అనుటకు, ఏడ, ఎక్కడ అనుటకు; మొలక, మొక్క అనుటకు, కొట్టేడు, కొట్టాడు అనుటకు.

**4.** తెలంగాణా తెలుఁగు: "అయ్యవారిని తోల్కొని రమ్మ. (తోడ్కొనిరమ్ము - తోడఁగొని రమ్ము - తీసికొని రమ్ము; "లడయోర భేదః" కాన డకారమునకు లకారము వాడఁబడినది) దొరసానిని వడగొట్టి రమ్ము; చేసుడు - వండుడు. వచ్చిండు - పోయిండు; బట్లు (బట్టలు) గొట్లు (గొట్టెలు); బనాయించు, రుకాయించు, పిలాయించు మొదలగు ఉరుదు పదముల కించుగాగమము: వస్తావుర, తింటావుర. (ప్లుతితో); ఏడకు పోతాడ్; ఎరిక్కే కదా; వేరే మనిషై పోయింది; అడిగింటిని; అన్నం తినేశుండు." మొ॥ కొట్టెండు, కొట్టాడు అనుటకు.

**5.** విశాఖజిల్లా తెలుగు (తూర్పుభాష) "ఏడ పోయిందు; తప్పేం దేంటి; బయల్దేరండీ; ఎల్లాం; తెల్దు; ఏడాలో తెల్దు, పెద్దాడు చెడ్డ చౌకట; ఏంటీ ఇచ్చేస్తున్నారు; కళ్లు కన్పట్ట లేదో; రాశినావూ; వెళ్లి పోటమే; వత్తున్నారు; వెళ్లిపోయిచ్చాడు.

పై తెలుఁగు మాండలిక భాషలలోఁ గొన్ని పదములు, ప్రత్యయములు, యాసమాత్ర మితరమండల వాసులకుఁ గ్రొత్తగా నుండి యర్థము కాక పోయినను, సందర్భమును బట్టి వాక్యతాత్పర్యమంతయు బోధపడుచునే యుండును. అందులకు కష్టముండదు. ఇంత వఱకు

లోపము లేదు. కాని కొన్ని మండలముల భాష విపరీతార్థమును, నొక
ప్పుడు దురర్థమును గూడ నొసఁగి మాట్లాడువారి యందు ద్వేషము
గలిగించును. చూడు డీ క్రింది మద్రాసు తెలుఁగు వైచిత్ర్యము. మద్రా
సులో బట్టలయంగడివారు తెలుగు స్త్రీలను చూచి యమాయకముగ
నిట్లు పలుకుదురు.

6. మద్రాసు తెలుఁగు: "ఏమండీ, మీా రెప్పుడు మా యంగ
డిలో నొక్కమారైనా తుని (బట్ట) యెత్తగే (కొనగే). మాది మీాకు
పట్టదా (కుదురదా). ఒక్కమా రెత్తుడీ పట్టుతుంది" ఇందలి యుక్తుల
దురర్థములు మధ్యాంధ్రదేశము వారికి స్పష్టము. ఒకమారు రైలు
స్టేషను దగ్గర రైలుబండిలో నెక్కుటకు కొక ల్యామైన స్త్రీ సామానులను
రెండుచేతులలోఁ బట్టుకొని రైలువేళ మించి పోవుచుండుటచే త్వరగా
ప్లాటుఫారం మీాద పోవుచుండగా నొక రైలుకూలి యామెను చూచి.

"ఆ బండిలో ఆడవాళ్లు లావుగా (అధికముగా) ఉన్నారు.
అడకు పో అమ్మా" అని అమాయికముగా అనెను. అంత నా స్త్రీ
లజ్జపడి ఆడవాళ్లబండిలో నెక్కక, సమీాపములో పూర్తిగా పురుషు
లున్న బండిలోని కెక్కెను. ఇంకొక మారొక మధ్యాంధ్ర దేశీయు
డొకనిని గాంచి "భోజన హోటలెక్కడున్న"దని ప్రశ్నింపఁగా
నాతఁడు, "అడ పో, దుడ్డుచ్చుకొని వేస్తారు" అన్నాడు అంతల కాయన
భయపడి యా వైపు పోక, మరొక దిక్కుకు పోయి, పస్తుండుటకైనా
సహించెను. 'దుడ్డ'నగా డబ్బని యక్కడ, కఱ్ఱని మధ్యాంధ్రదేశమున
నర్థము. అట్లే 'వేస్తా' రనగా కొట్టుదురని వీరి యర్థము, పెట్టుదు
రని వారి యర్థము. ఇట్లే ప్రపంచమున అన్నిభాషలలోను మాండలి
కములుండి, యితరమండలమువారికి కొన్నిపదములు పూర్తిగ యర్థము
గాక పోవుటయు, నొకప్పుడు దురర్థమును గూడ గలిగించి కలహకారణ
మగుటయుఁ గూడ సంభవించుచుండును.

ప్రాచీన కాలమున దూరదూరముగా చిన్నచిన్న పల్లెటూళ్లుండి,
యందు మాండకములు వెలసెడివి. వాని యందలి మాండలికముల

కలయిక యీ క్రింద బొమ్మలోఁ జూపినట్లుండును. ఇందు మాండలిక ములు వేరువేరుగా వర్తిల్లును.




ఈ క్రింది బొమ్మలో నిత్యవ్యవహారములో నుండు మాండలిక ములు వర్తిల్లు రీతి చూపఁబడినది. వీనిలో మాండలిక భేదములు పొలిమేరలను మీరుచుండును.




మఱియు నొక్కొక్క మండలమున సమీపమాండలిక ప్రభావము నెఱపును. పై బొమ్మలో 5-వ మండలమున 1, 2, 4, 6, 8 మాండలికముల ప్రభావము చూపును. కాని దూరమాండలికములగు 3, 7 మాండలముల ప్రభావము చాల తక్కువగ నుండును. మఱియు నొక జిల్లాయందలి జను లా జిల్లామధ్యభాగమునకు దూరమై, ప్రక్క జిల్లాలకు సమీపముగా నుండుచో, వారిభాష యా మండల మధ్యభాగ మాండలికమునకు దూరముగను, సమీపేతర మాండలికమునకు దగ్గరగ నుండును.

పొలిమేర సమీపమున నివసించు జనులలో సర్వసామాన్యముగా భాషామిశ్రము మెక్కువగా జరుగుచుండును. తెలంగాణమున తురక మాటలును, నెల్లూరు, చిత్తూరుమండలములలో తమిళపదములును, శ్రీకాకుళము, గంజాము, విశాఖమండలములో నోఢ్రశబ్దములును వారి వారి స్వరములును కలియుచుండును. దీనికిఁగారణ మన్యభాషల మాట్లాడువారితో వారికిఁ గలుగు సంపర్క ప్రభావమే.

మాండలికముల పరస్పర ప్రభావము మఱియొక విధముగ నీ క్రింది బొమ్మలలోఁ జూపఁబడిన రీతిగకూడ నుండును.



ఈ మూఁడు వర్తులాకారములలో వరుసగా క, చ, ట యను నుచ్చారణభేదము లున్నచో 'క' మండలోచ్చారణము చ, ట మండలము లలోఁ గూడ వ్యాపించును. అట్లే చ, ట మండ లోచ్చారణలు గూడ. 1-వ ప్రదేశములో క+ట, 2-లో క+చ+ట, 3-లో క+చ, 4-లో చ+ట యుచ్చారణభేదములు మిశ్రమై యుండును.

మఱియు దూరముగా నున్న మండలములలోఁ గూడ కాకతాళీయ ముగా నుచ్చారణశబ్దసామ్యములు గనఁబడును. వీనిలో దూరమండలము లగుక, త లలో క విధోచ్చారణ సామ్యమును, చ-ప లలో చ విధోచ్చా రణసామ్యము నుండవచ్చును. ఉదా: ఆంధ్ర, మలయాళభాషలలో చక్కెరకు 'పంచదార' శబ్దము సమానముగ గలదు. కాని సమీప భాషలగు తమిళ కన్నడములలో నా పదము లేదు.

ఈ మాండలికములను మూడువిధములుగా పరిశీలింపవలసి యున్నది. (1) నామవాచకములు. (2) క్రియలు. (3) వాక్యరచన.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాలు | విశాఖ, గంజాం జిల్లాలు | నెల్లూరు, మద్రాసు | రాయలసీమ, తిరుపతి | హైదరాబాదు, తెలంగాణము |
| 1. దారము=నూలుదారం | | | దారము=లావుత్రాడు | |
| 2. కొను | | తీయు | ఎత్తు | |
| 3. నూయి (నుయ్యి) | | | బావి | |
| 4. వేగముగ, దబ్బున, | | బేగ | బిన్నె | |
| 5. తొందరపడు | | | అవసరపడు | |
| 6. రంకుమగడు | | | మిండడు | |
| 7. సూటిగ | | | నేరుగ | |
| 8. గేద | | | ఎనుము | |
| 9. నోరుమూసుకొనియుండు | | | గమ్మునుండి | |
| 10. మినుగులు | | | ఉద్దులు | |
| 11 (గస్తు) కంపు | | | గబ్బు | |
| 12 డబ్బు | | | రూకలు, దుడ్డు | |
| 13. కోపపడు | | | అరచు | |
| 14. ఆచ్చరపడు | | | చిత్ర(త్తర)పడు | |
| 15 కురియు | | | ఉరియు | |
| 16. మందము | | | దళము | |
| 17. పచ్చడి | | | తొక్కు, ఊరిపిండి | |
| 18. చాలా | | దండిగ | నిండా, మస్తుగ | |
| 19. ఎక్కువగా | | | లావుగా | |
| 20. ఏమిటిరా | ఎందిరా | | | |
| 21. దుకాణము | | | మండి | |
| 22. పప్పులు | | | బేడలు | |

క్రియలు

| | | | | |
|---|---|---|---|---|
| 1, తిరిగదవు | | | తిరిగేవు | |
| 2. ఇవ్వను | ఇచ్చేదిలేదు | | | |
| 3. వస్తాడు | | | వస్తుడు | |
| 4. వచ్చాడు | | వచ్చినాడు, | వచ్చిండు,(పోయిండు etc.) | |
| 5. వస్తాడా | వస్తుండు | | వస్తుడా | |
| 6. కొట్టాడు | | | కొట్టిడు | |
| 7. చేస్తాడు | చేస్తుండు | | చేస్తుడు | చేసుడు |
| 8 కుదరదు | | | పట్టదు | |

మాండలిక పదభేదములలో, సాగర సీమవాసులు తత్సమ పదముల నెక్కువగా వాడుదురనియు, తెలంగాణా రాయలసీమవాసు లచ్చతెలుఁగు మాటల నధికముగా వాడెదరనియు చెప్పియుంటిమి. నుడికారమునందును వైచిత్రి యెంతయో గలదు. "అయ్యగారిని తోలుకొని (తోడ్కొని)రమ్ము' 'దొరసానిని పడగొట్టిరమ్ము' వంటి వాక్యములు

తెలంగాణ
మాండలికము

తెలంగాణమున వింతగా దోఁపవు. అన్యప్రాంతీయు లివి విని యాశ్చర్య పడుదురు (1) 'వండడము, చేయడము' అనురూపములు సాగరసీమయందును, 'వండుడు - చేసుడు' అను రూపములు తెలంగాణమునను గలవు. తొల్లిటి క్రియారూపములు తెలఁగాణపుభాషలో కొంతవరకును, సాగరసీమభాషలో పూర్తిగను మారినవి. (2) 'వచ్చినాడు' అనుటకు తెలంగాణమున 'వచ్చిండు' అనియు, సాగరసీమలో 'వచ్చాడు' అనియు, (3) రూపములు అది, ఇది వంటిపదము లారంభమునందు క కారము చేర్చుకొని కది, కిది, గాడ, గీడ అను రీతిని తెలంగాణమునందు వినవచ్చుచున్నవి. (4) బహువచనమందు 'బట్టలు, గొట్టెలు' అనుటకు మారు, 'బర్లు, గొర్లు' వంటిరూపములు తెలంగాణమున కొన్ని మండలములతో వినవచ్చును. ఇది వర్ణవ్యత్యయముచే నేర్పడియుండును. (5) తెలంగాణవాసులు తమ సంభాషణములో నురుదుపదములను, సాగర సీమవాసు లాంగ్లభాషాపదములను విరివిగా వాడుదురు. ఇంచుగాగము చేర్చి యుర్దూమాటలను తెలుఁగుధాతువులుగా చేసికొనుట తెలంగాణములో కానవచ్చును. ఉదా: బనాయించు, గుజాయించు, సిలాయించువంటివి యిట్టివి. ఆంగ్లపదముల నిట్లు స్వతంత్రధాతువులుగా మార్చుటకు వలనుపడదు. చేయువంటి సహాయధాతువుల తోడ్పాటుతో మాత్రమే యివి వాడఁబడుచున్నవి. కాపచేసెను వంటివి (6) ఉచ్చారవైఖరులందును భిన్నమార్గములుగలవు. సాగరసీమవాసులు పదము చివర దీర్ఘముతీసి 'వస్తావ్వా' అని పలుకుదురు. ప్లుతస్వరము శబ్దాంతమున నున్నది. 'తెలంగాణమునం దిది పదమధ్యమందే వినిపించును. ఉదా: 'వస్తావుర, తింటావె.' ఉభయులును ప్లుతప్రియులే.

మాట్లాడు భాషలో నెన్ని వ్యత్యాసము లగపడుచున్నను, వివిధ మాండలికములను మాట్లాడు ప్రదేశములందు వర్తకము, రాకపోకలు, నిత్యవ్యవహారము మొదలైనవి జరుగుచున్నంత కాలము, పరస్పర సుబోధకత్వమున కెంతమాత్రము భంగ ముండదు.

సోదరభాష
ఏర్పడు రీతి

కాని యొక మండలమందలి జను లొకమారు మిగిలిన ప్రదేశములనుండి యేదో కారణముచే, ఉదా: నదీ పర్వతాదుల యడ్డుపాటుచే,ప్రత్యేకింపఁబడి పరస్పర వ్యవహారము లేకుండినచో, మాండలికభేదములు వృద్ధిపొంది, ప్రత్యేకతను సంపాదించుకొని, కొలఁది కాలములో నా మాండలికభాష స్వతంత్ర భాషారూపమును గ్రహించును. ఈ విధముగ నొక భాషారాష్ట్రమందలి జనులకు పరస్పర వ్యవహారమును, రాకపోకలు. లేనప్పుడును, నితర దేశీయులతో సంపర్క వ్యవహారములు మొదలైనవి గల్గినపుడును, వారిలో భేద మత్యధికమై, యొకభాషలోని మాండలికములు స్వతంత్రభాషలుగ రూపొందును. ఇవే సోదరభాష లనఁబడును. ఇట్లొక భాష వివిధభాషలుగా విడిపోయి, కాలక్రమమున వివిధభాషాశాఖలకు క్రమానుగ పరిణమించును. అయినప్పటికి నా భాషలన్నింటిలో మూల భాషలలో నుండి గ్రహించిన కొన్ని తుల్యలక్షణములుండి, వాని సామాన్యమౌలికమునకు సాక్షీభూతముగ నుండును.

కొన్నివిషయములు బాహ్య విదేశీయభాషా ప్రభావములచే పూర్తిగ వాని సాజాత్య మాచ్ఛాదింపఁబడి, చారిత్రక తుల్యాత్మక శాస్త్రీయ పద్ధతులతో సూక్ష్మముగా పరిశీలించిననే కాని, వాని సాజాత్యత్వ మనుమానించుటకు వీలుపడదు. "ఏ జాతియుఁగూడ విదేశీయ శబ్దజాలమును గ్రహింపనంతటి ప్రత్యేకముగా నుండఁజాలదు. కొన్ని విషయములలో నీ యెరువుమాటలు జాతీయ భాషాధర్మమును గూడ పూర్తిగ మార్చివేసి, జాతీయధర్మమును మించిపోఁజేసినవి." (ఉదా: సంస్కృతభాషా ప్రభావము తెలుఁగుయొక్క ద్రావిడభాషా ధర్మములను పూర్తిగ మార్చివేసినది). అని మాక్సుమిల్లరు తెలిపెను. తెలుఁగుభాష మూలద్రావిడభాషా జన్యమైనను, సంస్కృతభాషా

సంపర్క ప్రభావమున, సంస్కృత శబ్దజాలమును, సమాసములును, మొదలైన విషయములు విశేషముగా నుండి, మూలద్రావిడభాషా లక్షణములు బహుస్వల్పముగా నున్నవి. రాయలసీమలో ప్రాచీన తెలుగుభాషారూపమును, దేశీయపదజాలము నెక్కువగా గోచరించును. సాగరప్రాంత కృష్ణా, గోదావరి, గుంటూరుజిల్లాలలో తెలుగుభాషా పరిణామస్వభావములును, సంస్కృతపదజాలము నధికముగా వాడఁబడును.

దక్షిణహిందూదేశ భాషలలో ముఖ్యమైన 5 తమిళ, మలయాళ, తెలుఁగు, కన్నడ, తుళుభాషలు సోదరభాషలుగ పరిగణింపఁబడినవి. ఇవి యన్నియు సామాన్య మూలభాష నుండి జన్మించి, ప్రస్తుత మవి స్వతంత్రభాషలుగ రూపొందినవి. అవి మొదట మాతృభాషకు మాండలికములుగ మాత్రమే కొంతకాలముండి, పైనఁ దెల్పిన కారణములచే ప్రత్యేక భాషారూపములుగ నభివృద్ధి చెందినవి. తర్వాత వానిలో ప్రతిభాషయు తన సంపర్కములోనికి వచ్చిన, ముఖ్యముగా సంస్కృతభాష నుండి, శబ్దజాలము నుత్సాహముతో పరిగ్రహించినట్లు గనఁబడుచున్నది. ఆచార్య మాక్సుమిల్లరు తెలిపినట్లుగా, "వీనిలోఁ గొన్ని భాషలపైఁ గల సంస్కృతభాషాప్రభావవిశేషమే యీ భాషల 'జాతీయముద్ర'ను పూర్తిగ మార్చివేసి, కొందఱిపండితుల నా భాషలు సంస్కృతము లేక యార్యభాషా జన్యములను భావమును గలుగఁ జేసినది." కాని యీ భాషలన్నింటిలోఁగల 'దేశ్యలక్షణము' సూక్ష్మ తారతమ్యపరిశీలనమువలన స్పష్టపడి, పై మత మంగీకార్యము గాదని ఋజువుచేయుచున్నది. కాల్డ్వెల్ పండితుఁడు ఈ విషయ పరిశోధనమున తొలుతటివాఁడు. ఆయన సిద్ధాంతములన్నియు పై 'జాతీయముద్ర' మీఁదనే యాధారపడినవి. ఆయన సిద్ధాంతము స్థిరపడినది. ఈ శాఖయందు దక్షిణదేశ విశ్వవిద్యాలయములలో నిటీవల పరిశోధనలు సలిపిన ప్రఖ్యాతవిద్వాంసులుగూడ నాయన ప్రాతిపదికమీఁద నాయన మతము నంగీకరించి, సమర్థించి, బలపఱిచిరి.

భాషయొక్క సాహితీ స్థోమతి

వెనుక గమనించినట్లుగ, భాష యొక్క స్వాభావిక క్రమాభివృద్ధికి మాండలికములు చిహ్నములు. మాండలికభాష యొకానొక భాషలో నొకభాగముగా నుండునంతకాల మా మాండలికభాషకు సొంతసారస్వత ముండఁజాలదు. కాని యొక మాండలికభాష దాని మూలభాషనుండి యొకమారు బాహ్యముగ విడివడిపోయి వేఱ తెంపులు చేసికొని స్వతంత్రభాషగా పరిణమించినచో, నా భాషను మాట్లాడు జనుల గుంపులు వారి ప్రతిభచేతను, సృజనాత్మకశక్తిచేత నా భాషను సారస్వత గౌరవముగల దానిగ నభివృద్ధి చేయఁగలరు. కాన నొకభాష సాహిత్యవాహకమై, లిఖితరూపము దాల్చుట కేవలము యాదృచ్ఛికము మాత్రమే. వ్యవహారికభాష సజీవులైన మానవశ్రేష్ఠుల స్వాభావిక వ్యక్తీకరణము. అవసరము నూతనసృష్టికి మాతవంటిది. అవసరమును బట్టియే నూత్నకల్పనము గల్గుచున్నది. సంఘములో మానవుల యవసరమునకై సృష్టించుకొనినదే భాష. భాషానిర్మాణము జరిగిన కొన్ని శతాబ్దములకుఁ గాని దానియందు సాహిత్యము గోచరింపదు. సంఘమున నేర్పడిన యొక సంస్కారదశాభివృద్ధియందు సాహిత్యము పుట్టి యీ సంఘపరిణామాభివృద్ధి దశలతో తరతరములందు నది సరిసమానముగా నడచును. కాఁబట్టి సాహిత్యము నాగరకతయు కళాదృష్టియుఁగల ప్రతిభావంతుల సృష్టి యగుచున్నది.

వ్యావహారికభాషలో శరీరావయవ చాలనాభ్యాస ఫలితములగు వాగ్ధ్వనులు విశేషసులభముగ మారు స్వభావముగల వగుటచే, నుచ్చారణకు స్థిరత్వమును గూర్చుటకై లిఖితరూపమును కూర్పవలె నను నుద్దేశము ప్రబలినది. ఇందు నిమిత్తమై యక్షరసమామ్నాయ చిహ్నములాధ్వనులకు ప్రాతినిధ్యములుగ సృజింపఁబడినవి. కాన వర్ణసమామ్నాయము (వాక్) చిహ్నములకు (లిఖిత) చిహ్నములైనవి. ముఖ్యముగా శాశ్వతసారస్వత గౌరవముగల విజ్ఞానమంతయు నిట్టి సాహితీ

స్థోమత గల భాషలో వ్రాయఁబడినది. అది సర్వసాధారణమైన వ్యావహారిక భాషయొక్క ప్రాచీనరూపమే. ఉనుల మాండలికములును, గ్రాంథికభాషయు నెప్పుడును ప్రక్కప్రక్కనే సాగిపోవుచు, వానిలోని భేదములు స్వల్పములై యవి సన్నిహితముగా నుండును. వ్యావహారికభాషనుండి నూతనజీవమును గ్రాంథికభాష యెల్లప్పుడును పొందుచునే యుండును.




వ్యవహారమండలిభాష క్రమముగా శాసనములలోని కెక్కి, తర్వాత నది కొంతకాలమునకు ప్రబంధాది గ్రంథములలో ప్రయోగింపఁబడి, పిమ్మట నది వ్యాకరణకర్తలచే నామోదింపఁబడి వ్యాకరణములందు సూత్రీకరింపఁబడి ప్రమాణార్హతను గణించుకొనును.

ఈ విధముగ గ్రాంథికభాషకు మాండలికములు ప్రక్కకాలువలగుటకంటె, పోషకములగుచున్నవి. తత్ఫలితముగ, వివిధశాఖలుగా పరిణమించి విడివడిపోవుచున్న మాండలికభాషల నేకముగాఁ జేరఁదీసి, వాని కైక్యము గూర్చుటకు గ్రాంథికభాష ప్రయోజనకారి యగును. ఈ కాలములోఁ గొన్ని భాషలందు గోచరించునట్లుగ, నిర్బంధక నియమ సూత్రములతో గ్రాంథికభాషను బంధించి వ్యావహారికభాషకు దూరమైనదిగా నెప్పుడును జేయరాదు. ఇందుచే నా గ్రాంథికభాష కృత్రిమ భాషగా తయారై, దాని ప్రయోజనమునే కోలుపోవును.

ఏదైన నొకభాష విశేష జనసంఖ్యాకులచే విశాలప్రదేశమున మాట్లాడఁబడినపు డది యనేక మాండలికములుగా విభజింపఁబడును.

ఆ విశాలప్రదేశమంతయు నొకేరాజుచే పాలింపఁబడి, యా దేశ భాషయే రాజకీయ వ్యవహారభాషయైనపు, డా భాషలోఁగల వివిధమాండలికములందలి రాజకీయవ్యవహారములు సాగుచున్నవని యూహింపవలయును. ఆ మాండలికమే సహజముగా రాజును, పరిసరమువారును మాట్లాడు మాండలికభాష యగును. ఇట్లు రాజు మాట్లాడు మాండలికభాషయే పాఠశాలలలో బోధింపఁబడి, దానిలోనే గ్రంథరచన సాగును. కొంత కాలమున కా భాషయే నాగరికులభాషయై, యా దేశసాహిత్యము దానిలోనే వ్రాయఁబడును.

గ్రాంథిక భాషాభివృద్ధి

ఏ భాషయైనను విశాల లిఖితవాఙ్మయము గలిగియున్నను, నిత్యవ్యవహారమున మాత్ర మేదేశమందైనను లేక యుండినచో నది మృతభాషగా పరిగణింపఁబడును. ఉదా: సంస్కృత ప్రాకృతములు, గ్రీకు, లాటిను మొదలైన భాషలు. భాష నిత్యము మారుచుండును గాన నది మాండలికభేదములతోఁ బెరిగి, యా మాండలికములు మాట్లాడువారికి పరస్పర వ్యవహారము లేక, వెనుకఁ దెల్పిన కారణములచే సోదరభాషలుగా మారినపుడు, మూలభాషలో సాహిత్యగ్రంథములున్నను, నూతన భాషయే నిత్యవ్యవహారమున నుండి, మూలభాష క్రమముగా నిత్య వ్యవహారమునుండి భ్రష్టమగును. అంతట నా మూలభాష మృతభాషగా పరిగణింపఁబడును. మానవులలో పితామహుడు మరణించినను, నతనికి పుత్రపౌత్రు లనేకు లెట్లుదయింతురో, యట్లే యొక మూలభాష మరణించిన దనఁగా నది యంతటితో పోయినను, దాని జన్యములైన యనేక భాషలు సజీవములై యుండక పోవు. ఉదా: ప్రాచీన మూలద్రావిడ భాష, సంస్కృతము, గ్రీకు, లాటీన్ భాషలలో విశేషగ్రంథజాల మున్నను, వానిని కొందఱు చదువ వ్రాయఁగలిగిన వారున్నను, నవి నిత్యము ప్రస్తుతము జనవ్యవహారమునుండి భ్రష్టమగుటచే నా భాషలు మృతభాషలుగ పరిగణింపఁబడినవి. వానికి వృద్ధిలేదు. వృద్ధి లేక పోవుటయే యొక విధమైన మృతచిహ్నము. మృతభాష యనఁగా నామరూపములులేని నశించిన భాష యని కాదు.

మృతభాష

# ఆరవ ప్రకరణము

## జాతి - భాష

జాతికిని భాషకును అనివార్య సంబంధము లేదు

వెనుకఁ దెలుపఁబడిన భాషావర్గీకరణమందలి కుటుంబములు, జాతులు, శాఖలు, సమూహములు నే యే ప్రదేశములందలి జనులచే మాట్లాడఁబడునో వివరము లక్కడక్కడనే సక్రమముగఁ దెలుపఁబడినవి. మూఁడవ ప్రకరణమున చేయఁబడిన భాషలవర్గీకరణమునకును మానవుల జాతి వర్గీకరణమునకు నెట్టి సంబంధమును లేదు. ఏలన, సంయుతధాతురూప పదభాషాజాతికిం జెందిన ద్రావిడభాషలును ఉరల్-ఆల్టైక్ భాషాకుటుంబపు భాషలగు టర్కీ, హంగరీ మొదలైన దేశభాషలును భాషావిషయికముగా సంబంధము గలిగియున్నను, మానవ జాతి పరముగ ద్రావిడజాతివారును, టర్కీ, హంగరీ దేశజనుల జాతికి నెట్టి సంబంధము లేదనుట సర్వవిదితమైన విషయము. కాన భాషా సంబంధమును బట్టి జనుల జాతిసంబంధమును నిర్ణయింప వచ్చు ననుట సమర్థనీయము గాదు. అనఁగా, భిన్నకుటుంబభాషలు మాట్లాడు జనులు జాతిచే సన్నిహితులు గావచ్చును; సన్నిహిత సోదరభాషల మాట్లాడు జనులు భిన్నజాతి మనుష్యులుగా నుండవచ్చును. 'ఇండో యూరోపియన్ జనులు, ఆర్యజాతి, లాటిన్ జాతి, కెల్టిక్ మనుష్యులు' వంటి వ్యవహారములు భ్రాంతిమూలకమైన యోజనలు కాకపోయినను, నవి తప్పక భ్రాంతికి దారితీయును ఒకప్పుడు జాతివలన దేశమునకును భాషకును కూడ పేరు రావచ్చును. ఉదా: ఆంధ్రదేశము ఆంధ్ర భాష. ఇంకొకప్పుడు దేశమువలన జాతికిని భాషకును పేరు సిద్ధింప వచ్చును. ఉదా: గుజరాతి, గుజరాతులు; మహారాష్ట్రి, మహారాష్ట్రులు మొ॥ మఱియొకప్పుడు భాషవలన జాతికిని దేశమునకుఁ గూడ పేరేర్పడ వచ్చును. ఉదా: మలయాళదేశము, మలయాళీలు; కన్నడీలు, కన్నడదేశము మొ॥. ఒకప్పుడు దేనివలన నితరములకు పేర్లు సిద్ధించి

నవో నిర్ణయించుట కష్టము. ముఖ్యముగా రాజకీయ సాంఘిక సంబంధములపై నాధారపడియే దేశములో నొకభాష వ్యాప్తిచెందుటయు, నితరభాషలు క్రమముగ క్షీణించుటయు జరుగును. రాజకీయ సాంఘిక నిర్వహణ మనఁబడు జాతి యొక ప్రదేశమున బహుకాలము స్థిరపడి యున్నచో, యక్కడ నొక జాతీయభాష నభివృద్ధి చేసికొనునని యనుభవమును బట్టి తెలియనగును. ఆ జాతీయభాష, చివర కితరసజాతీయ భాషలను గాని, విజాతీయభాషలను గాని, యా రాజకీయసంఘము నుండి తొలఁగించివేసి మాపుమాపును. ఆ దేశములో రెండు గాని యంతకెక్కుడు గాని జాతులవా రుండినచో, నా దేశము విజాతీయులచే జయింపఁబడి సన్నిహితమునకుఁ గొనిరాఁబడినపు డందలి జాతుల భాషలలో నేదో యొకటి క్షీణించి క్రమముగాఁ గొన్ని తరముల కస్తమించిపోవును. కాని యిట్టి ఫలిత మొందుట కా యా జాతులు కలిసిపోనక్కరలేదు. భిన్నజాతులవారు ప్రత్యేకముగా నుండి పోవచ్చును. కాని భాషలు మాత్రము కలిసిపోవును. సంకరము గాని పరిశుద్ధమైన జాతుల వారున్నను, వారి భాషలు మాత్రము ప్రాతపడిపోయి, యధికారముచేతఁ గాని, విజ్ఞానముచేతఁ గాని మిన్నయైన భాషయే ప్రాముఖ్యము చెందును. కాని యధికసంఖ్యాకుల భాషగూడ ప్రాధాన్యము చెందదు. భాషల కలయికవలన నితరభాషాశబ్దముల నెరవుపుచ్చుకొనుటయు, శబ్దస్వరములు మార్పునొందుటయు జరుగును. ఉదా: ప్రపంచమునందును హిందూదేశమునఁగల వివిధజాతులవా రాంగ్ల భాష నభ్యసించినట్లు.

తమ జాతిని సంకరముగాకుండ పరిశుద్ధముగఁ గాపాడుకొనిన 'జ్యూసులు' తమ మాతృభాషను గోలుపోయి, తమ జాతిభాషతో నేమాత్రము సంబంధము లేనట్టియు, తాము పుట్టి పెరిగి స్థిరపడిన యన్యదేశభాషనే స్వీయ భాషగా గ్రహించవలసి వచ్చినది. అమెరికాలోని యునైటుడ్ స్టేట్సునందలి నీగ్రోలాంగ్లభాషను, 'హాయ్టి'లోని నీగ్రోలు ఫ్రెంచిభాషను మాట్లాడుదురు. అమెరికా యిండియనులును, దక్షిణయమెరికా మధ్య

అన్యభాషా స్వీకరణము

భాగమందలి జనులు 'స్పానిష్' భాషను మాట్లాడుదురు. మలనేషియనులు, పాలినేషియనులకంటెను, మలయాద్వీపవాసులకంటెను నిస్సంకోచముగ భిన్నజాతి వారైనను, వారు మాట్లాడు భాషమాత్రము మలయో-పాలనేషియా కుటుంబమునకు చెందినది. రష్యాలోని మంగోలిడ్ జాతి మనుష్యుల 'ఉరల్-ఆల్టైక్' భాషలను 'స్లావోనిక్' భాష క్రమముగా నాక్రమించుచున్నది. సెమిటిక్కునకు జెందిన అరబిక్ భాష యవిచ్ఛిన్నముగ నాఫ్రికాలోని 'ఎథియోపిక్' నీగ్రోల జనసమూహములో ప్రవేశించుచున్నది. భారతదేశ విశేషభాగమునందలి ద్రావిడ జాతివారిపై సంస్కృతభాష తీవ్రప్రభావమును జూపినది. ఇటలీలోని ద్వీపకల్పములో విదేశీయులగు 'లిగూరియన్, ఎట్రుస్కియన్, ఐబీరియను' జాతులవా 'రిండోయూరోపియన్ లాటిన' భాషను మాట్లాడువారైరి. ఇట్లనేక దేశములందలి జనులు తమ మాతృభాషను గాక యన్యజాతిభాషలను స్వీకరించిరి. తమ భాషగ నిజముగా మాటాడక సజాతీయభాషను మాట్లాడువారి విషయమున సూచించినచో వారి స్వీయభాషయు, నూత్నపరిగృహీతభాషయు సోదరభాషలే యగును. జాతీయభాషగల ప్రతిజాతియొక్క వివిధలక్షణములను ప్రతిపాదించుటకు చారిత్రకవిజ్ఞాన మవసరము లేదు.

ఇట్టి చారిత్రకసత్యములను, భాషాశాస్త్రవేత్తలును, జాతిశాస్త్రజ్ఞులును, చారిత్రకులును గలసి నిస్సంకోచముగా నంగీకరించిన చారిత్రప్రామాణిక విషయములకంటె, చరిత్ర కందని పూర్వప్రాచీన కాలమున, నంధకారమున నణగిపోయిన యనాగరిక జాతుల విషయములు చాల యధికముగ నున్నవని తోచుచున్నది. చరిత్రప్రమాణమే లేనిచో యూరపులో హాంగరిభాషా స్థానవిషయ మొక క్లిష్ట సమస్యగా నుండెడిది. 'గాలు'ల భాష యొకటి యేషియామైనరు మధ్యభాగముగుండ నొకప్పుడు సాగిపోయి, పశ్చిమోత్తర యూరోపు మూలల మాట్లాడు భాషతో సంబంధముగల 'గాలషియన'ను నొక భాషాశకలమును నిలిపిరని యూహించుటకు కూడ నవకాశముండెడిది కాదు. ఆ భాషాశకలము గొన్ని శతాబ్దములు జీవించియుండిన తర్వాత

నమూలముగ నదృశ్యమై పోయి, దానిని భాషించు తరమువారిలో మిగిలినవారు విశాల మిశ్రజాతిలో నొకభాగముగా నొప్పి, చివరకు వారికి 'టర్కి' భాష స్వీయభాష యైనది. ప్రపంచమందుఁ జెలరేగిన జైత్రయాత్రలు, ప్రవాసములు, వలసయాత్రలు నెవ రూహింపఁగలరు? చారిత్రకప్రమాణము లేని దేశకాలములలో జాతులందును, భాషలందు నెట్టి విప్లవాత్మకమైన మిశ్రీకరణములు, విధ్వంసములు, నాక్రమణములు, స్థానభ్రంశములు జరిగినవో యెవరు చెప్పఁగలరు?

భారతదేశమున నార్యులకుఁ బూర్వము ద్రావిడులును, వారికిఁ బూర్వమే కోలులు, మంగోలీలను వివిధజాతుల వారు స్వీయభాషలను మాట్లాడుకొనుచు నుండెడివారని చారిత్రకులు విశ్వసించుచున్నారు. ఐతరేయబ్రాహ్మణకాలము నాఁటికే యుత్తరదేశమున నివాసముచేయుచున్న యాంధ్రు లార్యజాతికిం జెంది, సంస్కృతమును మాతృభాషగా గలవారు, కొంతకాలమునకు వింధ్యపర్వత ప్రాంతమందలి యనార్యులతోఁ గలసిపోయి, యనార్యభాషలను స్వీకరించి, మఱికొంతకాలమునకు వింధ్య దక్షిణమునకు వ్యాపించి, కృష్ణాగోదావరీనదుల ప్రాంతమున నాంధ్రరాజ్య స్థాపనము చేసి, ప్రాకృతభాష నవలంబించి పిమ్మట, నా ప్రాంతమందలి ద్రావిడభాషాకుటుంబమునకుం జెందిన తెలుఁగుభాషను చేపట్టి, వారిలో మిళితమైపోయిరి. తరువాత నీ తెలుఁగుజాతి యిక్ష్వాకులు, విష్ణుకుండినులు, శాలంకాయనులు, పల్లవులు మొదలైన పాలకుల కాలములలో ప్రాకృతసంస్కృత భాషలనే చేపట్టినది. కాని చివరకు రేనాఁటిచోళ, తూర్పుచాళుక్యుల కాలములలో వీరు స్వీయభాషయగు తెలుఁగు నభివృద్ధి చేసికొనిరి. మరల క్రీ. శ. 14, 15 శతాబ్దములు మొదలు తెలంగాణామున తెలుఁగుభాష తురకభాషాసమ్మిశ్రమును పొందఁగా, 17, 18 శతాబ్దములలో తెలుఁగువారు మధుర, తంజావూరులలో రాజ్యముల నేర్పర్చుకొనినపుడు తెలుఁగుభాషను పోషించినను, తమిళభాషాసంపర్కము పొంది, యక్కడ స్థిరపడిపోయిన తెలుఁగువా రిప్పుడు తెలుఁగుభాషను పూర్తిగ మఱచిపోయి, తమిళభాషనే స్వీయభాషగా మాట్లాడుకొనుచుండిరి.

ఒకజాతి స్వతంత్రముగ తనకు వదలివేయఁబడి, తనంతట తానే పెరిగి వృద్ధిపొందినపుడు, తన ప్రపితామహులు మాట్లాడిన భాషా పరిణామ భాషనే సహజముగా మాట్లాడు ననుటయు, నా జాతిలోని వారే యగు రెండువంశముల వారి నియమములలో సోదరభాషామాండలికముల మాట్లాడుట జరుగుననుటయు యథార్థమే యైనను, పైనఁ దెలిపిన పరిస్థితులలో నొకభాష పూర్తిగ భ్రష్టము గావచ్చును. కనుక, భౌతిక భాషా సాదృశ్యములు రెండును లభించినపుడు, జాతినిర్ణయ విషయమున, భాషాపరమైన ప్రమాణమున కెక్కువ విలువ సియఁగలమా? రెండు విధములైన జనులలో భౌతికసాదృశ్యము స్పష్టమగుచుండగ, వారి భాషాసాదృశ్య లోపము, వారి జాతిభేదమును స్థిరపఱచుటకు బలమైన ప్రమాణముగాఁ జాలదు. కాబట్టి జాతిశాస్త్రజ్ఞుఁ డారోపించు భాషాప్రమాణ పరీక్షకు భాషాశాస్త్రజ్ఞుడు చాల తక్కువ విలువ నిచ్చును.

మానవులు స్వీయభాషను మార్చుకొనుటకై బలవంతపెట్టఁబడి నట్లు చారిత్రకప్రమాణ ముండుటయే కాదు. ఆ పద్ధతిలో విరుద్ధాచార మేమియు లేదు.

భాష సంఘమునుండి సంపాద్యమే కాని, జాతికి స్వతస్సిద్ధమైన లక్షణము గాదను ప్రసిద్ధ యాభాణమే కలదు. మానవుని చర్మవర్ణము, కపాలాకారము, విగ్రహపరిమాణము, కేశస్వభావమును సాధారణముగా పైతృకాగతములై, జననమునకుఁ బూర్వమే నిశ్చితము లగును. దీనికి భిన్నముగా శిశువు నేర్చుకొను భాష, దాని పరిసరముల సంపర్కముల మీఁద నాధారపడియుండును. అనఁగా నెవరినుండి యా శిశువు మాటలను నేర్చుకొనునో, వారు తమ భావములను వ్యక్తీకరించుట కలవాటుపడిన ధ్వనులమీఁద నాధారపడియుండు నన్నమాట. ఫ్రాంసుదేశములోఁ బుట్టిన యొక యాంగ్లశిశువు ఫ్రెంచిభాషను తజ్జాతీయ శిశువువలెనే నిర్దుష్టముగా మాట్లాడ గలదు. ఈ విషయము రెండు సజాతీయములైన భాషలందే కాక, సంబంధమేమియు లేని వైనా,

జపాను, తమిళభాషల విషయములోఁ గూడ నింతయే. పెద్దవారి విషయములోఁగూడ నిది కష్టసాధ్యమే కాని యసాధ్యము మాత్రము గాదు. కొన్ని విశిష్టధ్వనులతోడను, వ్యాకరణపద్ధతులతో మాత్రమే తమ భావవ్యక్తీకరణమున కలవాటుపడుటచే, క్రొత్తపద్ధతులను, నూతన ధ్వనులను పరిశుద్ధముగా గ్రహించి నేర్చుకొనుటకు వారు కొంత కష్టపడుదురు. అట్టి వారొకానొక శబ్దనిర్మాణోచ్చారణమున తాము జాతిచే నశక్తులమని భావింపవచ్చును. కాని తన తాతతండ్రులకు దూరమైన భాష నుచ్చరించుటలోఁగాని, భావములను దాని మూలమున వ్యక్తీకరించుటలోఁ గాని, శిశువు ప్రారంభమున మాట్లాడ నేర్చుకొనునపు డెట్టికష్టమునైనను పొందు ననుటకు తగిన సాక్ష్యము లేదు. మానసికముగ విజాతీయశిశు వెట్టి క్లిష్టపరిస్థితిలోను నుండదు. కాని భౌతికముగ నొకప్పుడు వాగింద్రియముల భేదముచే కొంత ధ్వని, యుచ్చారణభేద మొదవ వచ్చును. ఉదా: నీగ్రోజాతివారు ఇంగ్లీషుభాషను మాట్లాడు నపుడు గల్గుభేద మిట్టిది. కాని యితర విలక్షణములన్నియు మాండలిక భేదములవంటివే కాని వేరు కాదు. మానసికలక్షణ మీ సందర్భమున బాగుగ గమనింపఁదగినది. (1) భిన్నజాతులు సమానమైన నిర్మాణ పద్ధతుల నవలంబించును. (సంయుతధాతురూప పదవిధానము మాగ్యాదులకు నాస్ట్రేలియాలోని యాదివాసులకునుగూఁడ చెందినదే). (2) ఒకటె భాష భిన్నదశలందు భిన్నపద్ధతుల నవలంబించును. (ఉదా: ప్రస్తుతకాలమందలి యాంగ్లభాషయొక్క వివరణాత్మక పద్ధతి ప్రాచీన ట్యూటానిక్ భాషయొక్క సంకీర్ణ ప్రత్యయ విధానముతో పోల్చఁదగినది.) (3) సర్వసాధారణముగా నన్నిభాషలును ప్రాతిపదికలో సమానమైన (సదృశమైన) నిర్మాణపద్ధతులే కలిగియుండును.

సంకరముగాని యాదర్శజాతుల కాలమును బొందఁగల్గితిమేని, యొక్కొక్క జాతీయభాష యొక్కొక్క విశిష్టలక్షణముతోఁ గూడి యుండ వచ్చును. అనఁగా నొక్కొక్క ప్రతిభావంతమైన జాతి కొక్కొక్క ప్రతిభావంతమైన భాషయుండి యుండును. ప్రస్తుతస్థితి యేమనఁగా మానవజాతుల సంఖ్యకంటె, విలక్షణమైన భాషాకుటుంబ

ముల సంఖ్య యెక్కువ యగుటచేతను, జన్య జనకసంబంధము గోచరింప నివి దాదాపు నూరు భాషాసముదాయము లుండుటచేతను, ధ్వనుల లోను నిర్మాణములోను నవి యతిక్లిష్టమైన సాదృశ్యములను, భేదము లను, గూడ ప్రదర్శించుచు, మానవజాతుల కేవిధముగను సరిపోవునట్లు విభజించుటకు వీలు కుదరనీయ కున్నవి. ఈ భాష లొకప్పుడు క్రమ ముగా పెడదారి త్రొక్కి, సంబంధము గుర్తింపరాని స్థితికి వచ్చినవని కాని, లేక యనేక మృతభాషా శేషములని కాని యూహించుటవలన లాభ మేమియు నుండదు. ఏది సత్యమైనను జన్యజనక సంబంధమును బట్టి గాని, శబ్దస్వరూప నిర్మాణాత్మకమైనట్టి గాని భాషావర్గీకరణము, జాతి శాస్త్రజ్ఞులు చేసిన మానవజాతివర్గీకరణముతో పొత్తు కుదరక, సరిపో కున్నది.

ఏ జాతిశాస్త్రజ్ఞుని వర్గీకరణపద్ధతి ననుసరించినమైనను, నా యీ జాతులు మాట్లాడువారి భాషలను విభజించు విధమును కని పెట్టుట యసాధ్యమే యగును. మానవుల కేశలక్షణమును బట్టియు, కపాలా కారమునుబట్టియు, కేశచర్మముల వర్ణములను బట్టియు జాతులను వర్గీ కరింపవచ్చును. కాని, భాషావిషయకముగ మంగోలి జాతివారి కాపా దింపఁ గలిగిన ప్రత్యేకభాషా లక్షణము లేవియు లేవు. స్వరనిర్మాణ మందును, శబ్దజాలమునందును చైనావారు, జపాను టార్టాను జాతులతో భేదించునట్లే, హిందువులు ట్యూటనులతో భేదింతురు. వారి యేక స్వరత్వమును, ధ్వనివిశేషమును, స్థాన భాషాత్వమును (Positional language) బహుప్రాచీన కాలమున నితర మంగోలియా జాతివారితో సన్నిహిత సంబంధమును గలిగియుండినను, లేకపోయినను, వారి ప్రస్తుత భాష మాత్రము సంయుత ధాతురూపపదమై యున్నది. అదే విధముగ అమెరికా యిండియనుల శబ్దసంయుతత్వ (Polynsythetic) భాషలకును, అంఫీనేషియనుల యేకదేశ సంయుతధాతురూప పదత్వ, వివరణాత్మక భాషలకును, జాతిపరమైన భాషాశాఖను భాషాశాస్త్రజ్ఞు డెంతమాత్రము నెలకొల్పలేడు. సంయుతధాతురూప పదత్వము గరుకుజుట్టును, దీర్ఘ కపాలమును గల నల్లనివారి భాషలలోను, మృదు కేశములు, చిన్న

కపాలములు గల హరిద్రవర్ణ జాతివారి భాషలలోఁగూడ సమానముగ గోచరించును. వివరణాత్మకాభివృద్ధి పోలినీషియను భాషలలోను, నాంగ్లేయభాషలోను గూడ నున్నది. కేవల స్థానప్రాధాన్య వ్యాకరణ (Positional grammar) మాంగ్లేయ, చైనాభాషలలోఁగూడఁగలదు. 'శ' కారమును 'హ' కారముగ నుచ్చరించుట గ్రీసు, పర్షియాన్, న్యూజలెండు భాషలలోఁగూడ నున్నది. ప, బ, లయు, త, ద, లయు తికమకలు పొలినేషియా, ప్రాచీనజర్మనీభాషలకుఁ గూడఁ జెందినది. జాతిచేత భిన్నులైనవారు శబ్దనిర్మాణ స్వరములందు తుల్యముగ నుండిరి. జాతిచే తుల్యులైన వారు శబ్దనిర్మాణ స్వరములందు భేదము గల్గియుండిరి. కాన ఫలిత మేమన, చరిత్రగల కాలమునను, చరిత్ర కందని బహుప్రాచీన కాలమునను గూడ, ప్రపంచమం దంతటను, జన సమూహములు ప్రవాసములు, జైత్రయాత్రలు, వలసలు చేయుటచే, నొకజాతివారి భాష మఱియొక జాతివారిపై నేకదేశముగనో, పూర్తిగనో, బలవంతముగా నాక్రమించినది. కాన నే ప్రత్యేక మనుష్య జాతియు ప్రత్యేక విధమైన భాషాజాతి నవలంబింప లేక పోయినది. అందుచే భాషను దేశచరిత్రతోఁ గూర్పవచ్చును కాని, జాతితోఁ గూర్పరాదు. జాతీయభాష సాంఘికముగ నేదో యొకకాలమునకు చెందఁ గలదు.

భారతదేశములోని మాట యెట్లున్నను పాశ్చాత్య దేశములలో జాతి, మత, భాషా భేదములను పాటింపకుండ జనులు వివాహములు చేసికొనుట సర్వసామాన్యమైన యాచారముగ నున్నది కదా. అట్టి సమయములో వారికి జనించిన పిల్లలు వారి తండ్రిభాషను మాట్లాడుదురా? లేక తల్లిభాషను మాట్లాడుదురా? లేక వారందరును నివసించు నన్యదేశభాషను వ్యవహారమందున్న దానిని మాట్లాడుదురా? కాన జాతీయభాష యనియు, మాతృభాష యనియు నిష్కర్షగా నిర్ణయించుట సాగదు.

# ఏడవ ప్రకరణము

## భాషోత్పత్తి

మానవులు దమ యభిప్రాయములను పరస్పరము వ్యక్తధ్వని రూపమున వలయునప్పుడెల్లను దెలియఁ జేయు సాంకేతిక సంజ్ఞలు భాష యని చెప్పనగును. అనఁగా భాషయందు ముఖ్యముగా. (1) నభిప్రాయబోధకమును, (2) వ్యక్తధ్వని యను రెండు లక్షణములుండి తీరవలయును. వీనిలో నే యొకటి లేక పోయినను భాష యనిపించుకొనదు. మానవుఁ డెంత ప్రాచీనుఁడో, భాషగూడ నంత ప్రాచీనమైన దనియే చెప్పవలయును. కాని దాని ప్రాథమికరూపమును గుర్తించుట మాత్ర మసాధ్యమనియే చెప్పనగును.

భాషా నిర్వచనము

పరిణామవాదము ననుసరించి మానవుఁడు జంతువునుండి పరిణమించిన ప్రాథమికావస్థలో, తన భావములను హస్తసంజ్ఞల (gestures) మూలమున వ్యక్తీకరించెనని యూహించుట సహేతుకముగనే కనఁబడుచున్నది. హస్తసంజ్ఞలు మానవునికి స్వభావసిద్ధములు. వాగ్రూపమున మన భావములను వ్యక్తీకరించునపుడు గూడ నీ సంజ్ఞలను ప్రతిమానవుఁడు నప్రయత్నపూర్వకముగఁ జేయుచునే యుండును. వీనిని నిరోధించుట యసాధ్యమగుటయే కాక, కష్టముమీఁద నిరోధించినచో గొంత కృత్రిమముగ గూడఁ గనుపించును. హస్తసంజ్ఞలు వివిధభాషలు మాట్లాడు వారందఱికి సమానమగుటచే, నన్యభాషను మాట్లాడు వారితోడను, దూరమందున్న వారికిఁ దమ భావములను వ్యక్తీకరించుటకు నివి యత్యావసర మగును. అభినయ శాస్త్ర ప్రయోజన మిదే కదా! వ్యక్తధ్వని రూపమగు భాష పుట్టక పూర్వము ప్రాచీన మానవుఁ డే సంజ్ఞలనే వాడినను, నవి సర్వసంతృప్తికరముగ నుండజాలవు. ఎలన 1. ఒకఁడు సంజ్ఞలు చేయునపుడు రెండవ వాఁడు జాగ్రత్తగా వానిని పరీక్షించుచుండవలెను. ముఖము నొకమారు

హస్తసంజ్ఞలు

మరువై పునకుఁ ద్రిప్పినచో వాని .భావమును గుర్తించుట కష్టమగును. మఱియు, 2. మన భావముల నన్నింటిని వ్యక్తీకరించు సంజ్ఞలుండుటకు సాధ్యము గాదు. కొన్ని వస్తువులస్వభావములను సంజ్ఞలతో వ్యక్తీకరించుట దుస్సాధ్యము. 3. ఇందు స్పష్టతగూడ తక్కువ. ఒక భావమును వేరొకటిగా యర్థము చేసికొనవచ్చును. మఱియు చీకటిలో నీ సంజ్ఞల రూపమునఁ దమ భావములను వ్యక్తీకరించుటకు వీలులేదు. కాన దీనికంటె సులభము నెక్కువ సంతృప్తికరమునైన భావవ్యక్తీకరణపద్ధతి యవసరమగును.

చిత్ర రచన

హస్తసంజ్ఞలకంటె స్పష్టమైన భావవ్యక్తీకరణము గలది చిత్రపట రచన. తన భావములను బొమ్మలుగా వ్రాసి యితరులకుఁ దెలుపవచ్చును. ఇది యితరులకు సులభగ్రాహ్యముగ నుండును. మఱియు నిది దూరమందున్నవారికిఁ దన భావమును తెలుపుటకుఁ గూడ విశేషముగ తోడ్పడును. కాని యిది కూడ, హస్తసంజ్ఞలవలె, సకల విధములైన భావములను, వస్తుస్వభావములను (abstract ideas) ద్యోతకము చేయుటకు సహాయకారి కాదు. విశేషించి యిది లిపివిషయమునకు చెందును కాని భాషావిషయమున కంత ముఖ్యమైనది కాదు. ఇందుచే నెక్కువ సౌకర్యము గల వాగ్రూప భావవ్యక్తీకరణ మవసరమైనది.

అవ్యక్తధ్వనులు

పశుపక్ష్యాదులు గూడఁ దమ మనోగత సుఖదుఃఖాది భావములను ధ్వనులరూపముగాఁ దెలుపుచున్నవి. కుక్క దొంగను చూచినపుడు చేయుధ్వనికిని, దన యజమానునిఁ జూచినపుడు చేయుధ్వనికి భేదమున్నది. అది యాకలి వేయు నపుడు చేయుధ్వనికిఁగూడ వ్యత్యాసము గలదు. పక్షులధ్వనులు గూడ నింతే. కాని యీ ధ్వనులన్నియు నవ్యక్తములు. ఇదే విధమున మానవ శిశువుగూడ వివిధములైన రోదనముల మూలమున దన భావములను వ్యక్తీకరించును. వీని భేదమును బట్టి దాని భావములను తల్లి గ్రహించును. ఈ రోదనముగూడ నవ్యక్తమే కదా. ఇఁక నవ్యక్తధ్వని

యననేమో ? విచారింతము. ఈ ధ్వని పశుపక్ష్యాదులుచేయు ఊపిరితిత్తులనుండి బయలుదేరిన నిశ్వాసవాయువు నాసికాముఖద్వారములబైటికి వచ్చుటకుఁ బూర్వము దానికి శ్వాసమార్గమునఁ గలుగు నవరోధము మూలమునఁ గలుగుచున్నది. వాని శ్వాసమార్గము సన్ననై ముడుచుకొని యుండ, దుఃఖసంతోషాతిరేకముచే బలవంతముగ నిశ్వాసవాయువు విడదీయఁబడు సమయమున నాదతంతువులకు కంపము గలిగి యీ ధ్వని బయలుదేరును. వీనియందు స్పష్టమైన భావవ్యక్తీకరణము తక్కువ. ఈ ధ్వనులు స్వభావ సిద్ధముగా జనించును. కాని స్పష్టమైన వివిధభావములను వ్యక్తీకరించునది కాని భాషయనఁబడదు కదా! అట్టి భాషమానవునకు స్వభావసిద్ధమైనది కాదు. కాని ప్రయత్నాభ్యాసములచేతనే యది సంపాదింపఁబడుచున్నది. ఇట్టి భాషమూలముననే మానవుఁడు పశువుకంటె భిన్నుఁడగు చున్నాఁడు.

జగమంతయు నీశ్వరునిచే సృజింపఁబడినట్లు భాషగూడ నీశ్వర సృష్టియే యని కొందఱు భావింతురు. కాని యీశ్వరసృష్టిలో నొకజాతి వస్తు లొకే విధముగా నుండగ, మానవ జాతిభాష వివిధ దేశములలో వివిధ రూపములుగ నుండు టెల జరుగును ? మఱియు, నొక శిశువు

భాష సంపాద్యమే కాని స్వతస్సిద్ధ లభ్యము కాదు

విదేశములలో పుట్టి పెరిగినచో నది విదేశభాష గ్రహించును గాని మాతృభాషను గ్రహింపదని కొన్ని నిదర్శనములవలన సిద్ధ్రుఒంపఁబడినది. ఇంతే కాక పుట్టు చెవిటివాఁడు మూగవాఁడై యుండుటయుఁ గొంత కాలము గడచిన పిమ్మట, చికిత్సవలన చెముడు పోయిన వెంటనే మూకత్వముగూడ పోయి క్రమముగ మాట్లాడ నారంభించుటయుఁగూడ గలదు. కాన భాష, యీశ్వరసృష్టియనికాని, స్వభావసిద్ధమనికాని యెంచఁబడక, యభ్యాసవశమనియు, పరిసరప్రభావ జనితమనియు నెంచఁబడు చున్నది. పాశ్చాత్యులు ప్రపంచ మీశ్వరసృష్టియని విశ్వసింపక, పిపీలికాది మానవపర్యంత జీవరాశి యంతయు పూర్వ పూర్వావస్థ పరిణామముచే నేర్పడినదని నమ్ముదురు.

మానవుడు పూర్వావస్థయందు జంతుతుల్యుఁడుగాన, వాని వలెనే యవ్యక్తధ్వనుల మూలమున వాని భావములను వ్యక్తీకరించుచుండె ననియు, నా యవ్యక్తధ్వనులనుండియే క్రమముగా భాష పరిణమించిన దనియు నూహింపఁబడుచున్నది. అట్లే యగుచో, మానవశిశువు చేయు రోదనమే భాషాచరిత్రమున ప్రథమావస్థ యగునని చెప్పవలయును.

భాష మానసిక శారీరక వ్యాపారము గలది

శిశువు క్రమముగా పెరిగి పెద్దదియగు కొలఁది శరీరావయవములతోఁబాటు కంఠము, జిహ్వ, తాలువు, దంతములు, నోష్ఠములు మొదలైన వాగవయవములు గూడ విప్పారి పరిస్ఫుటము లగుచుండుటచే, నేత్రేంద్రియ ద్వారమున విపులముగ వస్తువులఁ జూడఁగలిగి, శ్రవణేంద్రియ మూలమున స్పష్టముగ వినఁగలిగి, వాగింద్రియమున స్వచ్ఛముగ నుచ్చరింపఁ గలుగును. చూచిన వస్తువును పొందగోరుచు దన భావమును ధ్వని రూపమున తెలుపునపుడు, మానవునకు మనస్సును వాగవయవములును కలిసి పనిచేయును. ఈ రెంటికిని సమరసభావ ముండుటచేతనే మనస్సులోని భావమును మానవుఁడు వాగ్రూపమున వ్యక్తీకరింపఁ గలుగుచున్నాడు. ఆ రెంటికి సామరస్యము గుదరనిచో భాష సిద్ధింపదు. ఎట్లన ఒకటి, మనస్సు సరిగానుండి, వాగవయవమున దోషముండినచో మూగవాఁడగును. మూగవానికి భావములుండును గాని వాగవయవ లోపముచే మాట్లాడ లేక హస్తసంజ్ఞల మాత్రముననే దన భావములను వ్యక్తీకరించును. ఇఁక రెండు, వాగవయవములు సుష్టుగానుండి, మనస్సు బాగుగ లేనిచో పిచ్చి వాఁడగును. పిచ్చివానికి వాగవయవములు నిర్దోషముగ నుండుటచే స్ఫుటముగా మాట్లాడఁ గలుగునే కాని, వాని మనోగత భావములు వాగవయవములతో సామరస్యము నెరపక పోవుటచే, వాని మాటలకు భావములకు సంబంధముండదు. కాన మనోవ్యాపారము వాగవయవ వ్యాపారములతో సామరస్యము నెఱపునపుడే భాష సిద్ధించును.

భాష యీశ్వరసృష్టి కాక పోవుటయే కాక, యే యొక్క మానవునిసృష్టి గూడ కాదు. మానవుడు దానిని సాంఘిక పరిసరముల నుండి ప్రయత్న ప్రభావములచే సంపాదించునని వెనుక గుర్తించినాము.

భాష మానవసృష్టియే యగుచో ప్రతిమానవుడును భాషను స్వతంత్రముగా నెవరికిఁ దోఁచినట్లు వాడు సృజించుకొనుచుఁ బోయినచో, నొకరి భాష యింకొకరి కర్థము కాక పోవుటయే కాక, దాని కభివృద్ధికూడ నుండదు.

**భాష మానవుడు–సంఘము**

శైశవావస్థనుండియే మానవుఁడు భాషను పరిసర సంఘమునుండి గ్రహించుచున్నాడే, కాని యే వైయాకరుణుఁడు గాని, మనుష్యుడు గాని భాషను సృష్టింపఁ జాలడు. కుమ్మరివాని యొద్దకుఁ బోయి మానవుఁడు తన పనులకు వలయు కుండలను చేయుమని కోరినట్లుగ, వైయాకరుణుని యొద్దకుఁబోయి తనకు వలయు మాటలను సృష్టించుమని కోరినను నతఁడు మాటలను సృష్టింపఁజాలడు. అతఁడు పదములను సృజించినను నవి లోకమున కర్థముగా వలెను కదా. కాన లోకవ్యవహారమునుండియే పదములు గ్రహింపఁదగును.

**శబ్దార్థ సంబంధము**

'ప్రయోగ శరణ్యాః వైయాకరణాః'. వైయాకరుణులు ప్రయోగమే, యనఁగా లోకవ్యవహారమందలి పదములే, శరణముగాఁ గలవారు గాని, స్వతంత్ర పదసృష్టి చేయగలవారు గారని దీని భావము. 'సిద్ధి ర్లోకా ద్దృశ్యా' అని. శబ్దసిద్ధి లోకమునుండియే చూడనగును. లోకవ్యవహారమే శబ్దసిద్ధికి ప్రమాణము కాని, వైయాకరుణుఁడు గాని, యింకెవరును గాని గారు. అట్టి భాషగాని భాషలో మార్పు గాని సంఘమువలననే గలిగినను, ఏ వ్యక్తియు ప్రత్యేకమైన మార్పును తేలేడు. అందుచేతనే భాష పరంపరాగతమై సంఘబద్ధమై యుండు ననుట. మానవునియం దనుకరించుగుణము జన్మతో నున్నదని అరిస్టాటిలు తెలిపెను. అది భాషాగ్రహణమున స్పష్టమగును. కోతులు మానవ చేష్టల ననుకరించినట్లుగనే, చిలుక, మైనాగోరువంక మొదలైన పక్షులు మానవుల పలుకులను యథాతథముగా ననుకరించును. అదే విధమున శిశువు మానవసంఘమందలి భాష ననుకరించి నేర్చుకొనును.

అయితే యొకవస్తువునకు నా వస్తువును దెలుపు పదమునకు నెట్టి సంబంధమని తర్వాత విచారణ. 'ఆవు' అని చెప్పినపు డది నాలుగు కాళ్లు, రెండు కొమ్ములు, రెండు చెవులు మొదలైన యవ

యవములు గల యొక జంతువును మనస్సున నేర్పరుచుకొని, యా జంతువునకు గుర్తుగా, నిత్యవ్యవహారమున కనుకూలముగాఁ నుండుటకై సర్వజన విదితముగా నుండు నొకగుర్తు, లేక సంకేత మగును. ఈ పదము వలన నింకే యితరజంతువుగాని, వస్తువుగాని యర్థము గాఁ గూడదు. ఈ శబ్దమునకు నా యర్థమునకు సంబంధము సిద్ధమనియు, నిత్యమనియు గూడఁ గొందఱు చెప్పుదురు. కాని యీ రెంటి సంబంధము స్వాభావికము గాక సాంకేతికమే యని యంగీకరింపవలయును. ఏలన నొకే వస్తువునకు వివిధభాషలలో వివిధశబ్దసంజ్ఞ లుండుటచేతనే. లోకమైనను కొంతమంది కూర్చొని కొన్నివస్తువులకు సంకేతముగాఁ గొన్ని శబ్దముల నేర్పర్చుకొనుట కూడ సాధ్యము కాదు. ఈ భాష యనాది యని తలంపఁడుచున్నది. కాని యాదిమమానవుని భాష యెట్లుండె నని యూహింపఁబడినది.

ప్రారంభమున నాదిమమానవుఁడు భాషను నేర్చుకొనిన విధానమును, 1. శిశువు భాషను గ్రహించు రీతితోడను, 2. అనాగరికుఁడగు నాటవికుడైన పామరుడు భాషను నేర్చుకొను పద్ధతితోడను సమానముగ నుండునని భావింపఁబడి, యీ మార్గమునఁ గొన్ని వాదములు వెలసినవి.

1. ధ్వన్యనుకరణ వాదము. Onomatopoetic theory or Bow-bow theory

శిశువులును, ననాగరికాటవికులును దమ పరిసరముల నుండెడి పశుపక్ష్యాదులకు ప్రత్యేకనామముల నొసంగెడివారు. పిల్లి 'మ్యావ'ను ధ్వని చేయును గాన శిశువు దాని ధ్వనిని పలుమారు విని, దాని ననుకరించుచు 'మ్యావ'ని దానిని చాఁపుటయు, వానితల్లిగూడ శిశువును సంతృప్తి పెట్టుటకై 'మ్యావు' వచ్చినదని 'మ్యావ'ని శిశుభాషను మాట్లాడి, శిశువు నాకర్షించుట మనము చూచుచున్నాము కదా. అట్లే 'కాక' 'కుక్కుట' 'కోకిల' మొదలైన పదములు వాని ధ్వన్యనుకరణ మూలమున జనించినవని తలంపవచ్చును. ఇట్లే ప్రతి భాషలోఁగొన్ని పశుపక్ష్యాదుల పేర్లను దెలుపుపదములు పుట్టి యుండును. దీనినే మాక్సుమిల్లరు 'బౌ-బౌ' వాదమనినాఁడు. ఈ

వాదమునకుఁగూడ గొంత పరిమితి గలదు. పశుపక్ష్యాదుల ధ్వనులను గూర్చినంతవరకు నీ వాదము సంతృప్తికరముగ నే సాగవచ్చును. కాని యీ పశుపక్ష్యాదుల వెలుపలనే యథార్థముగ భాష ప్రారంభించుచున్నది. ఈ యనుకరణధ్వనులకు మినహాగా నితరవిషయములను వ్యక్తకరించుట కీ సాధనము నిరుపయోగము.

2. ఆశ్చర్యవాదము.
**Interjectional or pooh-pooh, theory**

మానవుఁడు తీక్ష్ణమైన యావేశములను బొందినపుడు కొన్ని ధ్వనులను జేయును. నాగరికులు వీనిని గొంతవర కణచుకొనినను, పామరుడు స్వేఛగా నీధ్వనులను జేయును. గొప్ప సంతోషము గలిగినపుడు మానవుడు 'ఆహా' యనియు, దుఃఖము గలిగినపుడు 'అమ్మో' అనియు, నాశ్చర్యము గలిగినపుడు 'ఓహో' యనియు నీ విధముగా వివిధ భావములు వ్యక్తీకరించును. మఱియు మనుష్యుడు నడుము బిగించి బలవంతముగా నేదైన కష్టమైన పని చేసిన తర్వాత దీర్ఘమైన యాయాసము దీర్చుకొనుటకై 'అమ్మయ్యా' మొదలైన ధ్వనులను చేయును. ఇఁక నసహ్యమును సూచించుటకు 'ఛీఛీ' అని చీదును. కానఁ గొన్ని బలమైన మానసికభావములను వ్యక్తీకరించుటకుగా నీ శబ్దములు పుట్టియుండును. ఆ శబ్దముల మూలమున నా యా భావములను వ్యక్తీకరించుటకు సాధ్యమగును. సాధారణముగ నీ యాశ్చర్యార్థకము లాకస్మికములైన యావేశముల వ్యక్తీకరణములే. వీనికిని భాషయందలి పదములకు సంబంధము చాలతక్కువ. ఈ రెంటికి చాలభేద మున్నది. భాషాపదములతో వ్యక్తీకరింపఁజాలని వానికే యాశ్చర్యార్థకములు వాడఁబడును. ఈ ధ్వనులను వ్రాతలో ప్రతిపాదించుటకుఁ గూడ సాధ్యము కాదు. అవి నాదరహితాచ్చులతోఁ గూడినవి. మఱియు ననేకాశ్చర్యార్థకములు సాంకేతికములై నభ్యసింపఁబడి, వివిధ భాషలలో వివిధ రూపములతో నున్నవి. కాని సామాన్యభావము లెన్నో గలవు. వానిని వ్యక్తీకరించుట కీ రెండు వాదములుగూడ నిరుపయోగములే.

శబ్దార్థముల కతీంద్రియ (mystic) సంబంధమున్న దనియు, ప్రపంచమందలి మానవునకుఁ గల విచిత్రమైన యొక స్వాభావిక శక్తి వలన బాహ్యావస్తువు లన్నియు నాతని యాంతరంగికమగు వాగ్రూపమును బడయుననియు నీ వాదము ప్రతిపాదించును. ఈ వాదమునకుఁ గారకులైన మాక్సుమిల్లరే దీనియందు సంతృప్తి చెందక కొంతకాలమునకుఁ దన వాదమును వదలుకొనెను.

3. శబ్దార్థముల యాంతరంగిక సంబంధవాదము
Ding - dong theory

ఈ విధముగ ననేక వాదములు బయలుదేరినవి. కాని వీనిలో నే యొక్కటియుఁ గూడ సంపూర్ణమైన సంతృప్తినిఁ గలిగించునదిగ లేదు. ఒక్కొక్క వాదము భాషలోని గొన్ని పదములకు మాత్రమే తగిన యుత్పత్తిని గల్పించునదిగా నున్నది. ఈ వాదములన్నియుఁ గలిపి చూచినను గూడ భాషలోని విశేష భాగముయొక్క యుత్పత్తినిఁ గూర్చి యగమ్యగోచరముగనే యున్నది.

భాషలోని పదములన్నియు ధాతువులనుండియే పుట్టినవని క్రీ. పూ. ఐదారు వందల సం.ల పూర్వము హిందూదేశమున నున్న భాషాతత్త్వజ్ఞుడగు యాస్కునకుఁ బూర్వమే కాత్యాయనుడు తన 'నిరుక్త' మను గ్రంథమున చర్చించినాఁడు. యాస్కునకుఁ బూర్వమే కాత్యాయనుడు తన 'ప్రాతిశాఖ్య' గ్రంథమున ధాతువులను గూర్చి పరామర్శించినాఁడు. యాస్కుఁడు నిరుక్తమును రచించుటకుఁ బూర్వమే యీ ధాతువులు, నామబోధకములని గార్గి మొదలైన వారికిని, క్రియా బోధకములని శాకటాయనాదులకు గొప్ప చర్చలు జరుగుచుండెను. యాస్కుఁడు శాకటాయనాదుల వాదము నంగీకరించినట్లు నిరుక్తము వలనఁ దెలియుచున్నది. ఈ ధాతువాదమే యీ కాలమున ప్రపంచమందలి భాషాశాస్త్రతత్త్వజ్ఞులచే నామోదింపఁబడి పరిశోధింపఁబడు చున్నది. ధాతువు లనఁగా, భాషలోని పదములను వ్యాకరించి,

4. ధాతువాదము
Root theory

ప్రత్యయ విభాగము చేయఁగా చిట్టచివరకు మిగిలిన సూక్ష్మతర ధ్వని రూపములని చెప్పవచ్చును. భాషకీ ధాతువులే మూలాధారమని చెప్పవచ్చును. ఈ ధాతుస్వరూప సామ్యమును బట్టి భాష లొకటే భాషా కుటుంబములో చేర్పఁబడుటయు, వీని స్వరూపమందలి భేదమును బట్టి ప్రత్యేక భాషాకుటుంబమునకుఁ జేర్పఁబడుటయుఁ గూడ తటస్థించుచున్నది. కొన్ని భాషాకుటుంబములందలి ధాతువు లేకాక్షరములుగను (monosyllabic), కొన్ని రెండక్షరములు, మఱికొన్ని మూఁడక్షరములు గలవిగాఁ గూడ నుండును. సంస్కృతభాషకుఁ జెందిన ఇండోయూరోపియన్ భాషాకుటుంబమునఁగల ధాతువు లేకాక్షరములు గలవి. ఉదా. భా, గమ్, నై మొ॥ 'సెమిటిక్' భాషా కుటుంబమునకుఁ జెందిన ధాతువులు మూఁడక్షరములు గలవి. ఉదా. 'క్‌ట్‌ల్' - 'Ktl...' వీనినుండి వివిధరూపపదము లేర్పడును.

భాషకీ ధాతువులే మూలవస్తువులని యంగీకరించినను, మొట్ట మొదట మానవుఁ డీ ధాతువులతోడనే మాట్లాడ ప్రారంభించెనని యెంత మాత్రము తలఁపరాదు. ఎందుకన నీ ధాతువులు ధ్వనిరూపములు మాత్రమే కాని స్వతంత్ర వ్యవహారయోగ్యములు గావు. శాకటాయ నాదులు తలఁచినట్లు ధాతువులు క్రియాబోధకములగుచో భాషయందు వీని కుపయోగ ముండవలయును. కాని, 'భూ, ధా, గమ్' మొదలైన సంస్కృతధాతువులకు భాషలో స్వతంత్ర ప్రయోగములు లేకపోవుటచే నివి క్రియారూపములు గావనియు, కేవల మర్థవంతములైన ధ్వని రూపములనియు గ్రహింపఁదగినవి. దక్షిణహిందూదేశ భాషలలోఁగల ధాతువులు విధ్యర్థక మధ్యమపురు షైకవచన రూపములుగా ప్రయోగింపఁబడుటచే ధాతువులకు స్వతంత్ర ప్రయోగార్హత కూడఁగల దని చెప్పవచ్చును. ఉదా: రా, పో, ఉ, తే, కన్, అన్, తిన్, విన్, చెయ్, మొదలైనవి. ప్రాక్తనమానవుఁ డాదికాలమునఁ దన భావముల

నితరునకు వాక్యరూపముననే వ్యక్తీకరించి యుండును గాని కేవలము ప్రత్యేకపదములతో ససంపూర్ణముగా వ్యక్తీకరించి యుండఁడని భావింపఁబడుచున్నది. అందుచేతనే ప్రాచీన వైయాకరుణులు శబ్దార్థ సంబంధ విషయమున అఖండ వాక్యస్ఫోటనే కాని, పదస్ఫోట, వర్ణ స్ఫోటాదుల నంగీకరింప లేదు. స్ఫోటమనఁగా అర్థమును స్ఫుటము చేయునది. కాన భాష వాక్యములతోడనే మొట్టమొదట బయలు దేరి యుండునని యంగీకరింపఁబడుచున్నది. భాష జనసంఘము నుండి యలవరచుకొనునది కాన, నాదిమకాలమునందలి ప్రథమ స్త్రీపురుషుల సంభాషణమే భాషకు మూలమని చెప్పవలసి యుండును ఈ భాష లేక శబ్దములు పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యను నవస్థా లేక స్థానభేదములు గలవనియు, నందు నాల్గవది యగు వైఖరీ మాత్రమే వాచికాంగముల మూలమున వెలువడు వాక్కు సామాన్యులకును, మిగిలి నవి మూఁడును యోగసాధనపరులకు మాత్రము తెలియనగును.

భాష, సంఘమున కుద్దేశించినదే కాని మాట్లాడు తనకు మాత్రమే యుద్దేశింపఁబడదు కాన, భాషాభివృద్ధి సంఘమునుండియే జరు గును గాన, శబ్దార్థసంబంధము లోకమునుండియే స్థిరపడుచున్నది. కాన, మానవుడు సంఘములో నొకఁడగుటచే, సంఘమేర్పడినఁ గాని భాష పుట్టదని విశ్వసింపఁడుచున్నది. కాన ఆదిమపురుషస్త్రీ లుచ్చరించిన ప్రారంభశబ్దములకుఁ గొన్ని యర్థము లాపాదింపఁబడినపుడే భాష యుద్భవించినదని నిర్ణయింపవలసియుండును. అందుచే నాదిమపురుషుడు దన ప్రేయసిని సంతోషపెట్టుటకై పలికిన ప్రథమశబ్దములు, వాక్యము లందే భాషోదయమైన దని చెప్పనగును. భాషోత్పత్తికారణములు దీని యందే యూహింపఁబడినవి.

## పద్ధతి

భాషోత్పత్తిక్రమము మూఁడు మార్గములనుండి విచారింప వచ్చును. మానవుఁడు భాష నార్జించిన విధానమును బాలుఁడు తన భావములను నాదతంతువులద్వార వ్యక్తీకరింప నేర్చు విధానముతోఁ

కొందఱు పోల్చిరి. అందుచే బాలురభాష పరిశీలింపఁబడినది. కాని యీ యూహ దుష్టమైనది. ఏలన, బాలుఁడు సిద్ధముగా నున్న భాష

1. బాలభాష

నభ్యసించును. నేఁడు భాషాభ్యాసకుఁడు ప్రాక్తన మానవుని స్థితికంటె భిన్నస్థితిలో నున్నాఁడు. ఏలన బాలుని పని వేరు. అతఁడు విన్నధ్వనులను మాత్రమే కూడపలుకును, కాని నూతనసృష్టి నేమియు చేయఁడు. కాన భాషోత్పత్తి క్రమమునకై బాలురభాషలలో వెదకుట నిరుపయోగమైన ప్రయత్నము. సక్రమమైన భాష యెట్లు నేర్చుకొనఁదగునో బాలురవలనఁ దెలిసికొనవచ్చును. కాని ప్రారంభమున భాష యెట్లుండెనో వారి భాషాగ్రహణ పరిశీలనమువలన నేమియుఁ దెలియదు. పెద్దవారు మాట్లాడిన మాటలను వారనుకరించుచు, ధ్వనుచ్చారణచేయు వారి ప్రయత్నములను పరిశీలించుట వలన, భాషలోఁగలుగు మార్పులు కారణములు మాత్రము గ్రహింపఁబడును. బాలునది యనుకరణశక్తియే కాని శబ్దసృష్టి కాదు.

పామరులైన యాటవికుల భాష నాగరికుల భాషకంటె ప్రాచీన రూపమున నుండునని గ్రహింపవచ్చును. కాని, యనేక పామరుల భాష కూడ ననేకశతాబ్దముల భాషాభివృద్ధి (వారికిఁ) గలిగిన గ్రహింపవలెను. వారి నేఁటిస్థితి ప్రాక్తనమానవుని

2. పామరులభాష
(ఆటవిక పార్వతేయుల భాష)

స్థితికంటె భిన్నమైనది. కాన వారిభాషను పరిశీలించుటవలన నీ విషయమున విశేషమేమియు బోధపడదు. ఆటవికాది పామరులాదిమవాసులు కారు. వారట్లు తలంచుట తప్పు. నాగరికానాగరికుల సరళక్లిష్టభాషలు రెండును ననేక పరివర్తనముల ఫలితములు. వాని పరివర్తనభేదదృష్టి మాత్రము మనకిప్పుడు తెలియదు. వారి భాషాభేదము వారి వ్యాకరణ భావములలో నున్నది కాని, వ్యక్తీకరణవిధానములో చాలతక్కువ కలదు. పామరులభాషా పరిశీలనము, వారి భావములకు భాషకుఁ గల సంబంధమును గుర్తించుటకు సహాయపడవచ్చును, కాని భాష పుట్టినపుడే స్వరూపమున నుండెనో తెలుపుట కెంత మాత్ర మది తోడ్పడదు.

**3. భాషాచరిత్ర**

భాషాచరిత్ర చాలవరకు ఫలవంతములగు విషయములకు మూలమైనది. ఆధునికభాషలతోఁ బ్రారంభించి వెనుకకుఁ బోవుచు భాషాచరిత్ర పరిశీలింపఁదగినది. బాలభాష ప్రాచీనభాషాస్థితి కాదు. కాని యది భాషాపరిశీలనమందలి బాహ్యాంతర నిర్మాణమున కొక విధమైన పూర్వదశయని చెప్పవచ్చును.

**ప్రాచీన భాషాలక్షణము**

ఈ క్రింది ప్రాచీన భాషాలక్షణములను బట్టి ప్రాచీనభాషా స్వరూపమును స్థూలముగానైన కొంతవరకు నిర్ణయింపవచ్చును.

## II ధ్వనులు

**1. ధ్వనులు**

భాషలలోని ధ్వనులను గూర్చి పరిశీలించినపు డుచ్చారణము క్రమక్రమముగా తేలికచేసి శ్రమను తగ్గించు విధాన మవలంభింపఁబడినదని గ్రహింపఁబడినది. అందుచే క్లిష్టధ్వనులు క్రమముగా పరిహరింపఁబడినవి. ప్రాచీనార్య భాషా ధ్వనిపద్ధతి 19-వ శతాబ్దమధ్యభాగమున పండితులచే నూహింపఁబడిన దానికంటె నతిక్లిష్టమైనదని నవీనపరిశోధనలు ఋజువు చేసినవి. సాధారణముగ ప్రాచీనభాషలన్నియు క్లిష్ట సంయుక్తాక్షర ధ్వనులతో నిండి యున్నవి.

**2. ఊత**

కొన్ని భాషలలో స్వరితవిధానము (tone or pitch accent) క్రమముగా నదృశ్య మగుచున్నది. ఉదా: డేనిషుభాష. ప్రాచీనభాషలలో నీ స్వరితవిధానము ప్రాముఖ్యము వహించినది. కాన నర్వాచీనగ్రీకు, రోమను భాషలలో స్వరితవిధానము ప్రాతపడిపోయి, యాస్థానములందు ఊతవిధానము (stress accent) వినఁబడుచున్నది. అనేక ప్రాచీనభాషలలో నీ స్వరిత విధానము ముఖ్యపాత్ర వహించినది. ఉదా: వైదిక భాష. ఇందలి యుదాత్తానుదాత్త స్వరితములు దీనికి చేరినవి. నవీన భాషయగు

నాంగ్లమున నీ స్వరితధ్వని వినఁబడక యూత (stress) మాత్రమే వినఁబడును

తీవ్రావేశముల ప్రభావము భాషోచ్చారణమును ఉచ్చతరముగను, త్వరితముగను గలుగి చేసి, యుదాత్తానుదాత్తములైన ధ్వనులతోఁ గూడిన వాక్యరచనకు దోహదము చేయును.

3 వాక్యమాధుర్యము

ప్రశాంతమైన భాషణము వినుకుఁగొల్పును. నాగరికతా ప్రభావమున నీ యుద్రేకపూరితమైన భాషాస్వరూపము ప్రశాంతస్థితికి వచ్చును. అనాగరికులైన స్త్రాన్యమానవుల భాష మనభాష కంటె నెక్కువ యుద్రేకపూరితమైన రాగములతో పాటవలె నుండును

హిందూ ఆర్య భాషాకుటుంబమందలి ప్రాచీనభాషలగు సంస్కృతము జెందు మొదలైన భాషలు బహుదీర్ఘశబ్దములతోఁ గూడియున్నవి. వెనుకకుఁ బోయినకొలఁది యీ భాషలలోని పదము లెక్కువ వర్ణములు గలవియై యున్నవి. ఇందుచే, భాషలన్నియు నేకవర్ణాత్మకములుగా ప్రారంభించుననెడు ప్రస్తుతము ప్రచారమందు కల మత మెట్లు భంగమై, భాషాచరిత్రలోని స్థాపితసత్యములకు భిన్నముగా నున్నవో విశదమగును. మతచరిత్రయొక దేవత పూజనుండి, బహుదేవతపూజకు జరుగక, వ్యతిరేకముగ నుండెనో, యట్లే భాషకూడ బహువర్ణాత్మకమునుండి యేకవర్ణాత్మకమైన దనుట న్యాయము. ప్రాచీనభాష బహుదీర్ఘవర్ణయుతమై, క్లిష్టధ్వనిపూరితమై, భాషింపఁబడుననుట కంటె, పాడఁబడెనని గ్రహింపనగును.

4. ఆకస్మికమైన మార్పు ఫలితముగ శబ్దములు హ్రస్వము లగుట

భాషాచరిత్రను వెనుకకు తిర్యఙ్ముఖముగా పరిశీలించుచు పోయినచో, ప్రాచీనభాషలలో, నవీన భాషలలోకంటె పదముల కధికమైన భాగములుండుటను గ్రహింతుము. నామవాచకములందును, క్రియలందును, విశేషణములందును ధ్వనిరూపములలో తుల్యముగా నున్న ప్రాచీన వివిధరూప

III వ్యాకరణము

ములు కాలక్రమమున తికమకలకు కారణములైనవి. భాషల ప్రారంభ దశలలో ప్రతి శబ్దరూపమున కనేక యవాంతర భేదములుండెడివి. అవి తర్వాతి కాలమున ప్రత్యేకముగ సహాయక్రియలు, నుపసర్గల మూలమున వ్యక్తీకరింపఁబడుచున్నవి. ప్రాచీనకాలమున క్రియాపదము కాల, వచన, లింగ, విభక్త్యర్థ కాదులగు నారు భావములను ద్యోకతము చేయుచుండెడిది. అర్వాచీనకాలమున భావభేదములు వికలన (analitical) రూపమున వ్యక్తీకరించు విధానమును గ్రహించినవి. ప్రాచీనకాలము సంకలన (synthesis) విధానమును, నర్వాచీనకాలము (analysis) విధానమును కలవి. ప్రాచీనదశ క్లిష్టత, చిక్కులు, వికలన రాహిత్యము గలిగి యుండెను.

భాషాచరిత్ర పరిశీలనమువలన సంకలనము వికలనమునకును, నది తిరిగి సంకలనమునకు, నదియే మరల వికలనమునకు నిట్లు చక్రమువలె తిరుగునని విశదమగును. అర్వాచీనభాషలలో ప్రాచీనగ్రీకుభాషలో వలె, సర్వనామము క్రియతో సంయోగము పొందుచు కేవలప్రత్యయముగా పరిణమింపనున్నది. ఉదా: ఆంగ్లమున, I'd=I had (or I would), he'll=he will, ఇది సంయుత ధోరణిని సూచించును. మరియు, 'don't, won't, can't' మొదలైన రూపములలో వ్యతిరేకార్థకావ్యయము క్రియతో సంయోగము పొందుచున్నదని తెలుపును. ఇందుచే మొదట ధాతువుమాత్రముగా నుండిన (isolating) ప్రత్యయరహిత భాషలు క్రమముగా ధాతుసంయుత ప్రత్యయాంత (agglutination) మొంది, చివరకా రెండును కలిసిపోయి ప్రత్యయాంత (inflexional) భాషలుగా పరిణమించు ననెడు ప్రాచీనమత మిపుడు భంగమగుచున్నది. తత్ఫలితముగా ప్రాచీనమతము తిరుగవేయఁబడి, భాషలు ప్రత్యయరహిత దశకే పరిణమంచునని సిద్ధాంతము చేయవలసివచ్చుచున్నది. ఉదా: చైనాభాషయు, కొంతవరకు నవీనాంగ్లభాషయు. వీని ప్రారంభము ప్రత్యయాంతదశయే యనవలయును. ఉదా: గ్రీకు, లాటిన్ భాషలు. ప్రాచీనభాషాపరిమాణములు (units) నవీన భాషాపరిమాణముల

IV పరిమాణములు units

కంటె నర్థమున నెక్కువ క్లిష్టములును, ధ్వనియందు బహుదీర్ఘములునై యున్నవి.

ఆర్వాచీన భాషలందుకంటె ప్రాచీనభాషలలో వక్రతలు, విరుద్ధములు విశేషముగా నుండును. ఇట్టివి నవ్యభాషలందుఁగూడ నున్నను, ప్రాచీనభాషలలో నివి చాల యెక్కువగా నుండును. ప్రాచీనభాషలలో లింగసంబంధములను దెలుపు పదములు ప్రత్యేకముగ గలవు. ఉదా: Father-mother, తల్లి-తండ్రి; bull, cow, ఆవు-ఎద్దు; మొ॥ కాని యర్వాచీనభాషలలో నీ స్త్రీజాతి సంబంధము ప్రత్యయోపసర్గల సహాయమునఁ దెలుపఁబడును. ఉదా: Count-countess; he-bear, she-bear, మగ యెలుఁగు-ఆడ యెలుగు; మగమేక - ఆడమేక మొ॥ మరియు తరతమ భావము (comparative & superlative degrees) లను దెల్పుటకు ప్రాచీనభాషలలో ప్రత్యేకమైన పదములు విశేషముగనున్నవి. ఉదా: good-better-best, ill-worse-worst. వీనికి నవీనభాషలలో నక్రమమైన తేలికపద్ధతిలోఁ గూర్పఁబడినవి happy-happier, big-bigger. ఇవి ప్రాచీనభాషలలోవలె క్రమరహితములు గావు.

**V వక్రతలు Irregularities**

ఆటవికుల భాషలు సరళమైన వను ప్రాచీనభావము సూక్ష్మ పరిశీలనమువలన, తప్పని ఋజువు చేయఁబడినది. వారిభాష చిక్కులతో నుండి, విధానము బహుక్లిష్టముగా నుండును. వానిలో నుపసర్గలు, ప్రత్యయములు విశేషముగానుండి, సర్వసాధారణముగ ధాతువే లోపించుచుండును. వానిలో ననేక బహువచనరూపములు, క్రియాప్రత్యయములు మొదలగునవి యుండును. ఆటవికులు నిర్బంధములతో జీవించి హేతురహితముగ నుందురు. వారి భాషయు నట్టిదే.

**VI ఆటవికుల భాషలు**

కారకమునందును, శబ్దనిర్మాణమందును ప్రాచీనభాషలు విశేషము క్రమరహితముగా నుండి, యౌచిత్యమునకు బద్ధములు కావు.

అవి దుర్భరముగను క్లిష్టముగ నుండును. కాన భాషలు ప్రత్యయరహిత, సంయోగాత్మక, ప్రత్యయాత్మకములను క్రమవాద మసంతృప్తికరమైన సామగ్రిపై యాధారపడిన దనియు, నది యిప్పుడు, తలక్రిందులైన దనుట స్పష్టమగుచున్నది. ఆంగ్ల, చైనా, ఫిన్నిషుభాషలన్నియు సంకలనభాషల నుండి వికలనత్వమును పొందియుండుట సంభావ్యము. ఆంగ్లభాష యొకప్పుడు ప్రత్యయాంత భాషగనుండి, యిప్పటికిని గొన్ని విషయములలో నట్లే యుండియు, మఱికొన్ని విషయములలో నది సంయోగాత్మకముగా నుండగా, నింకకొన్ని విషయములలో మరల ప్రత్యయరహితముగానో లేక తత్సమీపముగానో యున్నది. భేదింపరాని క్రమరహితమగు (క్లిష్ట)సంకలనమైన కూర్పునుండి (సరళము)వికలనము సక్రమమునై కలుఁపదగిన చిన్నపదముల వైపునకు సాగునని భాషాపరిణామము ప్రదర్శించును.

VII పరిణామ ధర్మము

భాషాభివృద్ధి జరిగిన కొలఁదియు, గుణవాచకములను సాధారణ భావములను వ్యక్తీకరించుశక్తి తదనుగుణముగ వృద్ధిపొందుచుండును. ఏ భాషయైనను ప్రారంభమున వస్తునామములను, విశేషభావములను మాత్రమే వ్యక్తీకరింపఁగలిగి యుండును. ప్రాక్తనమానవులు, గట్టి, మెత్తన మొదలైన గుణవాచకములను వ్యక్తీకరింపఁజాలరు. అనేక ప్రాచీనభాషలలో అన్న, తమ్ముడు ననుటకు శబ్దములున్నవి కాని, సోదరుడనుటకు శబ్దములు లేవు. వివిధమైన భావభేదములను దెలుపు శబ్దములు లేక పోయినను, ప్రాచీనభాష యర్వాచీనభాషలోఁ కంటె శబ్దజాల మధికముగా నుండును. ఇట్టి శబ్దసంపదకుఁ గారణము ప్రాచీనుల మూఢవిశ్వాసమే. ప్రాచీనమానవుల కొకే భావమునకు రెండు మూఁడు పదము లుండును. వానిలో తర్వాతి తరములవా రొకొక పదమునే నిల్పిరి.

VIII శబ్దజాలము

ప్రాచీనపదములు భావములకు ప్రత్యక్షముగాను, భావద్యోతకముగను వర్ణనాత్మముగ నుండును. వస్తుబోధక ప్రాచీనశబ్దములు

శ్రోతల కొక్కమారుగ ప్రతిపాదించును. కాని నేటికాలమున క్రమ
క్రమముగ నవి ప్రతిపాదింపఁబడును. అవి కవిత్వమున కెక్కువ తగినట్లుండును. ఇప్పటికంటె ప్రాచీనకాలమున నాలంకారికపదము లెక్కువ ప్రాముఖ్యమును నెరపినవి. భావవ్యక్తీకరణము క్రమక్రమముగా వచనముఖమునకు సాగును. ప్రతిభాషయందును పద్యము మొదటను తర్వాత వచనము బయలుదేరును.

IX గద్యపద్యములు

ప్రాచీనశబ్దములు దీర్ఘములును, పెద్దధ్వనియు గలవి. కాని వాని భావములు మాత్రము చాల తేలికలైనవి. ప్రాచీనులు మునలమ్మలవలె నధికముగ వాగుడు స్వభావము గలవారైరి. ప్రాచీను లుద్రేకములను విశేషశక్తితో వ్యక్తీకరించెడువారు, కాని భావములను కాదు. ఉద్రేకములేని శాంతజీవితము చిన్నచిన్నపదములతో నాశ్చర్యార్థకములను మాత్రము వెలువరించును. అవి యింక పరిణామ మొందవు. కేవలము భావవ్యక్తీకరణము భాషకు చరమదశ. భాషాసృష్టిలో స్త్రీలకు భాగము లేదు. భాషోత్పత్తి రసవజ్జీవితమున గాంచనగు గాని, నీరస జీవితమునఁ గాదు. మూలభాష యౌవనానందములతో బయలుదేరినది కాని, దీర్ఘాలోచనలతోఁగాదు. ఉద్రేకములలోఁ గూడ కామోద్రేకమే యధికము. మానవుని యనురాగోద్రేకవ్యక్తీకరణమునందే భాష పుట్టినది. ప్రారంభవాక్కులు రాగోద్రిక్తమైన పాటలై యుండును.

XI ఉద్రేకపూరితమైన పాటలు

ఆటవికు లుద్రేకము పొందినపుడెల్ల పాడుదురు. ఈ పాటలలో ననేక మాఁకుధారగా వెడలునవే. వారు కలసి పాటుపడు నపుడు పాడుదురు. ఆ పాటలలోని విషయ మా కాలపు సంఘటనలై యుండును. పూర్వపుజను లిప్పటి జనుల కంటె నధికముగ పాడెడివారు. ప్రస్తుత కాలములో పాటలు వినఁబడక నిశ్శబ్దముగా నుండును. ఆటవికుల పాట లర్థములేని మాటలసముదాయము మాత్రమే. మానవులు దమభావము

XI ప్రాచీనుల పాటలు

లను భాషలో తీరికగ వ్యక్తీకరించుటకు బహుకాలము పూర్వమే దమ యుద్రేకములను పాటలుగ పాడ నారంభించిరి. ప్రాచీనులకు దమ భావములను గాని, ప్రయోజనములనుగాని యితరులకుఁ దెలుపు నుద్దేశము లేదు.

విజ్ఞాన మభివృద్ధిపొంది, యుద్రేకభావము లడఁగిన తర్వాతనే భాషాపరిణామము సాగును. భాష మెల్లమెల్లగా కుంటుచు నభివృద్ధి చెందుచు స్పష్టత, సక్రమత, తేలికవైపునకు సాగును. ఏ భాషయు పరిపూర్ణమైన నిర్దుష్టముగా నుండదు. ఆదర్శభాష వక్రతను, క్లిష్టత, నస్పష్టతను బహిష్కరించును. శబ్దార్థములకు చక్కని పొందిక యుండును.

XII పర్యవసానము

1880 సం. ప్రాంతమున వెడలిన నూతన పరిశోధనలవలన మన భాషాకుటుంబములోని స్వరవ్యంజన పద్ధతులను గూర్చిన ప్రాతమతములు మారిపోయినవి ఉదా: తాలవ్యీకరణము. గ్రీకుభాషకంటె సంస్కృతభాష కొన్ని విషయములలో ప్రాచీనసంప్రదాయములు తక్కువ గలదిగా గనఁబడుచున్నది. ప్రాతిపదికయగు హ్రస్వాచ్చునుండి గుణ వృద్ధులు పరిణమించినవను సంస్కృతవ్యాకరణ మత మిప్పుడు మారిపోయినది. పూర్ణరూపమగు గుణవృద్ధులే ప్రాచీనరూపములనియు, నవి యనేకజీవద్భాషలలో హ్రస్వరూముల నొందినవని గోచరించుచున్నవి. ధాతువునందే కాక, యితరవర్ణములందుఁగూడ నీ యుఃస్వప్రసారము గనఁబడుచున్నది. ఆర్యభాషాధాతువు లేకవర్ణాత్మకములను ప్రాచీనమతము ఖండింపఁబడి, నూతనసిద్ధాంతమున ప్రాచీన ధాతువులు ద్వివర్ణాత్మకములని యంగీకరింపఁబడినవి. దీనికి కారణమూతయందలి భేదము. సంస్కృతభాషలో భూతకాల (perfect) యేకవచనమున ధాతువుపై యూత యుండును. కాని బహువచనమున చివర యూత యుండదు.

XIII నూతన పరిశోధనలు -సిద్ధాంతములు

అతిప్రాచీన భాషాగ్రంథముల సాహాయ్యమున భాషోత్పత్తివిధాన సమస్యను సాధింప ప్రయత్నింపఁబడినది. కాని యా ప్రాచీనభాషా

స్థితియందే భాష చాలా యభివృద్ధి చెందినట్లుగా గోచరించుచున్నది. ఆ భాషను ప్రస్తుతకాలభాషలతోఁ బోల్చి చూచుచు, మూలభాషా నిర్మాణము చేయవచ్చునను నభిప్రాయ మత్యాశాభూయిష్ఠమైనదై యభిప్రాయభేదములతోఁ గూడికొనుటచే బహుకాలము క్రిందటనే యీ భావము పరిత్యక్తమైనది. నవీనభాషలు మూలభాషకంటె భిన్నమైనను, వాని పరిశీలనము భాషాపరివర్తనమును బోధింపఁగలదే కాని, భాష యెట్లు పుట్టినదో తెలుపఁజాలదు.

బాలాటవికభాషా విధానములందుఁ గూడ భాషాపరిశోధకుని యెదుట గొన్ని తరములుగా ననేకశతాబ్దముల నుండి యభివృద్ధి చెందిన భాషా నిర్మాణక్రమ మున్నది. భాషోత్పత్తి విధాన సమస్య భాషాపరిశీలన భూమికి బాహ్యమైనది. ఆ సమస్య మానవ జాత్యుత్పత్తికి, నాఁటి సంఘపరిస్థితికి సంబంధించి, యాదిమమానవ చరిత్రకుఁ జెందినది. మానవబుద్ధి వికాసము, సంఘనిర్మాణములపై నాధారపడి భాష పరిణమించినది. కాన మానవభాష మొట్టమొదట యే రూపము దాల్చినదో నిర్ణయించుట యసాధ్యము. కాని యే యే సందర్భములందు భాషోత్పత్తి గల్గెనో తెలుసుకొన ప్రయత్నింపవచ్చును. అందు నాఁటి మానవమానసిక సాంఘికపరిస్థితులు పరిశీలనార్హములు.

I సాంఘికము

భాష యొక్క 'సంజ్ఞాపద్ధతి'. భాషోత్పత్తిని గుర్తించుట యనఁగా, మనుష్యుని స్వాధీనములో సహజముగా నున్న సంజ్ఞావిశేషములను, వాని నతఁ డుపయోగించు విధానమును పరిశీలించుటయే యగును. సంజ్ఞలనఁగా, మానవులు భావవ్యక్తీకరణమున కుపయోగించు సకలచిహ్నములని యర్థము. సంజ్ఞ లనేకవిధములుగా నుండవచ్చును గాన, భాషలు ననేకవిధము లుండవచ్చును. ఏ యింద్రియమైనను భాషను సృజించుట కుపయోగింపవచ్చును. స్పర్శ దృశ్య శ్రవణాభినయాది భాషలుండును. ఇద్దరుమనుష్యు లొకానొక చేష్ట కొక నిర్దిష్టభావము కల్పించి, దానిని పరస్పరము దమ భావములను దెలుపుకొను

నుద్దేశముతో నాచరించిన యెడల, యప్పుడే భాష యేర్పడిన ట్లగును. ఉదా: ఒక యర్థమును ప్రతిపాదించుటకై వస్త్రములపై నొకానొక పరిమళద్రవ్యమును వాడుట, ఒక రంగు రుమాలును జేబులో గనఁబడునట్లు పెట్టుకొనుట మొ॥. ఈ సంజ్ఞల యన్నింటిలోను శ్రవ్య, లేక, వాచక లేక వ్యక్తభాష యెక్కువ ముఖ్యమైనది. ఇది దృశ్యభాషచే ననుసరింపఁబడి పూరింపఁబడును. జనులందఱిలో హస్తసంజ్ఞలు, ముఖవికాసాదులును, వాక్కునకంటె తక్కువకాకుండ, భావోద్రేకములను ప్రతిపాదించును. అభినయము దృశ్యభాష యగును. లిఖితభాష దీని జాతికి చెందినదిగనే పరిగణింపవలెను. సంజ్ఞలమీఁద నాధారపడు ప్రతిపద్ధతియు నిట్టే యుండును. దృశ్యభాష శ్రవ్యభాషయంత ప్రాచీనమైనదే. వీనిలో నొక దానికంటె నింకొకటి యెక్కువ ప్రాచీనమైన దని నమ్ముటకుఁ దగిన కారణము గాని ఋజువు గాని సాక్ష్యము గాని లేదు.

శ్రవ్యభాష నుండి ప్రత్యక్షముగా దృశ్యభాష పుట్టినది. ఉదా: లేఖనము - సంజ్ఞల వివరములు. భాషలలోని వాక్యములకు శబ్దములకును సమానమైన దృశ్యముల కొఱకే యభినయశాస్త్రము కావలసి వచ్చినది. ఈ సంజ్ఞలకు మూలము దెలియరాదు కాని, ప్రతిసంజ్ఞకు నొక సాంకేతికార్థము నియమితమై యుండును. అట్టి భాషలు కృత్రిమములు. దృశ్యభాష యొక్క ప్రయోజనము సంజ్ఞలే. అవి కొండ జాటవికులు మాట్లాడు నపుడు ప్రక్కప్రక్కవిశేషముగా ప్రయోగింపఁబడును. ఇక్కడ భావములను వ్యక్తీకరించు సంజ్ఞల విధానముతో మనము వ్యవహరింతుము. అవి, ప్రాథమికభాష. శబ్దములు చేరని దూరమునకుఁగూడ నివి ప్రయోగింపనగును. ప్రక్కనున్న మనుష్యుల యవధానము ధ్వనిమూలముగ నాకర్షింపకయే నిది సంభాషణ సౌకర్యము గలుగ నిచ్చును. ఉదా: బడిలోని బాలుర చర్యలు. సంజ్ఞాభాష ప్రారంభమున నుపయోగకారియై యుండును. ఆటవికస్త్రీలు పురుషులభాష నుపయోగింపరామిచే, ధ్వనికి బదులు సంజ్ఞల నుపయోగించి, ముఖ్యముగా వారు వాడుకొందురు. శ్రవ్యభాషకు బదులుగా మాత్రము సంజ్ఞలుండును. వీని కది తనకు తాను సద్దుబాటు చేసికొన

వలెను. మూగ - చెవిటివారల సంజ్ఞాభాషకూడ శ్రవ్యభాషమీఁదనే యాధారపడినది. సంజ్ఞల మూలముననే యా మూగ-భాషాపద్ధతియు, నితరులతో సంభాషించుటయు తెలియపరచగలము. ఒక జ్ఞానేంద్రియమునకు బదులు మఱియొక జ్ఞానేంద్రియము నుపయోగింపఁజేసి, సంజ్ఞల వలన భావములను దెలుపఁగలుగు నట్లుగ మనము వారిని చేయుదుము.

సంజ్ఞాపూర్వక భాషోత్పత్తిమీఁద మూగ-చెవిటి వారి ప్రభావ ముండును. భాష సంపాద్యమా? అను విషయమున బాలు రేమియు మనకు బోధింపఁజాలరు. ఏలన, వారు పుట్టుకనుండి బాహ్యప్రపంచము నంతయు నెఱిఁగియుందురు. కాని మూగ-చెవిటి వారిలో సంజ్ఞా జ్ఞానము ను ప్రకోపింపఁ జేయవలెను. ధ్వనిమూలక భాషను నేర్వలేనివారగుటచే, వారి దౌర్బల్యమువలన వారు భాషను మాట్లాడు జనుల ప్రభావమునుండి విముక్తులగుదురు. కాని మూగ-చెవిటివారు చూడఁ గలరు. కాన భాష యెట్లు ప్రయోగింపఁబడునో వారి నేత్రములు వారికిఁ దెలుపఁగలవు. ఉదా: ఈజిప్టురాజు బాలురపైఁ జేసిన ప్రయోగము. చెవుడు-గుడ్డి రెండును గల జనులపై ప్రయోగములు చేసి చూచిన నింకను శ్రేష్ఠమైన ఫలితములు గోచరించును.

అసాధారణ వ్యక్తుల విషయములలోఁ గలిగిన భాషాభివృద్ధి వలన సాధారణ మానవసంఘములో గలిగిన భాషాపరిణామమును గూర్చి యెట్టి పరిజ్ఞానమును గలుగఁ జేయదు. సంఘమధ్యమందుననే భాష రూపొందును. మానవుఁడితర మానవునికిఁ దన భావములను దెలుపవలసిన యవసరము గలిగిన మొట్టమొదటి దినముననే భాష యుద్భవించినది. అనేకమానవుల సంపర్క ఫలితమే భాష. మాటలు లోప మయినప్పుడు సంజ్ఞలును, సంజ్ఞలు చాలనపుడు ముఖవికాసాదులు నుపయోగింపఁబడినవి. ఈ విధముగ భాష సాంఘిక కార్యమై ముఖ్యముగా, సంఘసంపర్క ఫలితమైనది. మానవుని మనస్సు దాని నుపయోగించుటకు తగురీతి యభివృద్ధి పొందినపుడే భాష సాంఘిక కార్యమగును.

ఒక సంజ్ఞకు సాంకేతికార్థము నిచ్చుటయందే ప్రాతిపదిక భాష కళ చెంది (నిలిచి)యున్నది. ఈ మానసిక విధానమే జంతువులభాష నుండి మానవులభాష ప్రత్యేకింపఁబడినది. జంతువులభాష స్వభావ సిద్ధమైన దనియు, మానవులభాష కృత్రిమము, సాంకేతికము నైనదని భావించుట దోషము. మానవులభాష జంతువులభాషకంటె తక్కువ స్వాభావికమైనది కాదు. కాని యది కొంత యుదాత్తమైనది. ఏలన, సంజ్ఞలకు వస్తుగత గౌరవము నిచ్చి మానవుఁడు దానిని సాంకేతికముగ ననేకవిధముల మార్పఁగలుగుచున్నాడు. సంజ్ఞాస్వభావమును గుర్తించుటయందే జంతు మానవభాషల భేదమున్నది. జంతువుల కరఫులు, చేష్టలు తగినట్లే యున్నవి. కాని, యవి వాక్యములలో వ్యక్తీకరింపలేవు. మనము వాక్యములోని పదములను మార్పఁగలుగుచున్నట్లు, జంతువులు దమ యరవులలోని భౌతికలక్షణములను మార్చుకొనలేవు. జంతువులభాష మారుటకుగాని, యభివృద్ధిచెందుటకు గాని వీలుపడదు. ధ్వనిచేయు పక్షి, తన ధ్వనికొకసంజ్ఞ కలదని యది యెఱుఁగదు. ఇక జంతు(భాష) ధ్వనిసూచితమైన యొక ధ్వన్యనుసరణమును ద్యోతకము చేయును. ఈ యనుసరణము లోపించి, సంజ్ఞ దనవస్తువుపై నాధారపడక యే స్వతంత్రగౌరవమును పొందుటకు, మానసికచర్య యవసరమగును.

II మానసికము

మానసికపరిణామ సమస్యను పరిష్కరించుటకు మానవకపాల శాస్త్ర విషయములు సహాయపడును. కొండగుహలలో నివసించు ప్రాచీనమానవుల కపాలములు మానవ సదృశమర్కట కపాలములతో నెంతవరకు పోలి యుండునో నీ శాస్త్రము తెలుపును. కపాలములో భాషకు సంబంధించిన ప్రదేశముల యాకారములు నియమితములైనట్లు గుర్తింపఁబడినవి. కాన భాషాపరిణామము మానవ మానసిక క్రమాభివృద్ధి ఫలితమని గ్రహింపనగును. కపాలమందలి భాషాప్రదేశమును మన మంగీకరింపవలెను. మన మనస్సుకంటె, గుహావాసి (యగుమానవుని) మనస్సు భాషాచర్యకు సరిపడి (తగి)నట్లు లేదు. భావనకు వీలగు నట్లుగ

భాషాపరిణామము

నింకను పరిణమింపని మనస్సుగల ప్రాచీనమానవులలో ప్రారంభమున భాష కేవల ముద్రేకపూరితమై యుండును. బాధ, సంతోషము, భయము, నాకలి దెలుపుటకు జంతువులు చేయు నరవులవలె, నప్పుడు భాష ప్రారంభించి యుండవచ్చును. తర్వాత నా యరవు సంజ్ఞాగౌరవ మును పొంది యితరులచే వాడఁబడియుండును. సహేతుక సాధన మగుటకుఁ బూర్వము భాష కార్యసాధనము కావలసియుండెను. సంజ్ఞల కర్థమును గల్పించుటకు మన స్సాకమా రనుకూలపడిన తర్వాత, మనస్సుతోఁగలసి పనిచేసి, వాగింద్రియమును పరిపక్వస్థితికి దెచ్చుట కీ విచిత్ర పరిశోధనమును పరిణామ మొందించుటయే మిగిలియుండును. సంఘమునంతను ననుశాసించు నియమముల మూలమున ప్రాచీన మానవ సంఘమందలి భాష స్థిరపడినది. తర్వాత క్రమక్రమముగ, సాంఘికాంతర పరివర్తనలవలన క్లిష్ట పరిస్థితు లభివృద్ధి పొంది, తదను గుణమైన యాలోచనలను భావములను వ్యక్తీకరించు విశిష్ట వాక్పరి కరముగూడ పరిణతి చెందినది. ఈ ప్రక్రియాత్మక విధి సంభావ్యమగును. సాంఘికావసరములకు మానవశక్తులు సరిపడునట్లు చేయు ప్రయత్న ఫలితమైన మానవ చర్యాత్మకమగు స్వాభావిక కృషి యొక్క ప్రయో జనము భాష నర్థవంతముగ చేయుటకే యగును. కాని మనము సంజ్ఞా త్మక జ్ఞానముతోడనే ప్రారంభింపవలెను. ఈ యాథార్థ్యము నొక మారంగీకరించి నపుడు దానినుండి భాషయంతయు క్రమవిభిన్న పరం పరల మూలమున వివరములతో స్పష్టమగును. సంజ్ఞాపూర్వకమైన యరవులనుండి నిట్లు రూపవైవిధ్యముగల వ్యక్తీకరణము నొందుట యథార్థమున కెట్టి దశల నొందినదో తెలుసుకొన ప్రయత్నించుట సాహసమగును. తెలిసిన దాని నుండి తెలియని దాని నూహించు పద్ధతి యిక్కడ నిష్ప్రయోజనమే యగును. తెలిసిన భాషల పరిణామ క్రమమును బోధించు లక్షణములు, తెలియని భాషల పరిణామును నిర్ణ యించుటకు సమన్వయింప రాదు. ఏలన, నా భాషలను మాట్లాడు వారి మానసికతత్త్వముకంటె భిన్నముగ నుండును. సంజ్ఞకు నది సూచించి వస్తువునకు, భాషారూపమునకు నది ప్రతిపాదించు వస్తువునకు

నెట్టి పరస్పర సంబంధమును లేదు ; కొన్ని నియమములకు లోఁబడియే సంబంధ మేర్పడును. వస్తువునకు పేర్ల నొసంగుటలోనే, యనఁగా శబ్ద జాలము సృష్టించుటలోనే ప్రాచీన భాషాశిల్పమంతయు నిమిడియున్నది. కొన్ని సాంఘికావసరములను తీర్పుటకొఱకు భాషోత్పత్తి జరిగినదని 'విస్కౌిటియస్' అను నతఁడు ప్రతిపాదించెను. ఫ్రాంసురాష్ట్రపతి యగు బ్రోసెస్ అను నతఁడు శబ్దముల బాహ్యరూపములను వాని యర్థములను బట్టి నిర్ణయింపఁ బ్రయత్నించెను. కాని ధనమును రొక్కముగా నిచ్చుటకు బదులుగా, కాయితపు నోట్లను గాని, చెక్కులను గాని దాని స్థానమున మారకముగా నేర్పరిచి కొనినట్లు, భాషను మాట్లాడువారి మధ్య శబ్దముల ప్రస్తుతార్థమును గూర్చి యొక విధ మగు ప్రశాంతాంగీకార ముండుట యత్యవసరము.

అనేకవిధములైన వస్తువులను సూచించుటకు సహాయపడు ధ్వనిపరంపరగాని, లేక కుక్క మొరుగుడుతో సమానమైన యరపులు గాని ప్రతి శబ్దజాలమునకు ప్రాదుర్భావ మగుచున్నది. భావబోధక ములును, వస్తుగుణమును తెలుపు నామవాచకములతోడనా, లేక పనులను దెలుపు క్రియావాచకములతోడనా భాష పుట్టినది యను విషయమును గూర్చి వాదోపవాదములు జరిగినవి. స్వరూపమున క్రియానామ వాచకములకు భేదము గోచరించినను, వ్యాకరణమున వైరుధ్యము లేదు. క్రియాచే గాని, నామముచే గాని, లేక విధ్యర్థకముచే గాని, భూతకాల ముచే గాని మన యిష్టము వచ్చినట్లు దాని ననువదింప వచ్చును. ప్రాక్తన మానవుని యరపులకును మన ప్రాచీనభాషకు మధ్య నొక ప్రవాహము గలదు. దానికి సేతువు(వంతెన) లేదు. భాష, నితర ప్రకృతి శాస్త్రములతోకంటె, సాంఘికశాస్త్రముతో బాగుగ పోల్పతగినది.

# ఎనిమిదవ ప్రకరణము

## భాష - లిపి

స్థలాంతరమందు గాని, కాలాంతరమందు గాని యుండి ప్రత్యక్షముగా మాట్లాడుట కవకాశము లేని యితరులకుఁ దన భావముల నందఁజేయవలయునను కోరిక యతిప్రాచీన కాలముననే మానవునకుఁ గలిగి యుండును. శ్రవ్యరూపమున నందచేయ వీలులేనపుడు, దృశ్యరూపమున భావముల నందచేయు ప్రయత్నము చేయఁబడును. ఆ ప్రయత్నములు ప్రారంభమున సహజముగా బహుపామర పద్ధతిలో నాటుగా నుండియుండును. కాని సరళము నిర్దుష్టములైననే కాని యవి తమ ప్రయోజనములను సాధించలేవు. దాని నతి నిర్దుష్టముగను, చాల తేలికగను సాధించుటకు మానవజాతి చేసిన సహజప్రయత్నములే లిపిపరిణామమునకు దారి తీసినవి.

భావమును కంటి కందించుటలోఁ జేయఁబడు ప్రారంభప్రయత్నమమెరికా, ఆస్ట్రేలియాఖండములందలి యాదిమవాసు లొనర్చినటువంటి చిత్రలేఖన రూపమును సహజముగా గ్రహించును. ఇవి దృశ్యమునంతను ప్రతిపాదింప దానిని ప్రేక్షకుఁడు తన విజ్ఞానానుగుణముగ దాని యాథార్థ్యమును, వివరములను వ్యాఖ్యానించుకొనును. ప్రతి సంఘమునందు నా చిత్రలేఖనమును చదువుటకును రచించుటకుఁ గూడ కొన్ని సాంప్రదాయిక సూత్రములు పుట్టుననుటలో సందేహము లేదు. కాని యా చిత్రములు సరళములును మూర్తివంతములైన వానిని మాత్రమే ప్రతిపాదింపఁ గలవుగాని, రూపరహితములైన కాల, స్థల యాథార్థ్యములను ప్రతిపాదింపఁజాలవనుట పరమ నిశ్చయము. కాన నవి సర్వసాధారణముగా వివిధములైన పరస్పర విరుద్ధవాఖ్యానముల కవకాశ మిచ్చును.

చిత్రలేఖనము

అట్టి దశయందు సంకేతమునకును మానవధ్వనికిని గాని, లేదా నంజ్ఞకు భాషకు గాని యెట్టి సంబంధము లేదనుట స్పష్టము. ఇందు

ప్రత్యక్షాకారము నిచ్చునది భావమునకు గాని భాషకు కాదనుట సత్యమే. భాష నెఱుఁగని మూఁగ-చెవిటివారి మధ్య, పరస్పర మెఱుఁగని విదేశీయుల మధ్యను జరుగు యీ విధమైన భావవ్యక్తీకరణమువలన విశదమగును. మూఁగసంజ్ఞలందులవలె, నిందుగూడ వాగింద్రియవ్యాపారము, లేక, వాని సూచనకూడ చేయదు.

ప్రాచీనచైనీయుల కాలమున నొకప్పు డాచరింపఁబడిన 'ముళ్లవ్రాత' కంటె నిది భిన్నముగాదు. 'క్విప్పువ్రాత' వలె నది స్పెయిన్ దేశీయులచేఁ గనిపెట్టబడి, పెరులోని ఇన్కాస్ ఉద్యోగులచే సక్రమముగా వాడఁబడినది. 'క్విప్పు' రెండడుగుల కంటె పొడవైన యొక పట్టి, దానికి కొన్ని రంగులదారములు

క్విప్పువ్రాఁత

వ్రేలాడ వేయఁ (కట్ట)బడియుండును. ఈ దారములు వివిధమైన రంగుల చేతను, గొన్ని విధములైన సాంకేతికములు గల కొన్ని సంఖ్యలతోడను గూర్పబడి యుద్యోగ సమాచారము లందఁజేయఁబడి విషయములు జాగ్రత్తపరుపఁబడెడివి. ఈ విధానమున వస్తుసామగ్రిని మాత్రమే కాక గుణభావ విషయములుఁగూడ ప్రతిపాదింపఁబడెను. గుణభావ విషయము లలో రంగు లుపయోగింపఁబడెడివి. ఎట్లన, ఉదాహరణమునకు 'తెలుపు' వెండికిగాని, శాంతికి గాని యుపయోగింపఁబడెడిది. అట్లే 'ఎరుపు' బంగారమును, యుద్ధమును దెలిపెడిది. ఈ పద్ధతి యుత్తరఅమెరికా యాదిమవాసుల చిత్రలేఖన పద్ధతికంటె శ్రేష్ఠమైనదే కాని, యీ యుపాయము నవలంభించు నుభయపక్షముల వారికి నీ సాంకేతికముల ప్రత్యేకార్థములను వ్యాఖ్యానములను తొలుత నభ్యసించి యుండవలెను. ఈ యాచారమున కాదిరూప మేదైనను, యోజనలకును, వివిధమైన రంగులకును, ముళ్లకును గల సంబంధము కృత్రిమమును సాంకేతికమునై, రచయితకును, చదువరికిని గూడ, ప్రస్తుతవర్ణక్రమము (అక్షరసమామ్నాయము) నందువలె, పూర్వబోధ యవసర మనుమాట యంగీకరింపక తప్పదు. కాబట్టి, యిది యొక విధమైన 'రచనా' పద్ధతి కాదని తిరస్కరింపఁజాలము. కాని యిది పూర్తిగ నసంతృప్తికరమైనదనియు, ప్రత్యేక వస్తుసామగ్రిపై నాధారపడినదనియు, కాన నిరుపయోగమైన దైనను విషయసూచనను

చేయును. ముఖ్యవిషయ మేమనఁగా నీ పద్ధతి భావములకు మాత్రమే సాంకేతికముగ నుండగలదు, కాని యా భావముల నందిచ్చు శబ్ద(ధ్వను) ములకిది యెంత మాత్రము సాంకేతికము కాలేదనుట యథార్థము. ఆ పద్ధతి స్పష్టమైన ధ్వనిసంపదగల సంజ్ఞలతో నిర్మింపఁబడ లేదు, కాని భావసంపదగల నాటుసంజ్ఞలతో మాత్రమే కూర్పఁబడినది కాన, 'ముడి లేక రంగు' యొక్క రహస్యార్థము తెలిసిన తర్వాత, విదేశ భాష మాట్లాడు జనులకు 'క్విప్పు'తో, సమానమైన భావమునే వ్రాయుట సాధ్యమగును. అనఁగా, చిత్రలేఖనమువలెనే, దానికి భాషతో నెట్టి సంబంధములేదు, కాని భావముతో మాత్రమే సంబంధము కలదు.

అమెరికాలోని యాదిమవాసులభాషలు సంకలన (Synthetic) రూపమున నుండుటచే, వారి మానసికస్థితి వికలన (analytical) పద్ధతినిఁ గోరకపోవుటచే, వాక్యమంతయు నొకటిగనే రూపొంది, ప్రత్యేక పదములును, ధ్వనులును వారికి గోచరింపవు. కాన వాక్యమందలి వివిధభాగములను ప్రతిపాదించుటకు మఱియొక క్రొత్తమార్గమునకు పోవలసవచ్చినది.

ఇది భావరచన (ideography) లేక మూలచిత్రరచన. ఇదియు వెనుకఁ దెల్పిన సంఘటన మూలచిత్రలేఖనమువలె ప్రాతిపదికయందొకటే యైనను, సమన్వయమందు భేదముగలిగి పరిణామమున కెక్కువ యవకాశ మిచ్చును. ప్రాచీన 'ముళ్ల' పద్ధతి స్థానము నాక్రమించిన చైనీయుల చిత్రలేఖ రచనమందలి బొమ్మలు, పూర్తి వాక్యములను ప్రతిపాదింపవు. వివిధపదములకు ప్రత్యేకమైన బొమ్మలు వాడఁబడి యా యాపదముల కవి ప్రాతినిధ్యము వహించును. ప్రారంభమున నట్టి యొక్కొక్కసంజ్ఞ యొక్కొక్క విషయమునకు ప్రతినిధి. గుణాత్మక విషయములకుఁ గొన్ని భావములు కలుపఁబడి సమన్వయింపఁబడును. ఎట్లన సూర్యునికి, వలయాకారమునకు కాంతులు కూర్పఁబడును. చెట్లు పాము, ఇల్లు మొదలైన వానిని గుర్తుపట్టఁదగినట్లుగా చిత్రింపఁబడును. 'వినుట' అనుభావమును వ్యక్తీకరించుటకు తలుపు ప్రక్కన చెవిని చిత్రించును. మఱికొన్ని ప్రదేశములలో నితర యుపాయములచే

భావము స్పష్టముగ గోచరించునట్లు చిత్రింపఁబడును. చైనావారిలో రెండుచేతులు కలుపుట, 'స్నేహమును' దెలుపును. ఈజిప్షనుచిత్రములలో 'దాహము'ను భావమును నీటి చిత్రమునకుఁ బరుగెత్తుచున్న యొక దూడను జేర్చుదురు. ఒకక్క-భాషలోనే యొకటే భావాత్మక విషయమును దెల్పుటకు వివిధమైన పద్ధతులు ప్రారంభమున యవలంబింపఁ బడవచ్చును. కాని చివరకు వానిలో నేదో యొకటి దాని యౌచిత్యమును బట్టియో లేదా, రచనాసౌలభ్యమును బట్టియో, లేదా ప్రామాణికత్వమును బట్టియో, సర్వజనాంగీకారమును బడయును.

అట్టి రచనల ప్రాచీనదశలో ప్రతి యొక్కొక్క- సంజ్ఞయు నొక్క- స్పష్టమైన చిత్రలేఖన మగును. సూర్యుని సంజ్ఞకు సూర్యుఁడగును. పర్వతమునకు సంజ్ఞ శిఖరములవలె నెత్తుగా పెరుగుటను నిలువుగీతలతో చిత్రించును. అట్టి మౌలిక స్పష్టతయు సంపూర్ణతయు పోషింపఁబడినచో, నొక భాషకుఁజెందు భావచిత్రము లితరభాషల మాట్లాడు వారికిఁ గూడ తేలికగా తెలియుననుట స్పష్టము. ఈ వ్యక్తీకరణ మిప్పటికిఁ గూడ (సూటియైన) ప్రత్యక్షమైన భావవ్యక్తీకరణమే గాని, భాషతోఁ గూడి లేదు. దేశాచారములను బట్టిగాని, పరిసరమందలి రూపురేఖలఁబట్టిగాని, భావప్రదర్శనములైన ప్రత్యేక భావచిత్రములందుఁగాని, లేక చిహ్నముల సరిదిద్దుటలోఁ గాని కలభేదములు తప్ప, యొకరి చిత్ర రచన చాలవరకు నితరుల చిత్రరచనతోఁ బోలియే యుండి, యొకరి చిత్రముల నితరులు భావరూపముల తగినరీతి ననువదింపఁ గల్గియుందురు.

ఒక ప్రదేశములో నట్టి గుర్తు లనేకము స్థిరపడిపోయి యామోదింపఁబడినపుడు, వాని ప్రత్యేకత గోల్పోయి, సుఖమును త్వరితముగల

గుర్తులు (Symbols)

ప్రాతఁ కనుకూలపడు సాంకేతికరూపముల నవలంబించుటకు దారితీయును. బొమ్మలతో వాని సాదృశ్యము మొదట తగుస్పష్టత గలిగియుండును. తర్వాత కేవలము సూచన మాత్రముగను, చివరకు గుర్తుపట్టుటకు బహుసూక్ష్మముగ నుండును. ఉదాహరణకు చీనాభాషలో పర్వతము సంతృప్తికరముగా ᗰ అను గుర్తుచే మొదట ప్రతిపాదింపఁబడెను; తర్వాత ⊥ మూడు

గీతలుచే మాత్రమును, చివరకు ⋀ అను గుర్తు మానవునకు చాలు నన్నట్లు సూచింపఁబడును. ఉత్తర యీజిప్షియను కాలములో నాడసింహ చిత్రముస్థానమున నొక 'అమోర్ఫస్' అక్షరము ∠ కొంత యడ్డగీతతో (b) నిలిచినది. కాబట్టి, యనేక ప్రదేశములలో కేవలము (భావ) చిత్రములనుండియే వ్రాత ప్రారంభించినను, నొక్కొక్క ప్రదేశమందలి జను లా చిత్రము లోపించునట్లుగా నందలి రేఖలను చిహ్నములుగ మార్చి వేసినను, నొకరు చేసిన మార్పులు పరిణామములో మరియొకరు చేసిన మార్పులకంటె భేదించినను, మూలచిత్రములు కొంతవరకైనను యథాతథముగా భావములలోనికి పరివర్తనము చేయఁబడకలవు. కాని, యొక విధమైన సాంకేతిక చిహ్నములు మఱియొక విధములైన సాంకేతిక చిహ్నముల నుపయోగించిన వారి కేమియు స్ఫురింపఁ జేయవు.

ఒకానొక విధమైన సంజ్ఞల నుపయోగించిన జనులైనను వాని యుపయోగమును, నర్థమునుగూడ బోధింపఁబడవలసి యున్నది. ఏలనఁగా నా చిహ్నములు తమ కథలను తమంతట తాము చెప్పుకొనఁ జాలవు. క్రీ. పూ. 2000 నాఁటికే చైనావారు తమ చిత్రములను సాంకేతిక చిహ్నములుగా హ్రస్వీకరించుకొనిరి. ఈజిప్షియను హైరాటిక్ సంజ్ఞల నెరువు తీసికొనిన సెమైట్ల కాలముననే ప్రాచీన 'హైరోగ్రాఫ్'ల బాహ్యరేఖలు నశించిపోయి బహుకాలము గతించినది. ఈజిప్టుదేశీయుల 'డెమోటిక్' వ్రాఁతలో భేద మింకను సుస్పష్టముగ నున్నది.

సకలభావముల ప్రతిపాదకమైన సన్నివేశ చిత్రముమీఁద ప్రత్యేక పదముల చిత్రణ మనేకవిధముల పరిణామమే యైనను నది యింకను భావమునకు మాత్రమే రూప మొసఁగఁగలదు. అయినను వస్తువుల (ఉదా: చెట్లు-పక్షులు) లోని వివిధ సుకుమారజాతుల నది సముచితమైన భేదముతో ప్రతిపాదింపలేదు. కాన నా పద్ధతిలో వ్యక్తీకరణలోప మగపడును. భూత వర్తమాన భవిష్యత్కాల భేదములను, సందర్భసియమములను ద్యోతకము చేయుభావములను, కృత్రిమపద్ధతులతో తప్ప చిత్రరూపమున ప్రతిపాదింపఁజాలవు. ఉదాహరణమునకు, చేదర్థకములగు 'చేసినచో, ఉన్నచో' మొదలగు భావములు చిత్రరూపమున

నిర్దోషముగను, స్వయంవ్యాఖ్యాన సమర్థతతో ప్రతిపాదింప గలవనుట యూహాతీతమైన విషయము. విశేషించి, యొక్కొక ప్రత్యేక శబ్దగత భావ మొక్కొక్క చిత్రము ప్రతిపాదించును గాన, నొకవాక్యగత భావమును వ్రాంతరూపమున ప్రతిపాదించుటకంటె నెన్ని శబ్దగత భావములున్నవో, యన్ని చిత్రచిహ్నములు కావలసియుండును. అది యథార్థభావ మస్తమించిన కేవలసాంకేతిక చిహ్నములవలె నుండును. లేఖకుఁడును, పాఠకుఁడునుగూడ బహుసంఖ్యాకమైన వివిధసంజ్ఞలను నేర్చు కొనవలసియుండును. కాన నా పద్ధతియంతయు బహుకష్టముగను, తిక మకలు గలదిగా నుండును. చైనావారు సదృశమైన ధ్వనుల కొక్కటే సంజ్ఞ నుపయోగించి, బహు నైపుణ్యముతో నీ పద్ధతిని తేలికగ చేసినను, వారు ప్రధానచిహ్నములను 500 కంటె నెక్కువకు తగ్గించ లేక పోయిరి.

అయినప్పటికి నీ (ఏక, భావ) చిత్రరచన నుండియు, దాని లఘ్వీ కరణమైన సంజ్ఞలనుండియే స్వరగతమును చివర కక్షరసమామ్నాయ మునగు వ్రాంతపుట్టినది. ఒకానొక భావమును ప్రతిపాదించు గుర్తు ఒకానొక ధ్వనిని ప్రతిపాదించు సంజ్ఞగా నెట్లు మారినదో, అనఁగా భావరచననుండి ధ్వనిరచన యెట్లు రూపొందినదో యా విధానమును గుర్తించుట కష్టము గాదు. వ్యవహారమునకుఁ గావసినంతవరకు చారిత్ర కముగా దానిని ఋజువుచేయ వచ్చును.

అర్థభేదముగలిగినను ధ్వనిసామ్యముగల పదము లన్ని భాష లందు స్వల్పముగనో యధికముగనో యుండును. ఆంగ్లభాషలో hare hair, air-heir, I—eye, all-awl, box in different senses etc. తెలుఁగులో నల్లే వెలుగు - వెలుఁగు; తరి - తఱి; హారిక్లిష్టార్థ లటువంటివే. వీని నాంగ్లములో Homophones అందురు. కొన్ని భాష లలో నేకధ్వనికల పదము లనేక ముండుటచే, నవి చైనాభాషలో వలె ఏకస్వరపదములుగా (monosyllables) లఘ్వీకరింపఁబడినవి.

హేతువాదము రీత్యా, బొమ్మలనుండి లేక భావచిత్రములనుండి పుట్టిన (వ్రాతగుర్తులు లేక) లేఖనచిహ్నములు, వివిధార్థములు గల

శబ్దములందలి ప్రతివిధమైన భావమునకు గూడ నొక్కొక్క-బొమ్మ యుండి తీరవలెను. చిత్రరచనను వెలుఁగులోనికిఁ దీసికొని వచ్చిన చైనా, ప్రాచీన ఈజిప్టు దేశభాషలు రెండునుగూడ, చాల త్వరలోనే, శబ్దముయొక్క-యర్థముతో కంటె దాని ధ్వనితోడనే సంజ్ఞను గుర్తించుటకు సాగించినవి. ఈ లిఖితచిహ్నము బొమ్మయే యగుచో నీ పద్ధతి యంత సిద్ధముగా నుండక పోవచ్చును. కాని సంజ్ఞనుండి బొమ్మ యదృశ్యమైనచో నిది సులభమే యగును. చైనాభాషలో 'hua' 'హ్వ్యా' అను సంజ్ఞకు, డేగ, రాకుమారుడు, చల్లని నీరు, భయము మొదలైన యనేకార్థము లున్నవి. ఈజిప్షను భాషలో 'mer - మెర్' అను సంకేతమునకు 'ప్రేమ - కన్ను' అను నర్థములు గలవు. కాన చైనావారు 'హ్వ్యా' అను నుచ్చారణ నొక్కటే వినగానే వారి మనస్సునకు ఆ సంజ్ఞకుఁగల వివిధార్థములలో నేదోయొక్కటి స్ఫురింపవచ్చును. కాని యీ (ధ్వనికి) స్వరమునకు సర్వసాధారణముగను లేక ఘనతతోడ నుపయోగించు నర్థమే సహజముగా తట్టును. 'హ్వ్యా' అను ధ్వనికి ముఖ్యముగా 'రాకుమారుడని' సూచన యగును. కనుక 'హ్వ్యా' అను సంజ్ఞ 'హ్వ్యా' అను ధ్వని స్థానమున నిలుచును. అనఁగా, సంజ్ఞ కేవలము ధ్వనిమయమైన విలువను సంపాదించును. లేదా ధ్వన్యాత్మక మగును. (phonogram). ఇట్టి స్థితిలో నొక టేధ్వని కలిగినవి వివిధార్థములు గల సంజ్ఞలు (అసలు చిత్రలక్షణము నశించినపుడు) వాడుకలో తికమకలు గల్గించి, వ్రాతప్రయోజనమునే చెడగొట్టును. సంజ్ఞ కర్థమున కంటె ధ్వనికే యెక్కువ సమన్వయము కూర్చినచో సాధారణముగ వర్ణక్రమములో తప్పు (missplelling) వాటిల్లును. ఉదా: ఆంగ్లభాషలో 'their for there, here for hear' మొ॥ ఒకదాని కింకొకటి వ్రాయఁబడును. కాన ననేకార్థములు గల పదము లగమ్యగోచరము లగును. అందుచే నితరార్థములను దెలుపుటకు మూలధ్వనిగుర్తుకి సహాయ సంజ్ఞలు చేర్పఁబడును. ఈజిప్షియనుభాషలో ధ్వనిసంజ్ఞకు ప్రక్కన ప్రాచీనచిత్రములు కలుపఁబడి యర్థము స్పష్టపఱుపఁబడెడివి.

ఈ రీతిగ విచిత్రమైన చిత్రరచన మూలమున సంజ్ఞల ప్రతిపాదకత్వము భావాత్మకము నుండి ధ్వన్యాత్మమునకు మార్పఁబడుట ప్రత్యక్షముగ (యంగీకరింపఁబడి) యామోదింపఁబడినది.

ఆ విధానము స్పైనీయుల విజయమునకుఁ బూర్వమే చిత్రరచనలో ముందడుగు వేసిన (Aztecs) 'అజ్టెకు'ల వ్యవహారమునుండి స్పష్ట పరుపవచ్చును. వారు 'లాటిన్'లోని 'pater noster' పదమును తమకున్న గుర్తులతో నిట్లు ప్రతిపాదింప ప్రయత్నించిరి. 'అజ్టెక్' భాషలో pan=pennant=జండా ; tetle=stone=రాయి. జండాబొమ్మతో రాయిబొమ్మను కలిపినచో pa(n)-te(tl) 'పాటి' ధ్వనిని సూచించును. అట్లే nos=cactus-fig=అత్తి (చెట్టు). కాన అత్తిచెట్టు బొమ్మతో రాయి బొమ్మను కలిపిన చిత్రము 'nos-te=నోస్టి' ధ్వనిని సూచించును. కాన 'జండా + రాయి + అత్తి + రాయి' గుర్తుల దర్శనమువలన 'అజ్టెకు'ల మనస్సుకు 'pasternoster' 'పాస్టర్ నోస్టర్' అను ధ్వనిని వీలున్న దగ్గర గుర్తులు స్ఫురింపఁజేయును. ఇంతటితో చిహ్నము దాని భావముతో వియోగమును, దాని కేవలధ్వనితో సంయోగము సిద్ధించుచున్నది.

ఇంతవరకు సంకేతమునకు ధ్వన్యాత్మకమైన విలువ సిద్ధించినదే కాని, స్వరమునకు గాని, వర్ణమునకు గాని విలువ యేర్పడ లేదు. ఇక్కడ కూడ గుర్తు ఉచ్చారణ ధ్వనిసముదాయమును ప్రతిపాదించినది కాని యందలి వివిధభాగములను ప్రతిపాదింపదు. చైనావారి 'ta' గుర్తులో కూడ 't' కును 'a'కును ప్రతేకమైన గుర్తులు లేవు. బహు ప్రాచీన యీజిప్షియనులలోగూడ 'nefer' 'నీఫర్' అను పదమున కంతకుఁ గలిపి యొక గుర్తు గలదు. కాని, ప్రత్యేకముగ n, e, f, r వర్ణములకు క్రమముగా గుర్తులు లేవు. బహుప్రాచీన లేఖనములందు వర్ణసమామ్నాయాక్షరములు కొంతవరకున్నట్లు గోచరించును. అందుచే నంతకు పూర్వము నిరక్షరదశ యుండి యుండునని యూహింపఁబడినది. చైనాభాషయందు పదములే స్వరయుతము లగుటచే, నొక్కొక్క యక్షర మొక్కొక్క స్వరము కంటె నెక్కువ ప్రతిపాదింపదు. ఉదా: ta, త, min; మీన్, pad పా మొ॥. ఈజిప్షన్ భాషలో గూడ ధాతు

వులలో చాలభాగ మేకస్వరయుతములే కనుక నందలి సంజ్ఞలు చాలవర కేకస్వరముల విలువ గలవియే యైయున్నవి.

చైనాభాష యేకస్వరములతోఁ గూడిన శబ్దములు గలదగుట చేతనే యొకసంజ్ఞ, ధ్వనిసముదాయము గల స్వరము (syllable) ను ప్రతిపాదించు దశలోనే వ్రాత యాగిపోయినది. ఏకస్వరముగూడ గొన్ని ధ్వనుల సముదాయమే యను సత్యమును చైనీయుల మనస్సునకు తట్టుటకు వీలుపడక పోయినది. తమ భాషలో పదముకంటె చిన్నదైన ధ్వని పరిమాణ మున్నదను భావమే యా రచయితలు గ్రహించినట్లు లేదు. కాని యీజిప్షియనులలో నీ విషయము భిన్నముగా నున్నది. చైనీయుల వలె వీరి పదములు ధ్వనియందును, పొడవునందును మార్పు లేక యుండునవి కావు. వ్యాకరణ సంబంధమును వ్యక్తీకరించు పట్ల, వానికి ప్రత్యయములు, నుపసర్గలును గలుపఁబడును. ఆ పదములు ధాత్వర్థ పరివర్తనమునకుఁ దగినట్లుగ నాంతర పరివర్తనమునుగూడ పొందును.

ఈ యుపసర్గలు, ప్రత్యయములు నొక యచ్చుగా గాని, హల్లుగా గాని లేక స్వరముగా గాని యుండును. కాని, రచయిత యట్టి మార్పును గూర్చు యేకధ్వని మాత్ర ద్రవ్యమును గుర్తించియే యుండును. అవి యాతని మనస్సులలో నొక స్వతంత్రస్థానమును సంపాదించి పెట్టును. ఆ రీతిని ఆ భాషలో (son) 'సాన్' (brother) 'సోదరుడు' అను పదము నుండి 'సాన' (నా సోదరుడు); 'సానక' (నీ సోదరుడు); 'సాన్ఫ' (వాని సోదరుడు) 'సాను' (సోదరులు) 'సాన్ట' (సోదరి) అనునవి కూర్పఁబడును. దీనిని బట్టి 'అ, క్, ఫ్, ఉ, ట్' అను ప్రత్యేక ధ్వనులు స్వతంత్రస్థానమునకు హక్కును సంపాదించుకొని గల్గుచున్నవి. కనుక ధ్వనులసమూహా మాంతరభాగములుగ నేర్పడు ననుట నిశ్చయము.

ప్రత్యేకధ్వనులు (isolated sounds) గుర్తింపఁబడుటకుఁ గొంత పూర్వము స్వరములు (syllables) గుర్తింపఁబడుట యవసరము.

లేఖనచరిత్రలో తర్వాత వచ్చిన దశ చాలా శ్రేష్ఠమైనది. ఒకానొక స్వరమునకు గాని, లేక ధ్వనిసముదాయమునకుఁ గాని, బహు

లుగా దాని ప్రారంభధ్వనికి మాత్రమే ప్రారంభాక్షరము లేక వర్ణము నుపయోగింప నిచ్చుటలో నీ దశ యేర్పడినది. ఆరీతిగ, డేగ అను అర్థముగల 'అహోం' అను ధ్వని సమూహము మూలమున ఆ పక్షి చిత్రము - 'అ' అను అక్షరమునకు ప్రతినిధిగా నిలచినది. అట్లే, (మూలమందు 'నోరు' బొమ్మను తెల్పు 'రొ-ro') అను ధ్వనిసమూహమునకు ప్రతినిధిగా 'ర r' అను నొక్క-ధ్వని మాత్రమే నిలిచి, దానికి 'r ర' అను అక్షరము ప్రతినిధి యాయెను. 'lalvi (lioness ఆడసింహమునకు 'ల l' అక్షరము నిలిచినది. ఇట్లు సహజముగా, కొలది, గొప్ప సంఖ్యగల వర్ణము లొకటే ప్రయోజనమున కుండగలవు, అనగా నొకటే యక్షరము ప్రారంభమున గల యనేకస్వరములు లేక ధ్వనిసముదాయము లుండగలవు. (ఉదా: ret, ra మొ॥ రొ ro తోపాటు 'ర' కారముతో మొదలిడఁగలవు. ఇందులో నేది ప్రారంభ 'ర' కారము సార్వజనీనముగా ప్రతిపాదింపఁగలదను ప్రశ్నకు సమాధానము నితరముకంటె నేది సర్వసాధారణముగను, తేలికగ నుపయోగింపఁబడునో దాని నది దెలుపును.

ఈ రీతిగ యథార్థమైన వర్ణసమామ్నాయము, తాత్కాలికముగ పుట్టినది. బహుప్రాచీన లేఖనములలో స్వచ్ఛమైన వర్ణసమామ్నాయము గనఁబడుచున్నను, ప్రాచీన ఈజిప్టు దేశీయులు దానిని సక్రమముగను స్వచ్ఛముగ నుపయోగింప లేదు. ప్రాత భావచిత్రములను, స్వర ధ్వని రేఖలనుగూడవారు కలిపివాడుట సాగించుచునే యుండిరి. సక్రమమైన వర్ణసమామ్నాయము నుపయోగించుట, ఇతరులు దమ భాషకు వాడుకొనుటకుగాను నెరువుగ పరిగ్రహించినపుడే, విజయమును సాధించినది.

---